PRSVI4O2A127

సాహిత్య ప్రస్థానం
సంపుటి : 11 మే 2011 సంచిక : 65

# వేసవి వేకువ

రాష్ట్ర వ్యాపితంగా రోజు రోజు వెల్లడవుతున్న రాక్షస ఘటనలు నాగరిక విలువలనే ప్రశ్నిస్తున్నాయి. మహిళలపై మరీ ముఖ్యంగా యువతులపై అఘాయిత్యాలు సమాజాన్ని కుదిపేస్తున్నాయి. భద్రతారాహిత్యం తాండవిస్తున్నది. మరోవైపున రాజకీయ అవినీతి, అవకాశవాదాలు జుగుప్సాకరంగా మారుతున్నాయి. అనిశ్చితికి మూలం అవకాశవాదమే. అయితే ఈ వికృతాల్లో చాలావాటికి నేడు విశ్వవ్యాప్తమైన విష సంస్కృతి, వినిమయ తత్వం, విలాస లాలస నేపథ్యంగా వున్నాయి. అంతు తెలియని ధనాఢ్య శక్తుల ఆధిపత్యం ముందు ప్రజాస్వామ్యం చిన్నబోతున్నది. ఘనంగా చెప్పుకునే భారతీయ సంస్కృతిలో మూఢత్వం మాత్రమే ప్రోద్బలం పొంది లౌకిక భావనలు హేతు దృష్టి కొడిగట్టడానికి ఇవి కారణమవుతున్నాయి. పుట్టపర్తి బాబా కన్నుమూత సహజమైనా అంతకన్నా ముందు సాగిన అంతులేని నిగూఢత అనేక అనుమానాలకు బలం చేకూర్చింది. రేపటిపైనా నీలి నీడలు ప్రసరించింది. అంతర్జాతీయంగానూ లిబియా అంతర్గత పరిణామాల్లో అమెరికా జోక్యం మరోసారి దురాక్రమణ స్థాయికి చేరుతున్నది.

ఇవన్నీ దేశం ముందున్న హెచ్చరికలు ప్రజాస్వామ్యవాదులకు సవాళ్ళు. చైతన్య వ్యాప్తికి దోహదపడవలసిన రచయితలు, కవులు ఈ మూలమలుపులో తమ అవగాహనకు పదును పెట్టుకుని మరింత క్రియాశీలం కావలసి వుంది. మానవీయ ఆలోచనలకు, ఆచరణకు మార్గదర్శకులు కావలసి వుంది. అందుకు ఈ వేసవి సెలవుల కాలాన్ని సద్వినియోగం చేసుకోవాలి. సాహితీ గోష్టులు, చర్చలు, శిబిరాలు నిర్వహించుకోవడం అందుకు ఎంతైనా దోహదకారి అవుతుంది.

బొమ్మలు : శివాజి, వెంకటేష్

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్‌టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : Prasthanam_ss@yahoo.co.in
ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ

# కూలిపోయిన సున్నపు బట్టీ



- ఆవుల వెంకటేశులు

**కాలిన సున్నాన్ని బట్టీ నుండి వెలుపలికి తీయటానికి పలుగును పట్టుకొని కొండ ప్రక్క ఉన్న సున్నపు బట్టీ వద్దకు వెలుతున్న సిద్ధయ్యకు అల్లంత దూరంలో కొత్తగా నిర్మించిన ఫ్యాక్టరీ దగ్గర ఇసుక చల్లితే రాలనంత జనం గుమిగూడి కనపడ్డారు. పోలీసులు తుపాకులు పట్టుకొని అప్రమత్తంగా ప్రతి ఒక్కరి కదలికను గమనిస్తున్నారు.**

విషయం తెలుసుకుందామని సిద్ధయ్య బిక్కుబిక్కుమంటూ వెళ్లాడు. ఇంతలో వేదిక మీదికి వచ్చిన మంత్రివర్యులు భుజంపై వున్న కండువాను సర్దుకొని, జనంవైపు చూస్తూ అభివాదం చేస్తూ దర్పంగా మైకు దగ్గరికి వచ్చి గొంతు సవరించుకొని "అన్నల్లారా! ఆడపడుచుల్లారా! అందరికీ దండాలు పెడ్తున్నా. మీ సంక్షేమం కోసం మీ గ్రామమే కాకుండా పరిసర గ్రామాల బాగు కోసం, ఈ రోజు ఇక్కడ పారిశ్రామికవాడలో ఉత్పత్తి అయిన మీకు కావాలసిన అన్ని వస్తువులను మార్కెట్‌లోకి విడుదల చేస్తున్న మంచిరోజు. ఎన్నో వ్యయప్రయాసల కోర్చి పట్నానికి పోవలసిన అవసరం లేదు. పైగా చదువుకున్న నిరుద్యోగులైన యువకులకు ఉపాధి లభిస్తుంది. మీ గ్రామాలన్ని త్వరలోనే ఎంతో అభివృద్ధి చెందుతాయి. అందరికీ ఇవే నా దండాలు." మంత్రివర్యులు తన ప్రసంగాన్ని ఆపి చిరుమందహాసంతో, గాలిలోకి తన కుడిచేతిని ఎత్తి వూపుతున్నాడు ఆపద్బాంధవునిలా.

కపటం తెలియని గొర్రెపిల్ల కసాయిని చూసి సంబరపడుతున్నట్లు, జనం మంత్రిగారి ప్రసంగం విని జే కొడుతుంటే ఆ ప్రాంతమంతా చప్పట్లు, ఈలల శబ్దాలతో మారుమ్రోగిపోతున్నది.

మన ఊళ్లకు మంచిరోజులు వచ్చినాయి. సిద్దయ్యా! ముడినూలు, కంబళ్లకు వేసే జిగురు, మగ్గాలకు కావలసిన పరికరాలు, చీరలకు, కూజాలకు వేసే రంగులు అన్నీ చౌకగా లభిస్తాయట. భుజంతట్టి చెబుతున్నాడు సాలే సుంకయ్య.

"మన వూళ్లు చేసికొన్న పుణ్యమప్పా సుంకయ్యా! బీదబిక్కి బతకటానికి పని దొరుకుతుంది. చదువుకున్న పిల్లలకు ఉద్యోగాలు లభిస్తాయి. ఇంకొన్నాళ్లకు మన గ్రామాల తీరే మారిపోతుంది." ఊహల పల్లకీలో తేలిపోతున్నాడు సిద్ధయ్య.

"సిద్దయ్యా! పోదాంపద మంత్రిగారు వెళ్లిపోయారు. సమావేశం ముగిసింది" అన్న సుంకయ్య పిలుపుతో ఈ లోకంలోకి వచ్చిన సిద్ధయ్యకు బట్టీలలోని సున్నం గుర్తుకురాగా బట్టీల దగ్గరికి చేరుకున్నాడు సంబరంగా.

బట్టీలలో వున్న సున్నాన్ని వెలుపలికి తీసి బస్తాలలో నింపి, పట్నానికి తీసుకొని పోవటానికి సిద్ధం చేసి, జరిగిన సంగతంతా లచ్చికి చెబుదామని పెద్దపెద్ద అడుగులేసుకుంటూ ఇంటికి వచ్చినాడు సిద్ధయ్య.

సంగతంతా విన్న లచ్చి దీర్ఘంగా నిట్టూర్చి "పాము వచ్చి ఎలుకను మింగినట్లు, మనలాంటి వృత్తి పనివాళ్ల బతుకులు బుగ్గిపాలు కాకుంటే చాలు మామా! అంది విచార వదనంతో.

"పారిశ్రామికంగా అభివృద్ధి చెందితేనే దేశం అభివృద్ధి చెందుతుందట పారిశ్రామికవాడ వెలిసింది కాబట్టి మనదేశం అభివృద్ధి చెందినట్లే" అన్నాడు సిద్దయ్య.

"అమాయకంగా అయోమయంగా తన కళ్లలోకి చూస్తున్న లచ్చిని చూచి "ఓసి! నా పిచ్చి లచ్చీ! అమెరికా, జర్మనీ, జపాన్ వంటి దేశాలు పరిశ్రమలు విరివిగా స్థాపించుకోవటం చేతనే సంపన్న దేశాలుగా ప్రగతిపథంలో పయనిస్తున్నాయట. కొత్త విషయాన్ని కనుగొని లోకానికి తెలియజేసిన శాస్త్రవేత్తలా ఫోజు పెట్టినాడు సిద్దయ్య.

సిద్దయ్య ఆశల సౌధాన్ని మాటల తూటాలతో పేల్చి వేయటం ఇష్టం లేక మౌనంగా వంటింట్లోకి వెళ్లిపోయింది లచ్చి.

... ... ...

ఉదయాన్నే సున్నపు బస్తాలను బస్సుపై వేసుకొని పట్నం బయలుదేరాడు సిద్దయ్య.

"సిద్దయ్య మనసులాగే సిద్దయ్య సున్నం నవనీతమప్పా! సిద్దయ్య సున్నాన్ని ఇంటిగోడలకు వేస్తే సమస్యలతో సతమతమవుతున్న ఇళ్లు కూడా శాంతి నిలయాలు అవుతాయి. పెళ్లీడుకొచ్చిన పిల్లలకు పెళ్ళిళ్ళు ఇట్టే జరిగిపోతాయి. సిద్దయ్య సున్నం సుఖసంతోషాలను కొని తెచ్చే దివ్యలేపనం. సిద్దయ్య కొడుకు తప్పకుండా ఇంజనీర్ అవుతాడు. సున్నపు బట్టీలకు అల్లంత దూరంలో జనాలు మాట్లాడిన మాటలు సిద్దయ్యను మరో ప్రపంచంలోకి తీసుకొని పోతున్నాయి.



"కిర్రుమని బస్సు ఆగిన శబ్దానికి ఉలిక్కిపడి లేచి, పైనున్న సున్నపు బస్తాలను గబగబ కిందికి దించి ఊరు చావిడి దగ్గరికి చేర్చాడు సిద్దయ్య.

"బస్తాలలోని సున్నాన్ని గంపలోకి నింపుకొని "సున్నమమ్మో సున్నం" అంటూ వీధిలోకి వెళ్ళిపోయాడు. "సున్నమమ్మో సున్నం" అని కేకలేస్తూ ఊరంతా కలియతిరిగినా కనీసం బోణికాలేదు."

అప్పటికే ఎండమండిపోతున్నది. ఎన్నడూ రానంత కోపం సూర్యుడికి వచ్చిందేమో తన ప్రచండ కిరణాలతో నేలతల్లిని అగ్నిగుండంగా మారుస్తున్నాడు. తీక్షణమైన కిరణాలు చిరిగిన బనియన్ గుండా సిద్దయ్య శరీరాన్ని కసిగా తాకటంతో వెచ్చని రుధిరం చల్లని స్వేదంగా మారి సిద్దయ్య ఒంటిని చల్లబరుస్తున్నది. అప్పటికే శక్తి సన్నగిల్లి అడుగులు తడబడుతుంటే నాలుక పిడుచ కట్టుకొని పోతున్నది. కొడుకు ఇంజనీర్ కావాలన్న కోరిక కాస్త శక్తిని కలుగజేస్తుంటే పెగలని గొంతుకతో 'సున్నమమ్మో సున్నం' అటూ సూర్యునితో పోటీ పడి సాయంత్రం మూడు వరకు గడపగడపకు వెళ్లి ప్రాథేయ పడినా రూపాయి బేరం కాలేదు.

"చేసేది లేక ఉసూరుమంటూ ఊరికి తిరిగి వస్తుంటే దారి పొడుగున "చౌక బేరం" ఒకటికొంటే ఒకటి ఉచితం' అని రాసి వున్న పెద్ద ఫ్లెక్సీలు సిద్దయ్యను చూసి వికటాట్టహాసం చేస్తున్నట్లుగా కన్పించాయి.

అమాంతంగా ఏదో దయ్యమో పిశాచమో వచ్చి సున్నపు గంపను విసిరేసి తనను పాతాళానికి తోసివేసినట్లుగా భయం, బలహీనత సిద్దయ్యను ఆవహించగా పక్కకు జారిపోతున్న సున్నపు గంపను సరిగా తలపై పెట్టుకొని ఆ దారి వెంట వస్తున్న సత్యం మాష్టార్ని పలకరించాడు సందేహ నివృత్తి కోసం సిద్దయ్య.

"మాష్టారూ!... ఈ కటౌట్లు... ఫ్లెక్సీలు..."

"ఓ! అదా సిద్దయ్యా! మనం వూరి ప్రక్కన మొన్ననే పారిశ్రామికవాడను ప్రారంభించారు గదా! దాని తాలూకా ఇవన్నీ" సత్యం మాష్టారు విషయాన్ని బోధపరిచాడు సిద్దయ్యకు.

"నాకు తెలియక అడుగుతాను మష్టారూ! నేను ఎప్పుడైనా సున్నం కొనండి' అని బోర్డుపెట్టానా! అమాయకంగా ప్రశ్నించాడు సత్యం మాస్టార్ని సిద్దయ్య.

మాస్టారు నవ్వుతూ, "అవును సిద్దయ్య నిజమే, నీ వృత్తిని కాపాడుకుంటూ, కుటుంబ పోషణార్థంతోపాటు సామాజిక సంక్షేమం అన్న ఆశయం నీ వ్యాపారంలో అంతర్లీనమై వుంది. కానీ నేడు సామ్రాజ్య వాదులు, మనదేశంలో ధనికస్వాములతో జతకట్టి, ఇలాటి పారిశ్రామికవాడలను ఏర్పాటు చేసి కులవృత్తులను మంటగలుపు తున్నారు. "ఫలానా సబ్బుతో ఉతికితే బట్టలు తళతళ మెరిసిపోతాయని, కంపెనీ సూటింగ్స్‌ను ధరిస్తే మహరాజులా వుంటారని, ట్రేడ్ మార్కు వున్న నూనెను తలకు రాసుకుంటే శిరోజాలు సున్నితంగా మరింత కాంతివంతంగా మెరిసి పోతాయని", ఫలానా కంపెనీ వంటనూనెను వాడితే శరీరంలో కొలెస్ట్రాల్ తగ్గి ఆరోగ్యంగా వుంటారని", 'సిగరెట్ తాగితే హుషారుగా వుంటారని", జనతా సున్నాన్ని గోడలకి వేస్తే ఇల్లు కొత్త ఇల్లు అవుతుందని" టి.వి.లు, రేడియోలు, పత్రికల ద్వారా ప్రచారం చేసి, కొనుగోలుదారుల్ని ప్రభావితం చేసి, వ్యాపారాన్ని బలవంతంగా వారిపై రుద్దుతున్నారు.

పైగా "సున్నం కొంటే చింతపండు" 'ఉప్పుకొంటే పప్పు", 'సబ్బు కొంటే స్నో పాకెట్' 'చీర కొంటే జాకెట్టు' 'టీవి కొంటే బంగారు గొలుసు' ఉచితం అని నమ్మించి రెండు వస్తువుల ధరను ఒకే వస్తువుపై మోపి, ఇంకో వస్తువును ఉచితంగా ఇస్తున్నట్లు నమ్మించి మోసం చేస్తున్నారు" సిద్దయ్యకు సోదాహరణంగా వివరించే ప్రయత్నం చేశాడు సత్యం మాస్టారు.

"మనుషులు తయారు చేయలేని పెద్దపెద్ద, యంత్రాలను, వస్తువులను ఉత్పత్తి చేయవచ్చు కాని ఇదేమిటి సార్! చీపుర్లు, కుండలు,

సున్నం, కంబళ్ళు, చేటలు, కూజాలు తయారు చేసి వృత్తి పనివాళ్ల బ్రతుకులను బజారుపాలు చేస్తున్నారు". ఆవేదనను అణుచుకుంటూ సాలోచనగా ప్రశ్నించాడు సిద్దయ్య సత్యం మాస్టార్ని"

"అవును సిద్దయ్య! సామ్రాజ్యవాదుల లాభం కోసం, అభివృద్ధి పేరుతో పారిశ్రామికవాడలను నిర్మించి, కులవృత్తులను సర్వనాశనం చేస్తున్నారు" పెల్లుబుకుతున్న ఆవేశాన్ని గొంతులో దాచుకొని విశ్లేషించాడు సత్యం మాస్టారు.

సున్నం వ్యాపారం, ఎందుకు పడిపోయిందో అర్థం కావటంతో ఒక్కసారిగా నిరాశ నిస్పృహలు ఆవహించగా మాస్టారుతో సెలవు పుచ్చుకొని, నీరసించిన శరీరాన్ని మోసుకొని ఇంటికి వచ్చినాడు సిద్దయ్య.

భర్త కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్న లచ్చి, భర్తరాకను గమనించి" ఎందుకు మామా ఇంత ఆలస్యమైంది, ప్రొద్దుట నుండి చంద్రం రెండుసార్లు ఫోన్ చేసినాడంట పక్కింటి పిన్నికి. హాస్టల్ ఫీజు రెండువేలు అర్జెంటుగా పంపాలట." గడగడ విషయాన్ని వెళ్లగక్కింది లచ్చి సిద్దయ్యతో.



పెద్ద బండరాయి వచ్చి తలమీద పడ్డట్టు అయింది. సిద్దయ్యకు నోటమాట రాలేదు. పరధ్యానంగా ఆకాశం వంక చూస్తున్నాడు సిద్దయ్య.

"ఏమిటి మామా! చంద్రం ఇంజనీయర్ అయితే చూడాలని లేదా? ఆలోచిస్తున్న సిద్దయ్య భుజాలను తట్టి మరీ అడిగింది లచ్చి"

"చంద్రం ఇంజనీయర్ అయితే చూడాలని నీకంటే నాకే ఎక్కువ ఆశగా వుంది లచ్చీ! ఆ ఫ్యాక్టరీ వస్తువులు అమ్మకం మొదలైనప్పటి నుంచి సున్నం వ్యాపారం పూర్తిగా పడిపోయింది" సరే ఎవరినైనా అప్పు అడగి రేపు పంపుతాను" అని ముక్తసరిగా జవాబిచ్చాడు సిద్దయ్య.

ఇప్పటికే లచ్చికి తెలియకుండా అప్పులు చేసి సిద్దయ్య సంసారాన్ని నెట్టుకొస్తున్నాడు.

ఊళ్లోకి వెళ్లి ఎవరిని అప్పు అడిగినా "లేదు" అన్న సమాధానమే ఎదురైంది చివరికి వున్న ఇంటిని సుంకయ్యకు తాకట్టుపెట్టి రెండువేలు తెచ్చి చంద్రంకు పంపినాడు సిద్దయ్య.

అప్పులు అధికం కావటం, సున్నం వ్యాపారం పడిపోవటంతో అప్పులోళ్లు వచ్చి ఎప్పుడు మీద పడతారోనన్న భయం పట్టుకోవటంతో ఆరోజు రాత్రి ఆత్మహత్య చేసుకోవాలనుకున్నాడు లచ్చి ఒక్కతే సంసారాన్ని సాగించలేదని విరమించుకున్నాడు. రాత్రంతా ఆలోచించి ఫ్యాక్టరీలో కూలీగా చేరటానికి నిశ్చయించుకొని ఉదయమే విషయాన్ని లచ్చితో చెప్పినాడు సిద్దయ్య.

"ఏమిటి మామా! తాత, ముత్తాతల నుండి చేస్తున్న సున్నపు వ్యాపారాన్ని మానేత్తావా? ఫ్యాక్టరీలో పనంటే కత్తిమీద సాములాంటిది. ఎప్పుడు ఏం జరుగుతుందో తెలియదు. నా మాట విను మామా ఎలాగో ఓలా, సున్నపు వ్యాపారాన్నే కొనసాగిద్దాం" అంది లచ్చి సిద్దయ్యతో భవిష్యవాణి తెలిసిన కాలజ్ఞానిలా.

"అది, అది కాదు లచ్చీ! నెలకు రెండువేల జీతం, వేయి రూపాయలు చంద్రంకు పంపినా వేయి రూపాయలతో మన సంసారం సాఫీగా గడచిపోతుంది. పైగా సంవత్సరానికి రెండు నెలల జీతం బోనస్‌గా ఇస్తారట" తప్పదన్నట్లు బలవంతంగా లచ్చిని ఒప్పించాడు సిద్దయ్య.

"కాసుల వర్షాన్ని కురిపించిన సున్నపు బట్టీలకు యజమాని అయిన సిద్దయ్య కూలీగా ఫ్యాక్టరీకి వెళుతుంటే దారి ప్రక్కనున్న సున్నపు బట్టీలు గుండెలు పగిలి ఆక్రోశిస్తున్నాయేమో అన్నట్లు పెచ్చులూడి బీటలు వారుతున్నాయి.

ఫ్యాక్టరీ పొగ ఆరోగ్యాన్ని హరిస్తుంటే కొడుకు చదువు కొనసాగాలన్న కోరిక సిద్దయ్యకు శక్తిని అందిస్తుంటే బతుకు బండిని లాగుతున్నాడు సిద్దయ్య"

"కాలచక్రం గిర్రున తిరిగింది. ఫ్యాక్టరీ కూలీగా సంవత్సరం పూర్తి చేశాడు సిద్దయ్య. ఆ రోజు సాయంత్రం మూడు గంటలు ఆకాశంలో దట్టమైన మేఘాలు కమ్ముకొన్నాయి. భూగోళం మండి పోతుందేమోన్నంతగా మెరుపులు, దిక్కులు పిక్కటిల్లేటట్లు ఉరుములతోపాటు, మంటికి మింటకి ఏకదాటిగా వర్షం కురవటం ప్రారంభమైంది. ఇదేమి పట్టనట్టు సిద్దయ్య తన పనిలో నిమగ్నమై వున్నాడు. ఏం జరిగిందో తెలియదు కాని సిద్దయ్య పనిచేస్తున్న యంత్రం నుండి "ఢాం' అంటూ విస్ఫోటనం, అమాంతంగా మంటలు చెలరేగి సిద్దయ్య ముఖాన్ని తాకాయి. ఏమిటో అర్థమయ్యే లోపలే సిద్దయ్య క్రిందపడిపోయాడు స్పృహతప్పి.

"సిద్దయ్య పడిపోయాడు" 'సిద్దయ్య పడిపోయాడు' అంటూ తోటి కూలీలు సిద్దయ్యను ఫ్యాక్టరీ అంబులెన్స్‌లో తీసుకొని పోయి ఆస్పత్రిలో చేర్పించి, జరిగిన ప్రమాదం గురించి లచ్చికి, చంద్రంకు తెలియజేసినారు.

"లచ్చి పరుగుపరుగున వచ్చి కళ్లకు కట్టిన గుడ్డతో మంచంలో శవంలా పడవేసిన సిద్దయ్యను చూసి గుండెలవిసిపోయేలా దుఃఖిస్తూ" ఏమిటి మామా! ఇంత ఘోరం అంటూ మంచం ప్రక్కనే కూలబడిపోయింది.

"ఇంతలో చంద్రం కూడా ఆదరాబాదరా పరుగెత్తుకుంటూ వచ్చి తండ్రిని చూసి భోరుభోరున విలపిస్తూ, తర్వాత తమాయించుకొని, డాక్టర్ గదిలోకి పరుగుతీసి, డాక్టర్! డాక్టర్! మానాన్న గారికి ఏమైందంటూ విలపిస్తూ అడిగాడు చంద్రం.

"బాబూ! మీనాన్నగారి ప్రాణాలకు వచ్చిన ముప్పేమీ లేదు. కళ్ళకు అగ్ని వేడిమి తగలటం చేత కళ్ళల్లో రెటీనా దెబ్బతిని వుండవచ్చు. వారం రోజులు గడిస్తేగాని ఏమీ చెప్పలేమన్నాడు డాక్టర్ విక్రం.

## మార్చి నెల పురస్కారాలు



### ప్రయాణం

కథకు........రూ.700/-

రచయిత : కోపూరి పుష్పాదేవి



### హైటెక్కుల నగరం

కవితకు.......రూ.500/-

రచయిత : చల్లా రవికుమార్

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

వారం రోజులు అన్నం నీళ్లు మానేసి కళ్లలో వత్తులు పెట్టుకొని భర్తకు సపర్యలు చేస్తూ, మంచాన్ని అంటిపెట్టుకొని వుంది లచ్చి" సిద్దయ్య వెంటనే కోలుకోవాలని వేయి దేవుళ్ళకు మనసులోనే మొక్కుకుంటూ..

చంద్రం తల్లికి సహాయపడుతూ, వార్డు గేటును కావలా కాస్తున్నాడు అలుపెరుగని సైనికునిలా.

వారం రోజుల తర్వాత డాక్టర్ విక్రం సిద్దయ్య కళ్లకు కట్టిన గుడ్డ విప్పి సిద్దయ్య కళ్లను అన్ని రకాలుగా పరీక్షించిన తర్వాత చంద్రం, లచ్చిని తన గదిలోకి రమ్మన్నట్లు చేతులతో సైగ చేశాడు.



ఏదో జరగబోతుందన్న భయం వెంటాడుతుంటే ఊపిరి బిగబట్టుకొని డాక్టర్ విక్రంను అనుసరించారు, లచ్చి, చంద్రం.

డాక్టర్ విక్రం కుర్చీలో కూర్చొని, దీర్ఘంగా నిట్టూర్చి "చూడండమ్మా, సిద్దయ్య కంటి నరాలు పూర్తిగా దెబ్బతిన్నాయి. ఏం చేసినా, ఎక్కడికి వెళ్లినా చూపు మాత్రం తిరిగిరాదు. ఇక ధైర్యం వహించి మీరే అతనికి రెండు కళ్లుగా మారి అండగా నిలవాలి" అని ధైర్యం నూరిపోశాడు.

చూపు రాదన్న డాక్టర్ మాటను విన్న లచ్చి ఒక్కసారి కుప్పకూలిపోయింది. చంద్రం మనకు దిక్కెవరు నాన్నా! అంటూ విలపిస్తున్న తల్లిని ఓదార్చి అమ్మా! నేనున్నానమ్మా! నిన్ను నాన్నను కళ్లలో పెట్టుకొని చూసుకుంటానమ్మా" అని తల్లిని శతవిధాల సముదాయించాడు చంద్రం.

బరువెక్కిన గుండెలతో చంద్రం, లచ్చి డాక్టర్ గది నుండి తడబడుతూ సిద్దయ్య మంచం దగ్గరికి వచ్చినారు.

భార్య కొడుకు రాకను గమనించిన సిద్దయ్య! "లచ్చీ, చంద్రం, డాక్టర్‌గారు ఏం చెప్పారు. నా కళ్లకు వచ్చిన ముప్పేమీ లేదు కదా!" అంటూ ఆత్రంగా అడిగాడు సిద్దయ్య.

"ఏమీ లేదు మామా! కళ్లకు వేడి సెగ... తగలటం చేత.... దుఃఖం పొంగుకొస్తుండటంతో గొంతు పూడుకుపోయింది లచ్చికి.

వెంటనే అందుకున్న చంద్రం "ఏమీలేదు నాన్న కళ్లకు వేడి తగలటంతో కళ్లు మెత్తబడ్డాయట. కొద్దిరోజులు విశ్రాంతి తీసుకుంటే తిరిగి చూపు వస్తుందట. అందాక కళ్ల సరిగా కనబడవట" అన్నాడు. "అవును అంతే మామా!" కారుతున్న కన్నీటిని పైయద కొంగుతో తుడుచుకుంటూ సిద్దయ్యను గుండెలకు హత్తుకుంది లచ్చి మౌనంగా రోదిస్తూ.

గదిలో నుండి డాక్టర్ విక్రం వచ్చి "సిద్దయ్యను ఇంటికి తీసుకొని వెళ్లవచ్చు. రాసి ఇచ్చిన మందుల్ని సక్రమంగా వాడండి" అని ప్రిస్క్రిప్షన్ చంద్రం చేతికిచ్చి బరాబరా వెళ్లిపోయాడు డాక్టర్ విక్రం.

దినాలు, వారాలు గడచిపోతున్నాయి. పూట గడవటం కష్టమైంది. బతుకు భారం కావటంతో చంద్రంకు బతుకు బండిని లాగడానికి సిద్ధపడగా, భర్తకు చూపు వస్తుందన్న ఆశ, చంద్రం చదువు సాగాలన్న కోరిక లచ్చిని రోజురోజు కృంగదీస్తున్నాయి.

చంద్రం చదువు ఎక్కడ ఆగిపోతుందోనని సిద్దయ్య రాని చూపు కోసం ఎదురు చూస్తుంటే కన్న తల్లిదండ్రులను ఆకలితో మాడ్చి చంపటం ఇష్టంలేక చంద్రం బతుకు బండిని లాగడానికి కూలీగా మారి ఫ్యాక్టరీకి వెళుతుంటే చూసి జీవం లేకపోయినా తట్టుకోలేక కూలిపోయింది "సున్నపు బట్టీ".

# నీ గర్భాశయంలో చోటివ్వు



- కె.ఆశాజ్యోతి

నీ గర్భం చీల్చుకుని
నేను వచ్చినపుడు
నీ ప్రసవ వేదన
నాకు తెలీదు!!

నన్ను వదిలి
నువ్వు మిగిల్చిపోయిన
ఈ శూన్యంలో
నా రోదన అరణ్యరోదన
అది నీకు తెలీదు!!

నా బాల్యంలో
వెన్నల రాత్రుల్లో
మల్లెలు కడుతూ
తాదాత్మ్యంతో నువ్వు చెప్పిన
ఏసోపు, గుడ్ సామరిటన్ కథల్లోని
తాత్వికత కన్నా
ఏసు ప్రభువు
నీళ్ల మీద నడిచిన ఘటనలోని
అద్భుతం కన్నా
నువ్వే గొప్ప తత్వవేత్తలా
ఒక అద్భుతంలా నాకు కనబడ్డావు!!

నిన్ను గమనించినపుడల్లా
బ్రహ్మ నిశితంగా మలచిన
నల్లరాతి శిల్పంగా అగుపించేదానవు'
ఆకాశంలో నక్షత్రాలు
నీ చేతుల్లో మల్లెలై ఒదిగాయా అనిపించేది!!

నీ వ్యక్తిత్వాన్ని
పరికించినపుడు
భగీరథుడు భూమికి దించిన
అపర భాగీరథివేమో అనుకుంటాను!!

నీ మౌనం
నాకెపుడు ఆశ్చర్యమే
ఈ భూదేవి సహనం
నీ ముందు ఏపాటిది?

భూమి కన్నెర్ర జేసిందంటే
అగ్ని పర్వతంగా
భూకంపంగా
బద్దలవుతుంది!

కానీ
సప్త సముద్రాల ఆటుపోట్లను
ఉవ్వెత్తుగా లేచే
బడబాగ్నుల కెరటాలను
కంటి రెప్ప వెనుక
నియంత్రించే నీ శక్తి ముందు
భూమాతా నిలవగలదా?

ముదిమి నిన్ను చుట్టుకున్నా
నేను పుట్టింటికి వస్తే
నా చేతులకు కాళ్ళకు
నువ్వు పండించిన గోరింట ఎరుపు
నా రక్తంలో ఇంకి
అమ్మతనంలోని ఎరుపును
గుర్తు చేస్తూ ఉంటుంది.!!

నీకు తెలుసా?
నువ్వునాకు తెలిపిన
దాంపత్య ధర్మాలు
నేటికీ నా సంసార జీవితానికి
చలన సూత్రాలు!!

అందుకేనేమో
వేసవిలో మల్లెలూ
శరత్కాలంలో వెన్నెలా
ధనుర్మాసపు క్రిస్మస్ స్నానాలూ
ఎర్రగా పండే గోరింట
నిత్యం నువ్వు నా చుట్టూ ఉన్నావని అంటాయి.
నీ దీవెనలు నాకు ఉన్నాయనిపిస్తాయి!!

నీ మౌనం ఎంత మాట్లాడిందో.
నిన్ను పోగొట్టుకున్నాకే అర్థమైంది!
నా కోపాన్ని భరించావు!
నా అసహనాన్ని సహించావు!
నా చికాకుని క్షమించావు!
నా ఆవేశాన్ని నియంత్రించావు!
నా అమాయకత్వానికి నవ్వుకున్నావు!!

నీ ఆలోచన
నీ జ్ఞాపకం
జన్మ జన్మల వాసనలా
గుండె పొరలను తాకుతాయి!!

గాలి, నీరు, నిప్పు, భూమి, ఆకాశం
ప్రకృతి అంతటా నువ్వున్నావు
నువ్వు లేవనుకోవడం
ఎంతటి అపరిపక్వత!!

జన్మలు ఉన్నయో లేవో తెలీదు
కానీ
నాకు ఎన్నో మరెన్నో జన్మలు కావాలి!
ఎందుకంటే
నీ అంతటి దాన్ని ఎలాగూ కాలేను!
అందుకే
రత్న గర్భలాంటి
గర్భ గుడిలాంటి
నీ గర్భాశయంలో
ప్రతి జన్మలోనూ
జన్మించి తరించడానికి
తొమ్మిది నెలలు
చోటివ్వు!!

---

# రెక్కలు

- తంగిరాల చక్రవర్తి

నరికిన ప్రతిసారీ
చిగురించే చెట్లల్లే
విమర్శల బాణాలు
నా కలాన్ని పదునెక్కించాయ్ -
సాహితీ సృజన
నిత్య సంస్కరణ

కలం కత్తికి
ఎల్లప్పుడూ
ఎక్కడైనా
పదునే -
ఒకవైపు దృష్టి
మరోవైపు సృష్టి

కాలం
అందరిది
కలం
కొందరిదే -
వాఙ్మయం
సజీవ స్రవంతి

కాలం
చలన శక్తి
కలం
చరిత్ర సృష్టి -
కావ్యం వో
కాలజ్ఞానం

# విస్మృత పాత్రికేయుడు దంపూరు నరసయ్య



- కాటూరు శారద

పందొమ్మిదో శతాబ్ది ఆరంభానికి పాశ్చాత్యులు దేశభాషల్లో ప్రవేశం సంపాదించడంతో దుబాసీలు చిల్లర ఉద్యోగులుగా మారారు. వారసత్వంగా వచ్చిన ఇంగ్లీషు భాషా ప్రావీణ్యం, ప్రచురణ రంగంలో అనుభవం దంపూరు నరసయ్య ఇంగ్లీషు పత్రిక పెట్టడానికి అనుకూల పరిస్థితిని కల్పించాయి.

సమాజ హితానికి ఎన్నో మంచి పనులు చేసి విస్మరింపబడిన వ్యక్తి దంపూరు నరసయ్య (25.09.1849 - 28.06.1909) శతాబ్దాల క్రితం తమిళ ప్రాంతం నుంచి ఆంధ్ర దేశానికి వచ్చి స్థిరపడిన తుమ్మగుంటద్రావిడ శాఖకు చెందిన దంపూరు వంశీయులు సుమారు మూడువందల సంవత్సరాల క్రితం మళ్ళీ మద్రాసు చేరారు. వీరితో పాటు ఇంకొన్ని కుటుంబాలు కూడా మద్రాసు చేరాయి.

ఈస్టిండియా కంపెనీ, ఇతర యూరోపియన్ వర్తక సంస్థలు స్థానిక వ్యాపార పద్ధతులు తెలుసుకోవడం కోసం పై కుటుంబాలకు చెందిన వారిని దుబాసీలుగా నియమించుకొన్నారు. ఇంగ్లీషు భాషలో ప్రావీణ్యం, ఇంగ్లీషు వ్యవహారజ్ఞానం దుబాసీ కుటుంబాల్లో వారసత్వంగా కొనసాగింది. క్రైస్తవ మత ప్రచారకుల కృషితో దేశభాషల్లో ముద్రణ ప్రారంభమైంది. 1820లో ఏర్పడిన మద్రాస్ స్కూల్‌బుక్ సొసైటీ ప్రారంభమై 'పుస్తక ప్రచురణ' వ్యాపారంగా మారుతున్న దశలో కొన్ని తెలుగు కులాల వారు ప్రచురణ వ్యాపారంలోకి దిగారు. పాఠ్యపుస్తకాలు రాయడం, పరిష్కరించడం, ప్రూఫులు సరిచూడడం లాంటి పనులకు పండితులు అవసరమయ్యారు. నెల్లూరు మండలం నుంచి మద్రాసుకు వలసపోయిన తమ్మగుంట, పుదూరు ద్రావిడులు ఈ కొత్త అవకాశాన్ని అందుకొన్నారు.

పందొమ్మిదో శతాబ్ది ఆరంభానికి పాశ్చాత్యులు దేశభాషల్లో ప్రవేశం సంపాదించడంతో దుబాసీలు చిల్లర ఉద్యోగులుగా మారారు. వారసత్వంగా వచ్చిన ఇంగ్లీషు భాషా ప్రావీణ్యం, ప్రచురణ రంగంలో అనుభవం దంపూరు నరసయ్య ఇంగ్లీషు పత్రిక పెట్టడానికి అనుకూల పరిస్థితిని కల్పించాయి.

మెట్రిక్యులేషన్ చదువుతో మద్రాసు పచ్చయప్ప ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయుడుగా చేస్తూనే ప్రవృత్తిగా పత్రికలను నడిపాడు. పత్రికొక్కటున్న పదివేల సైన్యమున్నట్టుగా భావించిన నరసయ్య తనలో ఉన్న బ్రహ్మసమాజభావాలు, సంస్కరణాభిలాష వచన రచనలో వాడుక భాష వాడాలనే తపనలను తీర్చుకోవడానికి పత్రిక నడపడమే సరైన మార్గంగా భావించాడు.

నేటివ్ అడ్వొకేట్ (1867-1869) నెల్లూరు పయొనీర్ (1869-1870) పీపుల్స్‌ఫ్రెండ్ (1881 ఏప్రిల్ - 1897 ఆగస్టు) అనే ఇంగ్లీషు పత్రికలను, ఆంధ్రభాషా గ్రామ వర్తమాని(1900) అనే తెలుగు పత్రికను నడిపారు.

**నేటివ్ అడ్వొకేట్ :** ఈ ఆంగ్ల పత్రిక ప్రస్తావన మద్రాస్ అసైలం ప్రెస్ ఆల్మనాక్ 1867,68,69 సంపుటాల్లోని పత్రికల జాబితాలో లేకపోయినా 'సూర్యలోకం' పత్రిక సంపాదకుడు 1901,జూలై,18 సంచికలో 'స్వవిషయం' శీర్షికతో రాసిన సంపాదకీయంలో ఉంది. ప్రెసిడెన్సీలోని అప్పటి పత్రికల దుస్థితిని గురించి రాస్తూ "...దంపూరు నరసయ్య గారిచే రమారమి 30 సంవత్సరాలకు ముందు నేటివ్ అడ్వొకేట్ అనబడు పత్రిక యొకటి ఆరంభింపబడెను. మనరాజధానిలో హిందువులలో ఆంగ్లేయభాషలో పత్రికను ప్రకటించుటకు ప్రారంభించినవారు ప్రప్రథమమున శ్రీ నరసయ్యగారే, వీరి పేరిపుడెవరికైనా తెలియునా" అన్నారు.

నరసయ్య అన్నదమ్ములు కూడా ప్రభుత్వోద్యోగులే ముగ్గురూ కలిసి పత్రిక నడిపినట్లుగా తెలుస్తుంది. 1867 ఆగస్టులో డి.కృష్ణయ్య మద్రాసు ప్రభుత్వ చీఫ్ సెక్రటరీకి రాసిన ఉత్తరం ఆధారంగా ఈ పత్రిక 1867లో ప్రారంభమైనట్లు తెలుస్తుంది. ఆర్థికబలం, పాఠకాదరణ లేకపోవడం వల్ల పత్రిక నిలిచి పోయినట్లుగా అర్థమవుతుంది. పత్రికా నిర్వహణలో తొలి పాఠాలు నేర్చుకొన్న నరసయ్య 1869 అక్టోబరు ప్రాంతంలో తన దగ్గరి బంధువు ద్వారా వెంకటగిరి జమీందారుల దగ్గర చేరారు. అప్పటి జమీందారు సర్వజ్ఞకుమార యాచేంద్ర పెద్ద కొడుకు రాజా గోపాలకృష్ణకు ఇంగ్లీషు నేర్పించడానికి కుదిరాడు. తెలుగుభాషకు సంబంధించి జమీందారు గారిలో ఉన్న అభ్యుదయ, శాస్త్రీయ భావాలు నచ్చినా అతని వేశ్యాలోలత్వం నచ్చక సంస్థానం కొలువు మాని వెంకటగిరిలోనే ప్రభుత్వ పాఠశాలలో టీచరుగా చేరారు.

**నెల్లూరు కలెక్టరాఫీసు కొలువు :** ఒక చిన్న పట్టణంలో అనామకంగా గడుపుతున్న ఆయన ఆంగ్ల భాషా ప్రావీణ్యం గురించి సన్నిహితులు కొందరు నెల్లూరు కలెక్టరు ఆఫీసులోని ఒక ఆంగ్ల అధికారి

దృష్టికి తీసుకొచ్చారు. నెల్లూరు కలెక్టరు ఆఫీసులో 'అనువాదకుడు' గా చేరమని ఉత్తరువు వచ్చింది. అది నరసయ్య ప్రతిభకు దక్కిన గౌరవం.

**నెల్లూరు పయొనీరు :** అనువాదకుడుగా పనిచేస్తున్న ఆయనలోని పాత్రికేయుడు మళ్ళీ నిద్ర లేచాడు. అదే ఆఫీసులో పనిచేస్తున్న నంబెరుమాళ్ళయ్యతో కలసి 1869 ప్రాంతంలో 'నెల్లూరు పయొనీర్' అనే ఆంగ్ల పత్రికను ప్రారంభించినట్లు. పాఠకాదరణ లేక సంవత్సరంలోపే మూతపడినట్లు నెల్లూరు స్థానిక చరిత్రకారుడు ఒంగోలు వెంకట రంగయ్య రాసిన ఒక వ్యాసం వల్ల తెలుస్తుంది. అంతకుమించి ఈ పత్రిక వివరాలేవీ తెలియడం లేదు. ప్రభుత్వేతర రంగంలో తొలి పత్రిక స్థాపించినందువల్లా, ప్రజా శ్రేయస్సుకోసం జీవితాంతం పత్రికలు నిర్వహించడం వల్లా, నిర్భయంగా, నిర్మోహమాటంగా రాసి ఉన్నత ప్రమాణాలు స్థాపించడం వల్ల నరసయ్య నెల్లూరు పత్రికాలోకానికి అద్యుడూ, ఆరాధ్యుడూ అయ్యాడని ప్రసిద్ధ పరిశోధక పాత్రికేయుడు బంగోరె ప్రశంసించారు.

**ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలను నరసయ్య తన పత్రికాముఖంగా తీవ్రంగా వ్యతిరేకించడం వల్ల పత్రిక ప్రారంభమైన ఐదారు సంవత్సరాల లోపే ఆయనకు ప్రభుత్వాధికారులతో సంబంధాలు చెడిపోయాయి. పత్రిక మీద కన్నెర్ర జేసిన ప్రభుత్వం తన ప్రచురణలను పత్రికకు ఉచితంగా ఇవ్వడం మానేసింది. భారతీయ ఇంగ్లీషు పత్రికలు బ్రిటిష్ అధికారులతో తరచు పోరాడవలసి వచ్చేది.**

అనువాదకుడి ఉద్యోగం నుంచి డిప్యూటీ ఇనస్పెక్టర్ ఆఫ్ స్కూల్స్ (ఒంగోలు రేంజి) ఉద్యోగానికి ఎదిగారు. 1872-75 సంవత్సరాల మధ్యకాలంలో ఈ ఉద్యోగంలో ఉంటూ ఆయన విద్యార్థులను ప్రోత్సహించడానికి కొన్ని కార్యక్రమాలను రూపొందించి ఆమోదం కూడా పొందారు. నెల్లూరు జిల్లాలో విద్యాభివృద్ధికి తోడ్పడ్డారు.

**పీపుల్స్ ఫ్రెండ్ :** 1897 జనవరిలో తొలిసారిగా ముద్రింపబడిన కన్యాశుల్కం నాటకాన్ని అదే నెలలో సమీక్షించి తన పీపుల్స్‌ఫ్రెండ్ పత్రికలో ప్రచురించిన విమర్శకుడు దంపూరి నరసయ్య. ఈ విషయాన్ని కె.వి.రమణారెడ్డి తప్ప ఇతరులంతగా పట్టించుకోలేదు. అయితే ఈ సమీక్షను ఎంతగానో మెచ్చుకొన్న వ్యక్తి గురజాడ. ఆయన ఒంగోలు మునిసుబ్రహ్మణ్యం గారికి రాసిన లేఖవల్ల పై సంగతి తెలిసింది. లేఖ తెలుగు అనువాదంలోంచి కొంత భాగం "…..ఆంగ్లభాషలో ఆయన (నరసయ్య) గొప్ప పండితుడు. తెలుగు దేశంలో ఒక పుస్తకాన్ని సమీక్ష చేయగల వారెవ్వరూ లేరు…ఆయన జీవించి ఉన్నారా? ఉంటే ఆయన చిరునామా తెలియజేయి. ఆయనను కలుసుకో.." అని ఉంది. బహుశా కన్యాశుల్కం మలిముద్రణ (1909) ప్రతిని నరసయ్యకు పంపాలనే కోరికతోనే ఆయన చిరునామా అడిగినట్లు తెలుస్తుంది. అప్పటికి తొమ్మిది రోజుల క్రితమే నరసయ్య చనిపోయారు.

01.04.1881న ప్రారంభమైన పీపుల్స్‌ఫ్రెండ్ 1897 జూలై I was the Editor of peoples friend at Madras from April 1881 to1897 July అని నెల్లూరు మున్సిఫ్ కోర్టులో ఒక కేసు సందర్భంగా నరసయ్య ఇచ్చిన వాఙ్మూలం ఆధారంగా పత్రిక జనన మరణాలు తెలిశాయి.

అది ప్రజల పత్రిక అనీ అతిసామాన్యులకు కూడా అందుబాటులో ఉండాలని "A cheap journal published every Saturday" అని పత్రిక ముఖపత్రం మీద ముద్రించి ప్రచురించారు.

లభించిన స్వల్ప ఆధారాలు, కొన్ని సంచికల ద్వారా ఈ పత్రికలో హిందూలాంటి ప్రముఖ పత్రికల నుంచీ, ఫోర్టు సెయింట్ జార్జి గెజిటు నుంచీ వార్తలు సేకరించుకొని పీపుల్స్ ఫ్రెండ్ ప్రచురించేదని తెలుస్తుంది.

సామాజిక విషయాల మీద ఆసక్తి అవగాహన ఉన్న విద్యాధికులైన సంస్కారులు ఈ పత్రిక పాఠకులని కూడా తెలుస్తుంది.

మద్రాస్ మెయిల్ తర్వాత తనదే ప్రజాదరణ పొందిన పత్రిక అనీ వారం వారం 1200 ప్రతులు అచ్చవుతున్నాయనీ నరసయ్య మద్రాసు ప్రభుత్వ చీఫ్ సెక్రటరీకి రాసిన ఉత్తరం వల్ల తెలుస్తుంది. ఈ పత్రికలో బ్రహ్మసమాజ వార్తలు. సంస్కరణోద్యమ వార్తలు. మహిళాభ్యుదయానికి సంబంధించిన వార్తలు ప్రచురింపబడేవని 1883 డిసెంబరు ఒకటో తేదీ సంచికను బట్టి తెలుస్తుంది.

ప్రభుత్వ ప్రజావ్యతిరేక విధానాలను నరసయ్య తన పత్రికాముఖంగా తీవ్రంగా వ్యతిరేకించడం వల్ల పత్రిక ప్రారంభమైన ఐదారు సంవత్సరాల లోపే ఆయనకు ప్రభుత్వాధికారులతో సంబంధాలు చెడిపోయాయి. పత్రిక మీద కన్నెర్ర జేసిన ప్రభుత్వం తన ప్రచురణలను పత్రికకు ఉచితంగా ఇవ్వడం మానేసింది. భారతీయ ఇంగ్లీషు పత్రికలు బ్రిటిష్ అధికారులతో తరచు పోరాడవలసి వచ్చేది. ప్రభుత్వపక్షపాత చర్యలను నిర్భయంగా నిర్మోహమాటంగా నరసయ్య పీపుల్స్ ఫ్రెండ్ సంపాదకీయల్లో విమర్శించేవారు.

నిక్షేపం లాంటి ప్రభుత్వోద్యోగాన్ని వదులుకొని పత్రిక నిర్వహణ మీదున్న బలమైన ఆసక్తితో మద్రాసు చేరి పత్రిక పెట్టి 17 సంవత్సరాల పాటు అతికష్టం మీద నిర్వహించిన నరసయ్య ఆర్థిక ఇబ్బందులు, కుటుంబసమస్యలు తట్టుకోలేక పత్రిక మూసివేసి తిరిగి నెల్లూరు సీమ చేరాడు. కోడూరు గ్రామంలో తన సోదరి ఆస్తి వ్యవహారాలు చక్కబెట్టడం కోసం చివరికి రైతుగా స్థిరపడ్డాడు.

**ఆంధ్ర భాషా గ్రామ వర్తమాని :** రైతుగా స్థిరపడినా ఆయనలోని పాత్రికేయుడు నిద్రపోలేదు. 'నయమైన తెలుగు న్యూసు పేపరు' (1883 డిసెంబరు 1 పీపుల్స్ ఫ్రెండ్ సంచికలోని (ప్రకటన) పెట్టాలనే ఆలోచన మళ్ళీ తలెత్తింది. కోడూరు చుట్టుపక్కలున్న పల్లెటూళ్ళలోని పేదరైతుల కష్టాలు, భూస్వాముల ఆగడాలు, పెత్తందార్ల అక్రమాలు, గ్రామాధికారుల మాయలు మోసాలు ఆయన దృష్టిలో పడ్డాయి. అక్కడి ప్రజల దయనీయ పరిస్థితులను ప్రభుత్వం ముందుంచడానికి దేశ ప్రజల దృష్టికి తీసుకురావడానికి తనకొక పత్రిక అవసరమని భావించిన నరసయ్య ఆ రంగంలో ఎన్నో చేదు అనుభవాలు ఎదురైనా పత్రిక నడపాలనే నిర్ణయించుకొన్నారు. మద్రాసు మహానగరంలో ప్రారంభమైన నరసయ్య తెలుగు జర్నలిజం ప్రస్థానం నెల్లూరు జిల్లాలోని కోడూరు గ్రామం వరకు సాగి సమాప్తమైంది.

# చరిత్ర కోసమైనా

- సి.హెచ్. బృందావనరావు

ఆకుపచ్చని జ్ఞాపకానికీ
ఆవిర్లు కక్కే వాస్తవానికీ మధ్య
ఒగుడాకై వణికి పోతున్న
అభాగ్య జీవి అతడు
చిరుగాలి సోకగానే
అలలు అలలై ప్రవహించే
వరి పైరుల లాండు స్కేపులన్నీ
కలల్లోకి కాపురం వెళ్లిన తరువాత
నెర్రెలు నెర్రెలైన నేల గుండెలకు
నాట్ల మాట్లు వేసుకోవడం చేతగాని
నష్టజీవనుడతడు
పశువుల గుంపుల్ని తోలుకుంటూ
పేడకళ్లు ఎత్తుకుంటూ
నెత్తిమీద గడ్డిమోపు కిరీటాన్ని ధరించి
నేల సామ్రాజ్యాన్ని పరిపాలించేవాడు పాపం
తప్పిపోయిన కొడుకును వెతుక్కునే తండ్రిలా
తన్నుకులాడుతున్నాడు ఇప్పుడు



దేశానికి అతనే వెన్నెముక అంటూ
మొసళ్ళన్నీ కన్నీళ్ళ వరదలౌతాయి
రంగు రంగుల జెండాలన్నీ వాగ్ధానాల పేర
వెటకారాలను వెదజల్లుతుంటాయి
దినపత్రికల వీణలన్నీ
అంత్య ప్రాస శీర్షికల తీగల మీద
అన్నదాత అతడే అంటూ
అక్షరాల వాద్య సంగీతం వినిపిస్తుంటాయి
అవనికి అన్నంపెట్టిన చేతులు
అడుక్కునే బొచ్చెలయింతర్వాత
నీళ్ళ కుండను భుజానికెత్తుకుని
తండ్రి శవం చుట్టూ ప్రదక్షిణించే కొడుకులాగా
కన్నీటినిన్నింపుకున్న రెండు కండ్ల కడవలను మోస్తూ
బీడు పొలం చుట్టూతా తిరుగుతుంటాడు అతను
అతని మొహం గోడకెవరైనా
ఓ చిరునవ్వు కేలండరు వేలాడదీయండి
చరిత్ర కోసమైనా శాంపిలొకటి వుంచేందుకు
అతని ఫొటో ఒకటి తీసి దాచుకుందాం

**(13.1.2011న, విజయవాడ సాహితీ స్రవంతి నిర్వహించిన 'రైతు' కవి సమ్మేళనంలో చదివినది)**

---

ఆంధ్ర భాషా గ్రామ వర్తమాని వారపత్రిక ప్రారంభమైన కొద్ది నెలలకే ముగిసిపోయింది. అల్పాయుష్కురాలైన ఈ పత్రిక స్థాపకుడు, సంపాదకుడు, విలేఖరి, ప్రూఫురీడరు అన్నీ తానే అయి వ్యవహరించాడు నరసయ్య. ఈ పత్రిక ప్రభుత్వాన్ని నిద్రపోనీయలేదు అనడానికి నిదర్శనం - ప్రభుత్వ అనువాదకుడు ఈ పత్రిక నుంచి అనువదించినన్ని విషయాలు మరే తెలుగు పత్రికనుంచీ అనువదించక పోవడమే. ప్రభుత్వ అనువాదకుని దృష్టిని ఈ పత్రిక రాతలు ఆకర్షించినంతగా మరే పత్రిక రాతలూ అకర్షించలేదు. దీన్ని బట్టి ఈ పత్రికలో ప్రచురింపబడిన విషయాల గాంభీర్యాన్ని గాఢతను మనం అర్థం చేసుకోవచ్చు.

ఈ పత్రికలో - గ్రామీణ పాఠశాలలు, గ్రామ న్యాయ స్థానాలు, రైతుపక్షపాతం, రెవెన్యూ వ్యవస్థ, గ్రామకరణాలు, గ్రావసేవకులు, కుడిమరమ్మతుపనులు, టెనెన్సీ బిల్లు, జమీందారీ భూముల సర్వే, స్థానిక సమస్యలు లాంటి ఎన్నో ప్రధానమైన అంశాలమీద రాతలుండేవి.

పత్రికాధిపతులు జమీందార్ల ప్రాపకం కోసం, పోషణకోసం పడిగాపులు కాస్తున్న రోజుల్లోనే ఇంపార్షియబుల్ ఎస్టేటు యాక్టును నరసయ్య తీవ్రంగా వ్యతిరేకించి జమీందార్ల వ్యతిరేకి అయ్యాడు. జమీందారీ వ్యతిరేక ఉద్యమానికి ప్రేరణ అయ్యాడు.

**నరసయ్య గురించి మరికొన్ని విషయాలు :** తొలి వితంతు వివాహం జరిపించి ఆ దంపతుల్ని వెంటబెట్టుకొని సతీసమేతంగా మద్రాసు చేరిన వీరేశలింగం పంతులుగారి గౌరవార్థం ఏర్పాటు చేసిన సహపంక్తి భోజనానికి వచ్చిన అయిదుగురులో దంపూరు నరసయ్య గారొకరని వీరేశలింగం పంతులుగారు స్వీయచరిత్రలో రాశారు. తనతో కలిసి పాల్గొన్న వారిని సాంఘిక సంస్కార షట్చక్రవర్తులుగా వీరేశలింగం పంతులుగారు అభివర్ణించారు.

**లెటర్సు ఆన్ హిందూ మేరెజస్ :** బ్రహ్మ సమాజ సిద్ధాంతాల ప్రభావంతో మద్రాసులో వేదసమాజం ఆవిర్భవించింది. ఈ సమాజం తరుపున బాల్య వివాహ వ్యతిరేకోద్యమం తీవ్రంగా నడిచిన కాలంలో వాటికి అనుకూలంగా ప్రతికూలంగా జరిగిన వాదోపవాదాల నేపథ్యంలో నరసయ్య పచ్చయప్ప ఉన్నత పాఠశాలలో టీచరుగా పనిచేస్తూ తన పదిహేడవ ఏటనే "లెటర్సు ఆన్ హిందూ మేరెజస్' అనే పుస్తకాన్ని రాశారు. జి.వెంకన్న శాస్త్రీయర్, సి.ఎన్.ఐ వర్సెస్ సి.రంగనాథశాస్త్రీయర్ అండ్ సి.అనంతరామశాస్త్రియర్ అని పై గ్రంథానికే రెండో పేరు పెట్టారు.

అభ్యుదయ భావాలతో ప్రజాశ్రేయస్సు కోసం పత్రికలు నడుపుతూ, నడపడంలోని కష్టాలధాటికి తట్టుకోలేక ఆరుపదుల వయసులోనే తనువు చాలించిన దంపూరు నరసయ్య చిరస్మరణీయుడు.

ఈ వ్యాసం రాయడానికి ప్రేరణ కలిగించడమే గాక అధారాలనందించిన గ్రంథం "ఇంగ్లీషు జర్నలిజంలో తొలి తెలుగు వెలుగు దంపూరు నరసయ్య" గ్రంథకర్త డా॥కాళిదాసు పురుషోత్తం. ఆయనకు కృతజ్ఞతలు నరసయ్యను గురించిన ఎన్నో ఆసక్తికర విషయాలు తెలుసుకోవడానికి ఆయన పత్రికల్లో ప్రచురింపబడిన విషయాలను చదవాలనుకోనేవారికి పై గ్రంథం ఉపకరిస్తుంది.

# ఆశల సంద్రాలైపోతూ!

- డాక్టర్ ఎం.బి.డి శ్యామల



ఉద్వేగపుటలలన్నీ లోతులేనిచోటే!
ఎంత మహోధృతంగా ఎగసినా అవి తీరం చేరలేవు!
కొన్ని ఆకాంక్షలు గాధానుభూతుల వూయలలో
వూగి వూగి ఆగిపోతూనే వుంటాయి
ఆశయాల తెలినురుగులు కాలపుటిసకలో
ఇంకిపోయిన భావన!
కలల కడలి ముంగిట పసివూహల్తో కట్టుకున్న
భవిష్యదాశల ఇసుక గూళ్ళు!...

అలల పంజా దెబ్బకు రూపుమాసిపోతుంటే...
అంతశ్చేతనకు జోలపాడుకుంటూ
యాంత్రికతా కవచాలను తొడుక్కుంటూ
మానవుడు జీవన నాటక రంగంతో
అంత రంగాన్ని సమన్వయించుకోలేక
సతమతమౌతుంటాడు!
అమాయకమైన నిరాకాంక్షమయమైన
పసిప్రాయాన్ని ప్రేమిస్తూ!...
ఆ తలపులను ఆస్వాదిస్తూ...
అన్నీ తెలిపినట్లనిపించే ఈ తెలియని తనపు
దారివెంట... అసంతృప్తుల బరువులు మోపున మోస్తూ!
కడుపు నింపని ప్రశ్నల ఖాళీ పాత్రను చూస్తూ
అంతులేని దాహం తీర్చలేని ఆశల సంద్రమై పోతుంటాడు!

---

# జీవించడం నేర్చుకున్న జీవితం

- పాతూరి అన్నపూర్ణ



బాధాసర్పద్రష్టల్లాగా
సమస్యల సుడిగుండంలో చుట్టుకుని
నత్తగుల్లల్లా ముడుచుకుంటున్నారా!
మనసు దుప్పటిని విదిలించండి
గొంగళిపురుగు దశ నుండే
సీతాకోకచిలుక ఉద్భవించేది!
తాపడం పెట్టినప్పుడే
పుత్తడి అయినా మెరిసేది
రాత్రి పురిటినొప్పులు పడేది
పగలును ప్రసవించడానికే
రోజూ ఉదయాన్ని చూస్తూ కూడా
వెలుగు రేఖలను ఆహ్వానించకపోతే

బ్రతకడం రోజురోజుకీ
పెద్ద గీతలా తయారవుతుంది
మాటల వారధికి
మమతల ఊయలలు తగిలించి
బంధాల స్పర్శను తెలియచేసుకుంటే

ఆలింగనంలో ఉండే ఆనందాన్ని
హృదయలయలు తెలియజేస్తాయి
ఎప్పుడూ అడుగులు
సమూహంవైపు నడిస్తేనే మంచిది
మన వెనక నలుగురు నడిచినప్పుడే
పాదముద్రల బలం పెరుగుతుంది
కరచాలనాల స్పర్శానందంతో
ధైర్యం వృక్షంలా విస్తరిస్తుంది
శిశిరం విడిచిన ఆకులన్నీ
మళ్లీ చిగుర్లుగా మొలకలెత్తి
వసంతాన్ని అద్దుకున్న వనానికి
కొత్త ఉగాదిని ఆహ్వానించినట్లు
జీవితం జీవించడం నేర్చుకుంటుంది

---

# టార్చ్‌లైట్

- మంత్రి కృష్ణమోహన్



ఓ దట్టమైన చీకటి రాత్రి -
నా వయసపుడు పన్నెండేళ్ళు అనుకుంటాను
ఇంట్లో దీపాలు
కూడబలుక్కుని ఆరిపోయాయి
వీధి లాంతర్లు
మూకుమ్మడిగా చల్లబడ్డాయి
విరిగిన విద్యుత్ శబ్దాల
సమూహ మౌనమా అన్నట్టు
తెరచిన నా తరగతి పాఠ్య పుస్తకం
వీధి అరుగుల మీది
పిల్లల కేరింతల్లోకి
దూకి పరుగులెత్తాలన్న ఆరాటం,
ఆ ఆత్రుత ఆదుర్దాల్లో
ఏ సున్నిత అవయవాలు ఛిద్రం చేశానో!
గండు తేలుకొండికి
రక్తం చుక్కలా దొరికిపోయాను

సమయానికి చదువుల బల్లమీద
టార్చ్‌లైట్ వుండి వుంటే
ఆ నిశీధి అంత చీకటి వుండేది కాదు
టార్చ్‌లైట్ చాలా విలువైంది సుమా!
చిమ్మ చీకట్లో దారి చూపుతుంది
అల్ప విషపుజీవుల
చేత చిక్కకుండా కాపాడుతుంది

చుట్టూ ఎంత వెలుతురున్నా
డాక్టర్ టేబుల్ మీద టార్చ్‌లైట్ వుంటుంది
- స్పష్టమైన చూపునిస్తుంది
రోగాన్ని నిర్ధారిస్తుంది
ఒక్క కాంతి పుంజాన్ని
వొద్దున కాపాలా పెట్టి
మహా సముద్రాన్ని ఈదొచ్చు!
ఏం చెప్పాలి! టార్చ్‌లైట్ అంత శక్తివంతమైంది.

నిజానికి కవిత్వమూ
టార్చ్‌లైట్ లాంటిదే -
గొప్ప వెలుతురులో
చీకటిని వెదికే టార్చ్‌లైట్
టార్చ్‌లైట్ చెయ్యగల అన్ని పనుల్నీ
కవిత్వం మరింత ప్రేమగా బాధ్యతగా
నెరవేరుస్తుంది కూడా
అందుకే ఇప్పుడు కవిత్వాన్నీ ప్రేమిస్తున్నాను

కథ

# బ్లాక్‌హోల్



- కె. సుభాషిణి

**అశోకా త్రీస్టార్ హోటల్ ముందు ఇన్నోవా కార్లు, టాటా సఫారీలు, స్కార్పియోలు కిక్కిరిసి వున్నాయి. పార్కింగ్ చేయడానికి వీలు కానంత రద్దీగా ఉంది ఆ ప్రాంతం. కేవలం పాస్‌లు వున్నవారినే లోనికి పంపిస్తున్నారు. వాళ్ళ వాహనాలను మాత్రమే హోటల్ ముందు పార్కింగ్ చేయిస్తున్నారు.**

గేటు నుండి హోటల్ పోర్టికో వరకు షడ్భుజి ఆకారంలో వున్న ఎర్రటి టైల్స్ పరిచారు. పచ్చటి లాన్..... గుబురు చెట్లను ట్రిమ్ చేయడంతో చెట్లపై పచ్చటి గొడుగులను తగిలించినట్టుగా వుంది. పెద్ద పెద్ద కుండీలల్లో పెంచిన క్రోటన్ మొక్కలు... ఆకుపచ్చ రంగే కాకుండా ఎరుపు, పసుపు రంగుల ఆకులు కలిగి వున్న ఖరీదైన క్రొటన్ మొక్కలను అక్కడక్కడ పెంచారు. గోడలకు, శ్లాబులకు తగిలించిన కుండీలకు వేలాడుతున్న తీగలు.... వాటికి పూసిన వాసన లేని పూలు కళ్లకు కనువిందు చేస్తున్నాయి.

యజమానితోపాటు కారు దిగుతున్న ఆడ కుక్కను చూసి హోటల్ ముందు ముడుచుకొని పడుకున్న మగకుక్క లేచి వొళ్లు విదిలించుకుంటూ భౌ...భౌ మంటూ మొరిగింది. తోక వూపుకుంటూ, చొంగ కారుస్తూ లోపలికి పరుగెత్తుకొని వస్తున్న కుక్కను చేతిలోని లాఠీతో రెండు దెబ్బలు వేశాడు గూర్ఖా. కుయ్.... కుయ్ మంటూ అరుస్తూ పక్కకు పరుగెత్తింది. వెళ్ళిపోతున్న మగకుక్కను చూసి యజమాని చేతిలోని గొలుసును విడిపించుకోడానికి విశ్వప్రయత్నం చేసింది. కుక్కల సంగమం జరగకుండా కారు డ్రైవర్ ఆపాడు. "ఈ బజారు కుక్కల న్యూసెన్స్ ఏమిటి?"... కాన్ఫరెన్స్ హాల్‌వైపు అడుగులు వేస్తున్న కొన్ని శాల్తీలు చిరాకు పడ్డాయి.

సెంట్రల్ ఏ.సి. చేసిన కాన్ఫరెన్స్ హాల్. గోడలకు ఖరీదైన పెద్ద పెద్ద పెయింటింగ్స్ వేలాడుతున్నాయి. అద్దాల మీద అందమైన పూలతీగలు పెయింట్ చేసి వున్నాయి. ఏమరపాటుగా చూస్తే అటువైపు నుండి ఏదైనా తీగ అద్దం మీదకు పాకిందేమో అని భ్రమ కలుగుతుంది. ఆ హాల్లో ఖరీదైన ఖద్దరు చొక్కాలు, ప్యాంట్లు వేసుకున్న వాళ్లే ఎక్కువ కనిపిస్తున్నారు.

నలుగురు ఆడవాళ్లు టేబుల్స్‌కు ఒకవైపున వరుసగా కూర్చొని వున్నారు. హుందాగా, ఖరీదుగా కనిపించే చీరలు కట్టుకున్నారు. రెండు చేతులకు సాదా బంగారపు గాజులతో పాటు పచ్చలు, కెంపులు పొదిగిన లావుపాటి గాజులు వేసుకున్నారు. ఇలాంటి సమావేశాలకు రావటం ఇదే మొదటిసారి అని వాళ్లను చూస్తే తెలుస్తోంది. లోపల బెదురుగా వుంది వాళ్లకు. వాళ్ళ భర్తల వెంటే వీళ్ల చూపులు పోతున్నాయి. చనువుగా ఒకర్నొకరు పలకరించుకుంటున్న మగవాళ్లను చూసి వీళ్లు పెదవులు విప్పారు.

"ఎవరక్కా మీరు..."

"చౌటిపల్లి సదాశివారెడ్డి భార్యను... మీరు..."

"రుద్రవరం సోమన్నగౌడ చిన్న కోడల్ని..."

"ఎప్పుడు అయిపోతాదో..."

"ఏమో మరి... మినిస్టర్ ఇంకా వచ్చినట్లు లేదు..."

"నాకు ఇష్టమే లేదు ఈటికి రాడం... మొగోళ్ల మధ్యన ఏం బాగుంటుంది అంటే మా ఆయన వినకుండా తోలుకొచ్చినాడు..."

"మీది ఏదక్కా బారా? షాపా...?"

"రెండు షాపులు..." ఒకటి నా పేరు మీద రెండోది ఆయన పేరు మీద..."

"భలే తెచ్చుకున్నారే....ఎంతకు పాడినారక్కా..."

"అవల్లా నాకు తెల్దు చూడమ్మా. ఆ లెక్కాచారాలన్నీ తనే జూసుకుంటాడు. యాడ సంతకం పెట్టమంటే ఆడపెడ్తా..."

"ఏం సదువుకున్నావక్కా..?"

"యాడ... ఇంటర్ సదువుతుండగానే పెండ్లి జేసిరి..."

"నాకు అంతే... పది పరీచ్చలు అయిపోతానే పెండ్లి జేసిరి..."

"మీ మామది ముందు నుండి ఇదే కదా యాపారం. మీవైపు కల్లు, సారాయి అంగళ్లు అన్నీ సోమన్నగౌడ్ వాళ్లవే అంటారు."

"మా కుల వృత్తే అది కదక్కా... ఇంతకి ఈ హోటల్ ఇదల్లా ఎవరిదంటావ్..."



"అదిగో రాజశేఖర్‌రెడ్డి అన్నది... ఈరోజు అయ్యే ఖర్చంతా ఆయనే బరిస్తాండాడు..."

తెల్లటి ఖద్దరు ప్యాంట్, గోధుమ రంగు ఖద్దరు చొక్కా వేసుకొని సెల్లులో మాట్లాడుతున్న మనిషిని చూపించింది.

మినిష్టర్ హాల్లో అడుగు పెట్టేసరికి అందరు మాటలు ఆపేసి కంగారుగా నిలబడ్డారు. మంత్రికి పూలదండలు వేస్తూ బొకేలు ఇస్తూ ఫొటోలు తీయించుకోడానికి ఒకర్నొకరు తోసుకున్నారు. వాళ్లను తోసుకుంటూ గుంపులోకి చొరబడ్డానికి సాహసం చేయలేక ఆడవాళ్లు దూరంగా వుండిపోయారు. అది గమనించిన మంత్రి తన చుట్టూ వున్న వాళ్లను తప్పించుకొని స్వయంగా ఆడవాళ్ల దగ్గరికి వచ్చాడు. మంత్రిని పరిశీలనగా చూశారు. తెల్లజుట్టు కనిపించకుండా జుట్టుకు నల్లరంగు వేసుకున్నాడు. మీసాలకు కూడా డై వేసుకున్నాడని వాళ్లకు అనుమానం. ఎందుకంటే చేతులు, కనుబొమ్మల మీద వున్న వెంట్రుకలు తెల్లగానే ఉన్నాయి. రెండు చేతులు జోడించి నమస్కారం చేస్తున్న మంత్రికి నవ్వుతూ నమస్కారం చేశారు.

హాల్లోకి స్వీట్స్, కేక్స్, పఫ్స్, ఐస్‌క్రీమ్స్ రావడంతో అందరూ ఎవరి సీట్లలో వాళ్లు కూచున్నారు. పక్కనున్న వాళ్లతో మాట్లాడుతూనే హాల్లో అందరిని నవ్వుతూ చూస్తున్నాడు మంత్రి.

"సార్ ఐస్‌క్రీమ్ తినరు.. కేక్స్, ఐస్‌క్రీమ్, కూల్‌డ్రింక్స్ లాస్ట్‌ఇయర్ ఋషికేష్‌కు వెళ్లినప్పుడు దేవునికి ఇచ్చేసారు. చక్కెర లేకుండా కాఫీ తెప్పించండి...' రాజశేఖర్‌రెడ్డిని పిలిచి చెప్పాడు మంత్రి పి.ఎ.

క్షణాల్లో పొగలు కక్కుతున్న కాఫీ మంత్రి టేబుల్ మీదకు వచ్చింది. కాఫీ తాగుతూనే త్వరగా మొదలుపెట్టమని రాజశేఖర్‌రెడ్డికి సైగ చేశాడు.

మైక్ చేతిలోకి తీసుకున్నాడు రాజశేఖర్‌రెడ్డి. "జిల్లాలోని అన్ని మండలాలకు చెందిన కొంతమంది ప్రముఖులం ఇక్కడ ఎందుకు సమావేశమయ్యామో అందరికీ తెలిసిందే. మన మధ్య పోటీ వుండొచ్చు... విభేదాలు కూడా వుండొచ్చు. కాని మనమందరం కలిసి ఒక అసోసియేషన్‌గా వుండాల్సిన అవసరం వుంది. ఎందుకంటే మనం అందరం చేసే వ్యాపారం ఒక్కటే. ఈ వ్యాపారాన్ని చేజిక్కించుకోడానికి మనం ఎన్ని కష్టాలు పడ్డామో నేను వివరించనవసరం లేదు. వీటిని నడపటానికి ఇంకా కష్టపడాలి. కష్టానికి తగ్గ ఫలితం ఆశించడం సహజం. ప్రతి వ్యాపారస్తుడు తన వ్యాపారం మూడు పువ్వులు ఆరు కాయలతో వర్ధిల్లాలనే కోరుకుంటాడు. మన బాధలను నేరుగా మంత్రిగారికే విన్నవించుకుందాం. వారికి మన సహకారం... మనకు వారి సహకారం వుంటేనే వ్యాపారం కొనసాగుతుంది...." చెప్పాల్సింది చెప్పేసి, అందరివైపు చూస్తూ నిలబడ్డాడు రాజశేఖరరెడ్డి.

హాల్లో నిశ్శబ్దం రాజ్యమేలింది. ఒకరిద్దరిని మాట్లాడమని మంత్రి ప్రోత్సహించాడు.

"చెప్పేదేముంది సార్... మీకు తెలియంది కాదు. టెండర్లు వేయడానికే ఎన్ని తిప్పలు పన్యామో..."

"ఎట్లనో దేవుని దయవల్ల మాకు బార్ దక్కింది. మీరు కూడా మా మీద దయచూపిస్తే..." నున్నటి గుండును తడుముకుంటూ వేడుకున్నాడు ఒక వ్యక్తి. టెండర్లలో తనకు బార్ దక్కిందని, శ్రీశైలానికి కుటుంబ సమేతంగా పోయి మొక్కు తీర్చుకున్నాడు.

గంజిపెట్టి ఇస్త్రీ చేసిన ఖద్దరు చొక్కాను సరిచేసుకుంటూ లేచి నిలబడ్డాడు సదాశివారెడ్డి. భార్యకు సైగ చేయడంతో ఆమె కూడా పైకి లేచింది. ఏమీ చేయాలో తోచక కొంగు అంచులు వేలుకు చుట్టుకుంటూ మంత్రివైపు చూస్తోంది.

"బయట వడ్డీలకు తెచ్చి టెండర్లు వేసినాం సార్... మమ్మల్ని బయటపడేతట్టు జూడల సార్..." సదాశివారెడ్డి చేతులు జోడించి మాట్లాడుతుంటే చేతివేళ్లకు వున్న ఆరు వుంగరాలు ధగ ధగ మెరిసిపోతూ కొట్టొచ్చినట్టుగా కనిపించాయి.

"పగలు వ్యాపారం పెద్దగా జరగదు సార్... చీకటి పన్యాకనే జోరగుంటుంది... షాపులకు రాత్రిపూట కూడా పర్మిషన్ ఇస్తే ప్రజలకు అనుకూలంగా వుంటుంది. మేమూ సంతోషంగా వుంటాం ."

"అది మాత్రమే సరిపోదు... జనాలు ఎక్కువన్న తాగాలా... లేకపోతే తాగేవాళ్ల సంఖ్య అయినా పెరగాల... ముఖ్యంగా జనాలకు ఆదాయం పెరగాల...." తమ వ్యాపారం అభివృద్ధి చెందాలి అంటే దానికి మూలమేదో వాళ్ళకి అర్థమయ్యింది.

"కొంచెం ఎక్సైజ్ వాళ్లను పోలీసోల్లను చూసి చూడనట్లు వుండమని చెప్పించండి సార్..."

మంత్రి అందరి మాటలను జాగ్రత్తగా వింటున్నాడు. మంత్రి చూపులను బట్టి పి.ఏ ముఖ్యమైన విషయాలను నోట్ చేసుకుంటున్నాడు. హాల్‌లో వున్న అందరూ తనవైపే చూస్తుండటంతో మంత్రి నోరు విప్పాడు.

"మీ పరిస్థితి నాకు అర్థమయింది. మీ ఇబ్బందులు ఏమిటో నాకు స్పష్టంగా తెలిసింది. కార్యకర్తలు మాకు గుండెకాయ వంటి వారు. వారి కష్టాలు మా కష్టాలే. వారి సంతోషమే మా సంతోషం. మీరు అభివృద్ధి చెందితేనే పార్టీ కూడా అభివృద్ధి చెందుతుంది. రాజకీయ పార్టీలకు భవిష్యత్ వుంటుంది. వ్యాపారంలో నిలదొక్కుకోవాలి అంటే ఎంత కష్టమో వ్యాపారవేత్తగా ఆ సమస్యలు నాకు బాగా తెలుసు. మీకు వెన్నుదన్నుగా నేను ఎప్పుడూ వుంటాను అని మీకు వాగ్దానం చేస్తున్నాను. తగిన సమయంలో తగు నిర్ణయాలు తీసుకుంటాం... ఆదేశాలు జారీ చేస్తాం అని మీకు మరొక్కసారి మనవి చేసుకుంటున్నాను.."

చప్పట్లతో హాల్ మారుమ్రోగింది. కొత్తరక్తం శరీరంలోకి వచ్చినట్టుగా వుత్సాహంతో సంతోషంతో భోజనం సంగతి కూడా మరిచిపోయి మాటల్లో పడిపోయారు.



... ... ...

బ్రేకింగ్ న్యూస్...

ముగిసిన మంత్రివర్గ సమావేశం

అబ్కారి ద్వారా వచ్చే ఆదాయాన్ని సంక్షేమ పథకాలకు కేటాయించాలని తీర్మానం చేసిన మంత్రి వర్గం.

టి.వి ఛానల్లో స్క్రోలింగ్ వస్తోంది.

మరి కొద్ది సేపట్లోనే మరొక్క బ్రేకింగ్ న్యూస్ స్క్రోల్ అయ్యింది. మహిళా లోకానికి శుభవార్తను ప్రకటించిన మంత్రివర్గం. వ్యాపార రంగంలో మహిళల పాత్ర గణనీయంగా పెరగాలని, వారికి ఆర్థిక స్వావలంభన కల్పించాలనే ఉద్దేశంతో... కొన్ని మద్యం దుకాణాలను స్త్రీల పేరు మీద మంజూరు చేయడం జరిగినది.

... ... ...

వీధి మొదట్లోనే తచ్చాడుతున్న ప్రసాద్‌ను చూసి గతుక్కుమంది నారాయణమ్మ. తప్పించుకొని పోవటానికి వీలు లేని పరిస్థితి....

"ఏం... ఈన్నే కాసుకోండావ్... ఇంటికి రాకుండానే పోతానా...."

"ఏమో తల్లీ నా డ్యూటీ నాది. ఒక గంట దాటి నాక వస్తే... నీకాడ చిల్లర దుడ్లు కూడా మిగిలిండవు అని నాకు తెల్దా ఏం..."

నారాయణమ్మ మౌనంగా ఉండిపోయింది. వున్నట్టుండి తలమీద వున్న ఖాళీ ఇనుపగోళం, ఖాళీ క్యారియర్ మోయలేనంత బరువుగా అనిపించాయి. జాకిట్లో దాచుకున్న పర్సును తడిమింది. వారం కష్టం... మూడు కిలోమీటర్ల దూరం నుండి గుండెల్లో దాచుకొని వస్తోంది. ఎవరిదో బరువు తను మోసినట్టుగా వుంది నారాయణమ్మకు. మనసులో లెక్కలు వేసుకుంటుంటే గుండె గుబగుబలాడింది.

'ఈ పిల్లోనికి వారం కంతు కట్టే మిగిలిందాంతో వారం భత్యం కొండానికి పైసలు యాడ వుంటాయి. యింగ నాగుల చవితికి ఏం చేసుకోవాల్ల? పిల్లలకు ఏం పంపేది? నూనె, పప్పులు, కొబ్బరి, బెల్లం, నువ్వులు.. ఐదుసార్లు అయినా గావల్లా... తంబ్రీ మద్దిలేటి స్వామి. యాన్నుండి త్యావాల...? నాగుల చవితికి ఇంత నువ్వుల పిండి, ఇన్ని కర్జికాయలు పంపేకి మీ పుట్టింటోళ్లకు గతి లేదా అని మొగునింట్లో ఏపుకుతింటారు పిల్లను.. బతకనియ్యరు దాన్ని. సుఖం అనేదే లేకుండా పోయింది పిల్లకు. నానా తిప్పలు పడి, అప్పులు చేసి... వాళ్లు అడిగిందే టివి అన్ని పెట్టి పెండ్లి జేసిచ్చి... ఏం లాభం... ఈడ తిని తినక వారం వారం కంతులు ఇప్పటికి కడ్తేంటే... అదేమో మూడు దినాలకు అయిపోగొట్టే... కాళ్ల పట్టీలు అమ్ముకుండ్యా... కమ్మలు కూడా కరగదీశ పాడుముండా కొడుకు... యాడుంటేవి తాగేదానికి సాలదంల్యా...దినాము కుతికల దాక తాగడం... పెళ్లాన్ని సావగొట్టడం.. అడ్డు అదుపు లేనివానితో సంసారం చేయడం బ్రహ్మతరం కూడా కాదు. ఇట్లాంటేదర్వేసి నా కొడుకులను ఎందుకు పుట్టిస్తాడో ఆ బ్రహ్మదేవుడు... పుట్టిచ్చినా తాగి పెళ్లాన్ని సావగొట్టమని ఎందుకు రాత రాస్తాడో... ఏం జేస్తాం ఖర్మ... నాకు రాసింది సాలక నా బిడ్డకు కూడా ఇదే రాత రాయాల్న...' ఆలోచనలలోనే నారాయణమ్మ ఇంటి తలుపు తీసింది.

ఇల్లంటే.. గోడలు, కిటికీలు, తలుపులు, గదులు, వున్న ఇల్లు కాదు. చుట్టూ పొడుగాటి నల్లరాతి బండలను పాతారు. పైన కొట్టంలాగా రేకులు కప్పారు. ఆ ఇంటి మొత్తానికి ఒకటే వాకిలి. అది కూడా పలుచటి అల్యూమినియం రేకుతో చేసిన తలుపు.

సామాన్లను ఇంట్లో ఒకమూలకు పెట్టింది. చిన్నపర్సును తెరిచి నోట్లను లెక్కపెట్టుకుంది. వారానికి తనకు వచ్చే బట్వాడా ఎంతో నారాయణమ్మకు తెలియక కాదు. ప్రతిసారి మేస్త్రీని అడుగుతూనే ఉంటుంది.

"మ్యావ్... వారానికి ఒకసారి కూలి పెరుగుతాదా ఏం... బొగ అడుగుతుంటావ్... నువ్వేమో ఇట్లా... నీ మొగుడు వచ్చింది వచ్చినట్లు తాగేస్తాంటాడు..." అని అంటే...

"ఈ సంసారం చేయడం నా వల్ల కాకుండుంది. తాగి తాగి అట్ల నాశనం అయినా అయిపోడూ... ఎందుకలే.. ఇట్లాంటొనికి కట్టబెట్టనోళ్లను అనాల..." కన్నవాళ్లను, కట్టుకున్న వాన్ని అందర్నీ కలిపి తిడ్తుంది.

"అందరి ఇండ్లల్లోనూ వుండే భాగవతమేలే" అనిఎవ్వరూ నారాయణమ్మ మాటలను సీరియస్‌గా తీసుకోరు.

వంద రూపాయల నోట్లు రెండు తీసుకొని బయటకు వచ్చింది నారాయణమ్మ.

"ప్రసాదూ... ఏమనుకోవాకు.. ఈ వారం కొంత సర్దుకో... సన్నోనికి ఇస్కూల్లో పీజులు కట్టాల... పెద్దోనికి కట్టే పని లేదులే.. గవర్నమెంటే కడ్తేదంట... కాని బుక్కులు, బట్టలు అవి ఇవి తాపీయ్యాల... అన్నీ అసడ్తాలే... అన్నీ ఒక్కతూరి వచ్చి మీద పన్యాయి... వచ్చేవారం ఇస్తాలే అంతా కలిపి.."

నోట్లను ప్రసాద్ చేతిలో పెట్టబోయింది. చెయ్యి వెనక్కు తీసుకున్నాడు ప్రసాద్. కోపం తన్నుకు వచ్చింది అతనికి. "కడుపుకు ఏం తింటారు మీరు? ఎప్పుడూ యాదో వొగటి జెప్తానే వుంటావ్... అంత కట్టలేని దానివి మా దగ్గర అప్పు ఎందుకు తీసుకుండావ్... బిడ్డ పెండ్లికని తీసుకుంటివి... అప్పు ఇచ్చే వరకూ మా ప్రాణం తీస్తివి. తీసుకున్నాక కూడా నా ప్రాణం తింటావ్... మీ యట్టాంటోళ్లు నల్గురు వుంటే సాలు కంపెనీ దుమ్మునాక్కోని పోతాది. మా బాధలు మీకు ఎంతజెప్పినా అర్థం కావులే... టార్గెట్ వసూలు కాకపోతే మాకు జీతాలు ఇయ్యరు... పైగా నోటికొచ్చినట్లు తిడ్తాడు మా సార్... ఈయ్యాల పన్నెండో తారీఖు... ఇంతవరకు జీతం ఇయ్యల... ఈరోజు డబ్బులు తీస్కపోయి చేతిలో పెడ్తేనే జీతం పైసలు ఇస్తాను అన్నాడు. మూడు దినాలయా మా నాయన్ను ఆసుపత్రిలో జేర్పిచ్చి... ఇంజక్షండ్లకు కూడా పైసలు లేవని మాయమ్మ ఏడ్చి మొత్తుకుంటాంది... నీ కాళ్లకు మొక్కుతా నన్ను గోదా దియ్యాకు..." రెండు చేతులు జోడించాడు ప్రసాదు.



నారాయణమ్మకు ఏం అనడానికి నోరు పెగలలేదు. "ఎవరిగోడు వాళ్ళది... శని తగులుకుంటే ఇడ్సిపెడ్తుందా.." గొణుక్కుంటూ మిగిలిన రెండు వందల యాభై ప్రసాద్ చేతిలో పెట్టింది. నాలుగు వందల యాభై రూపాయలు ముట్టినట్టుగా రసీదు ఇచ్చాడు.

"అన్నంలోకి కూర సంగతి ఆలోసించకుండా నీ అప్పు తీరాల్సి వస్తాంది. మానం తీస్తారు కంతు కట్టకపోతే.."

"ల్యాకపోతే మీరు కట్టే రకమేనా.."

"బుద్ధుంటే మీకాడ అప్పు జేయకూడదు.."

"నువ్వు తీసుకోకపోతే తీసుకునే వాళ్లు మస్తుగుండారు. లెక్కలు గావల్ల అని మాచుట్టూ తిరిగేటోళ్లు కొల్లలుగా వుండారు. మా కరీముల్లా ఫైనాన్స్‌కు ఏం మునగదు..."

"నీయాకట్ల వసూలు జేసేటోళ్లు జిక్కితే మేం మునుగుతాంగాని కంపెనీ ఎందుకు మునుగుతాది..."

నారాయణమ్మకు కడుపు రగిలిపోతోంది. ప్రసాద్ వెళ్లినవైపు చూస్తూ దిగులుగా నిలబడిపోయింది. అంతలోనే నానబెట్టిన బియ్యం గుర్తుకు వచ్చి మెల్లిగా కదిలింది.

మిగిలిన డబ్బులతో బెల్లం, పామాయిల్ పాకెట్ కొనుక్కొచ్చింది. నానబెట్టిన బియ్యాన్ని రోట్లోపోసి ఉంచింది. బెల్లాన్ని పాకం పట్టింది. తెల్లటి బియ్యపు పిండిని పాకంలోకి పోసింది. అరిసెల పాకు చూస్తుంటే నోట్లో నీళ్లు వూరాయి నారాయణమ్మకు. గిన్నెకు బట్ట చుట్టి పైన పెట్టింది.

భర్త కోసం ఆత్రంగా ఎదురు చూస్తోంది. ఇంకా రాకపోతే నారాయణమ్మకు అనుమానంగా వుంది. పక్కిట్లో టీవి చూస్తున్న చిన్న కొడుకును పిలిచింది. రియాల్టీ షో మధ్యలో లేచి వచ్చినందుకు వాడి బాధ వర్ణనాతీతం.

"మీనాయన యాడుండాడో చూసి ఇంటికి పిలుచుకురా పోరా..." కొడుకును బుజ్జగిస్తూ చెప్పింది.

ఇంతలో నాలుగు ఇళ్ల అవతల తూలుకుంటూ వస్తున్న పచ్చన్నను చూసి,

"అదిగో... వస్తాండాడు చూడు.." అరచి పక్కిట్లోకి దూరాడు. దగ్గరగా వచ్చిన పచ్చన్న దగ్గర నుండి వాసన గుప్పుమంది. నారాయణమ్మ అనుకున్నంత అయ్యింది. మంచంలో కూలబడిన మొగున్ని చూసి లబలబ మొత్తుకుంది.

"వచ్చిన లెక్కంతా బుడ్డీలకే ముండమోయిస్తే ఎట్లను కుండావ్... సన్నోనికి పీజు ఏం కట్టాల...? పెద్దోడు కాలేజీలో జేరినాడు... వానికి ఏం బెట్టి గుడ్డలు కుట్టిస్తావ్... బుక్కులెట్ల కొనిస్తావ్... ఇంట్లో జూస్తేనా సరుకులు ఏంటవేగాని లేవు... పండక్కు పిల్లలకు ఏం జేసి పెట్టాల... పిల్ల సంగతి ఏమన్నా మన్సుకు వుందా... ఆడ నా అల్లుడు తాగి దాన్ని ఏపకతింటున్నాడు. ఈడ నువ్వు మమ్మాల్ని ఏపక తింటున్నావ్... తాగి తాగి నీకు సావన్నా రాకుండా వుంది.." మెటికలు విరిచింది.

చిద్విలాసంగా నవ్వాడు పచ్చన్న.

"ఏంటెకే...చెవికోసిన మేకలెక్క అట్ల అరుస్తావ్... ఏం మీ అబ్బ సొమ్ము ఏమన్నా పెడ్తాండావా నాకు. నా కష్టార్జితమే యిది తాగుతానో మీద పోసుకుంటానో నా ఇష్టం... ఎక్కువ మాట్లానావంటే మక్కెలు ఇరగ్గొడతా..."

"తాగొచ్చి కొంపలో చేసే పని ఇదే కదా! తన్నడం... వండిందేది గొంతుదాకా సించుకోవడం..."

నారాయణమ్మ ఏడుపు పచ్చన్నకు కిక్ ఇస్తోంది.

"మళ్లీ అదే కూతుకూచ్చాండావ్... నోరు ఎత్తితే సావ్.. గొడ్తాన్... మొగునికి కూడా పెట్టకుండా నువ్వే మింగుదామను కున్యావేమో.. మొగుడు అంటే భయం, భక్తి లేకుండా పోతోంది... నరకానికి పోతావే నువ్వు నరకానికి.."

తీవ్రస్థాయిలో అరిచేవాడు వున్నట్టుంది చప్పుగా చల్లారిపోయాడు. ఏదో గుర్తుకు వచ్చి చప్పట్లు కొట్టి భార్యను పిలిచాడు.

"తిక్కమొగం దానా... ఏంటికే అట్ల దిగులు జేసుకుంటూ ఏడుస్తావ్. అన్నీ గవర్నమెంట్ జూసుకుంటాదిలేయే... మనం జేయవల్సిందల్లా... ఫుల్లుగా తాగడమే... మనం ఎంత తాగితే గవర్నమెంట్‌కు అంత డబ్బులు జమ అయితాయ్... వాళ్లకాడ డబ్బులుంటేనే పీజులు కడ్తారు, మనకు బియ్యం ఇస్తారు, మియమ్మ అట్లాటోళ్లకు పించన్ ఇస్తారు... మనకు పని కూడా జూపిస్తారు. వాళ్ళ సొమ్ము మనకెందుకే... ఋణం వుంచుకోగూడ్దు... తాగి వాళ్ల బాకి

తీర్చేయాల్నా వద్దా? నేను ఎప్పుడు కరెక్టే మాట్లాడతానే... నువ్వే ఎగ్రిముండవు... ఏడ్చి సస్తాంటావ్... కావాలంటే రేపు నీకు కూడా తెస్తా ఏస్కో" నారాయణమ్మ తల బాదుకుంది.

"మాటలకేంలే... తాగి ఎన్నయినా వొదురుతావ్... సిగ్గులేకపోతే సరి... ఇట్ల వొగలు కూతలు కూసుకుంటూ తాగి కొంపను నాశనం చెయ్యి... నీ మట్ల తాగుబోతుల నుండి ఆ సోమన్నగౌడ్ వాళ్లు బాగుపడిపోతారు... వాయన కొడుకులు మిద్దెలమీద మిద్దెలు కట్టిస్తాండారు... దిన్నమొక కారులో తిరుగుతా జల్సాగా వుంటారు... మనం మాత్రం ఇట్టనే వుంటాం."

ఖాండ్రించి మంచం పక్కన వుమ్మాడు పచ్చన్న.

"వాళ్లు బాగుపడితే నీకెందుకే ఏడుపు... పోన్లే ఏడ్సాకు... ఓ పని చేస్తా... మా సెల్లెలూర్లో అదేనే చౌటపల్లెలో కూలి బాగా ఇస్తారంట ఆటకిపోతా...ఆ వూర్లో రైతులు అందరూ శెనగ పండిస్తారట... లెక్కలు దిక్కుల్యాకుండా వస్తాండాయంట... పొద్దున కూలి అన్నివూర్లల్లో ఇచ్చినట్లుగా ఆడ కూడా ఇస్తారు... మధ్యాహ్నం కూడా కూలికిపోతే కూలి డబ్బులతో పాటు ఓ క్వార్టర్ మందు పోస్తారంట... ఆ వూర్లో సదాశివారెడ్డి అని ఓ పెద్దరెడ్డి వుండాడులే... వాయనకు బ్రాందీ సాపు వుందంటలే మారాజుకు... ఇంగ జూనుకో ఈడ ఈనాకొడుకులు మిద్దెల మీద మిద్దెలు కార్లమీద కార్లు ఎట్లకొంటారో నేను చూస్తాను..."

చొక్కా చేతులు పైకి మడిచాడు.

ఎవరి కోసం ఎవరితో యుద్ధం ప్రకటించాడో అర్థం కాక నారాయణమ్మ నివ్వెరపోయింది.

... ... ...

బైక్ శబ్దం విని టివి సౌండ్ తగ్గించాడు డేవిడ్. ఆత్రంగా వెళ్లి తలుపు తీశాడు. శ్రీనివాస్ చేతిలో వున్న పాకెట్‌ను చూసి "ఊ... బానే పట్టినావే... రాత్రి పన్నెండయినా షాపులు తెరిచే వుంచారా? మనం, ఎక్సైజ్ వాళ్లం షాపులు మీ బుద్ధి పుట్టినంతసేపు తెరిచి పెట్టుకోండి అంటే ఎందుకు తెర్చరు... ఇంతకు ఈరోజు బకరాగాడు ఎవరు..." అనుమానం వచ్చి బంగారుపేట పిక్ పాకెట్‌గాల్లను నాలుగు తంతే.. కక్కిరి నా కొడుకులు.. ఎవరిదో పర్స్ కొట్టేసినారంట డేవిడ్... ఫిఫ్టి ఫిఫ్టిషేర్ చేసుకున్నాం... వాళ్లే తాగి ఎందుకు నాశనం కావాల... వాళ్ల ఆరోగ్యం కోసం... దేశం ప్రగతి కోసం మనం కూడా కొంచెం తాగుదాం..."

విరగబడి నవ్వుకున్నారు ఇద్దరు.

ప్లేట్స్, గాజు గ్లాసులు తెచ్చి టీపాయ్ మీద పెట్టాడు. బిరియాని, చికెన్, పకోడి రెండు ప్లేట్లల్లో సమానంగా సర్దిపెట్టాడు డేవిడ్. పేపర్లో చుట్టిన బ్రాందీ బాటిల్‌ను బయటకు తీసి గాజు గ్లాసుల్లో సగం వరకు నింపాడు.

"పిక్ పాకెటింగ్ కేసులు రోజుకు ఐదారయినా మన స్టేషన్‌కు వస్తాంటాయ్ ఈ రోజు రాత్రి పదిగంటలప్పుడు ఎస్సైగాడు లేడు... నేను డ్యూటీలో వుంటి... ఓ పిల్లోడు వచ్చినాడు శీను. ప్రసాదని కరీముల్లా ఫైనాన్స్‌ల్లో పని చేస్తాడంట... రాజ్‌విహార్ దగ్గర బస్సు ఎక్కుతుంటే పర్స్ కొట్టేసినారంట... జీతం తీసుకొని వాళ్లనాయన హాస్పిటల్లో వుంటే చూసేకిపోవాల అని బయలుదేరినాడు. జీతం గీతం అంతా ఫట్...

"ఆ పిల్లోనికి రాత్రంతా నిద్ర వుండదు. అదే ఆలోచిస్తాంటాడు. కొట్టేసినోడేమో తాగి జల్సా చేసుకుంటూ రాత్రంత మేలుకొని పొద్దున్నే నిద్రబోతాడు..."

"అందుకే డేవిడ్... ఆ పిల్లోని దుఃఖం ఉపశమించడానికి... వాళ్ళనాయన ఆరోగ్యం బాగుపడాలని కోరుకుంటూ.. ఈ గ్లాసు పూర్తి చేస్తున్నాను.." గ్లాసులో మిగిలినది ఒక్క గుక్కలో నోట్లో పోసుకున్నాడు శ్రీనివాస్.

గొంతు భగ్గున మండింది. మరికొంతసేపట్లోనే మత్తు ఎక్కడం ప్రారంభించింది.

"అందరూ తాగేటోళ్లే. మూతిమీద ఇంకా మీసం మొలవనోడు కూడా షాప్‌లకు వచ్చి కొనక్కిపోతన్నారు. మొత్తానికి బ్రాందీ షాపుల్లోళ్ల పంట పండుతాంది. వద్దంటే డబ్బులు... మూడుబార్లు... ఆరు షాపుల మాదిరిగా వెలిగిపోతున్నారు కొడుకులు ఒక్కొక్కరు..."



"ఎవన్నోవొగన్ని పట్టు...కాని మనమ్ కూడా ఓ షాప్ పెట్టుకుందామ్..." మత్తుగా డేవిడ్ భుజం మీద వాలిపోయాడు శ్రీనివాస్.

... ... ...

"మేము ఇంతకు మునుపు ప్రకటించిన విధంగా అబ్కారి ద్వారా వచ్చే ఆదాయాన్ని సంక్షేమ పథకాలకు కేటాయిస్తామని పత్రికా ముఖంగా ప్రజలకు మరొక్కసారి తెలియజేస్తున్నాను. సంక్షేమ పథకాలు కొనసాగించాలి. అంటే ప్రభుత్వం దగ్గర తగినంత నిధులు వుండాలి. ఈ విషయాన్ని అర్థం చేసుకోకుండా ప్రతిపక్షాలు రాద్ధాంతం చేస్తున్నాయి. ప్రజలే వారికి తగిన బుద్ధి చెప్తారు..." ముక్కు కిందికి చేరిన కళ్లజోడును పైకి తోశాడు మంత్రి.

ఎప్పుడూ పాడే పాటనే కదా అన్నట్లు విలేకర్లు నోట్ చేసుకోవటం లేదు. బాదం బర్ఫీ, ఖాజా పకోడి తినడంలో మునిగిపోయారు. ఓ మహిళా విలేఖరి స్వీట్లు, హాటు ముట్టుకోలేదు. లిక్కర్‌ను ఎదురుగా పెట్టినట్టుగా ఫీలింగ్ వచ్చింది. చేతిలోకి మైక్ తీసుకొని నిలబడింది.

"ప్రజల ఆరోగ్యాల మీద మీకు దృష్టి లేదా? లిక్కర్ వలన స్త్రీలకు ఎదురయ్యే ఇబ్బందులకు ఎవరు బాధ్యులు..."

మంత్రి ఎదురు చూసిన ప్రశ్నే... దానికి సమాధానం కూడా సిద్ధం చేసి పెట్టుకున్నాడు.

"ప్రజల ఆరోగ్యం మీద మాకు శ్రద్ధ వుంది అని చెప్పడానికి మేము ప్రవేశపెట్టిన పథకాలే అందుకు నిదర్శనం. ఇంకా మద్యం నుండి నష్టాలు వున్నాయి అనే సామాజిక స్పృహ మా ప్రభుత్వానికి వుంది. లిక్కర్ సిగరెట్ల వాణిజ్య ప్రకటనలలో... మద్యం, ధూమపానం

సేవించటం ఆరోగ్యానికి హానికరం... అని మేము జారీ చేస్తున్న హెచ్చరికే తెలుపుతోంది మా ప్రభుత్వం యొక్క చిత్తశుద్ధిని..."

అందరికీ నిలువుగుడ్లు పడ్డాయి. ఆ మహిళా విలేకరి తిరిగి ఏదో అడగబోయింది. ఆమెను మధ్యలోనే ఆపి... "మీరొక్కరే ప్రశ్నలు అడిగితే ఎలా? వేరే వాళ్లను కూడా అవకాశం ఇవ్వాలి... నెక్స్ట్" ఆమె ప్రక్కనున్న ఇంకొక విలేకరిని ఉద్దేశించి అడిగాడు.

"మీరు గాంధేయవాదులం అని చెప్పుకుంటారు కదా! మరి గాంధీ గారి సిద్ధాంతం ప్రకారం మద్యం సేవించడం, ప్రోత్సహించడం, అమ్మడం లాంటివి తప్పు కదా! దీనికి మీరు ఏం సమాధానం చెప్తారు."

మంత్రి చిద్విలాసంగా నవ్వాడు. తన వెనుక తగిలించిన గాంధీ ఫొటోకు లేచి నమస్కారం చేశాడు.

"ఎంతటి తాగుబోతులయినా గాంధీగారి పేరు వింటే... తాగటం ఆపేస్తారు. ప్రజల చేత మద్యం సేవించటం మాన్పించటానికి మేము ప్రతి వూరిలో కనీసం ఒక్క బార్‌కు, బ్రాందీ షాపులకు అయినా గాంధీ పేరు పెట్టమని షాప్ యజమానులను ఆదేశిస్తాము.."

ఇదేదో కొత్తగా వుందే అని విలేకర్లు నోట్ చేసుకున్నారు. "స్త్రీలు ఎదుర్కొనే సమస్యల పట్ల మీ స్పందన చెప్పలేదు..."

నోరు చెవులదాకా సాగేట్టుగా నవ్వాడు మంత్రి.

"రాష్ట్రంలోని స్త్రీలు అందరూ మాకు ఆడపడచులు, తోబుట్టువులే.. వారి కోసం ప్రత్యేకంగా కొన్ని షాపుల ముందర కేవలం స్త్రీలకు మాత్రమే అని బోర్డు పెట్టిస్తాం... దాంతో ఏమవుతుంది... స్త్రీలే స్వయంగా కొని ప్రేమగా తన ఇంటిలోని మగవారికి అందజేస్తే... ఇక మగవాళ్లు స్త్రీల మీద చెయ్యి చేసుకోవడానికి సాహసిస్తారా? దేవతల మాదిరిగా పూజించరూ?..."

అందరినోళ్లు తెరుచుకున్నాయి... అవి మూత పడకముందే మంత్రి విలేకర్ల సమావేశాన్ని ముగించాడు.

వరుగు లాంటి నడకతో ఓ ఎమ్మెల్యే మంత్రిని అనుసరించాడు.

"పత్రికలు నానా రభస చేస్తాయేమో సార్..."

ఎమ్మెల్యే కంగారును చూసి మంత్రి చిరునవ్వు నవ్వాడు.

"చెయ్యనీ లేవయ్య... ఎన్ని రోజులు చేస్తారు.. మహా అయితే నాలుగు రోజులు రాస్తారు.. రాసుకొని... వాళ్లు కూడా రేటింగ్ పెంచుకోవాలి కదా! తర్వాత వాళ్లకు ఏదో వొకటి కొత్త విషయం దొరుకుతుంది. దాని వెంట పడ్తారు.. మెల్లిగా అందరూ మరిచిపోతారు.. అన్నిటికి అలవాటు పడ్తారు... మనకు కావాల్సింది కూడా అదేకదా..." ఎమ్మెల్యే భుజం చుట్టూ చెయ్యి వేశాడు మంత్రి.

"రాష్ట్ర ఆదాయాన్ని పెంచుకోవాలి అంటే లిక్కర్‌ను ప్రోత్సహించటం తప్ప వేరే మార్గం లేదు. టార్గెట్స్‌ను ఎంత త్వరగా పూర్తి చేస్తే అంత మంచిది. అమ్మకాలు వీలయినంత ఎక్కువ చేయండి... మిగిలిన విషయాలను పక్కనబెట్టి దీనిపైననే దృష్టి పెట్టమని ఆదేశిస్తున్నాను..." ఎక్సైజ్ అధికారులతో తన సమావేశాన్ని ముగించి పైకి లేచాడు ముఖ్యమంత్రి.

# ప్రయాణీకుల గొంతు

- హిందీ మూలం : అల్‌జహీర్
అనువాదం : జి.వి. రత్నాకుమార్

ప్రయాణీకుల వరుస దూరంగా
విస్తరించి ఉంది
ఉత్సాహంగా ఊగుతూ
పెద్ద పెద్ద అడుగులు
నేలపై వేడిలో మరియు చలిలో
వేస్తూ నడుస్తున్నాను
...
అడుగులు సాగాయి
నేనూ అడుగుల వెంటే నడిచాను
మురికిని చూసి
ప్రయాణీకులు ఆగారు
నేను కూడా ఆగాను
ఖర్జూరపు చెట్టులా నిలబడ్డాను
...
ప్రయాణీకుల గుంపుతోపాటు
పరుగెత్తసాగాను
వారిని పిలవసాగాను
ప్రయాణీకులారా?
ఈ ప్రయాణానికి అంతమెక్కడ?
నేను ఎన్ని వేషాలేసి మీవెంట పరిగెత్తాలి
...
ప్రయాణీకులు నన్ను
పనిలేనివానిగా
అవసరంలేని వానిగా భావించి
నావేపు చూడటం లేదు

# గింజ

మట్టి చల్లదనం వేడిని నిర్ణయిస్తుంది
గింజ గింజని నెత్తిమీద కెత్తుకొని
అణువణువు కదులుతోంది
దారి పూలదారైనా లేక రాళ్ళదారైనా
వెలుతురు ఉన్నా
లేక చీకటి రాజ్యమేలుతున్నా
గింజ గింజని నెత్తికెత్తుకొని
అణువణువు కదులుతోంది
ముందున్న వాళ్ళు
ఎందుకాగారో తెలియదు?



గాఢమైన నీడ
తలపై నున్న నీడలో కలిసిపోయింది
వెళ్ళే వాళ్ళు తల మీద ఏం వేశారో
ఎంత నీడ ఎదురు నిలుస్తుందో తెలియదు
ఆ నీడల నుండి రక్షణ పొందలేకపోతే
రానున్న ఆకారాన్ని
మేం ఆపాల్సి వస్తుంది

# మరణం

మరణం భవిష్యత్ కాలపు ఒక గమ్యం
మరణం నిరంకుశమైన ఒక కల
మరణం అంటే చీకటి మాత్రం కాదు



ఏదేమైనా మరణం ఒక రహస్యం
దాని దృష్టిలో అది నిత్యం బ్రతికే ఉంటుంది
మరణం అర్థంలేని ఒక నిశ్శబ్దం
ఒక అనుకోని వియోగపు సరిహద్దు రేఖ
ఒక జరగరాని బలహీనత
కాలంతోపాటు వదిలేయాల్సిన విధి
నిద్రలోనే వదిలి వెళ్ళాల్సి వచ్చేది
నిరూపించబడే బలమైన ఒక బంధం
బ్రతుకు బాధల మధ్య
పొడవైన ఒక బంధం

# ప్రార్థన



తలలపై గుమ్మటాల బరువునెత్తుకొని
అందమైన మెరిసే చేపల గుంటలోకి
దూకుదాం
పూజారి పిలుపందుకొని
పావురాలు ఎగిరినట్లు
దూకుదాం
ఆటుపోట్ల జీవితాన్ని ప్రేమించి
నిరంతర దుఃఖాల్ని అవలీలగా దాటుదాం

# రాజ్యమూ - ప్రజలూ : రవీంద్రనాథ్



- అనునయ్ ఛటోపాధ్యాయ

రవీంద్రనాథుని పుట్టుక, మరణం రెండూ వలస భారతదేశం లోనే జరిగాయి. తన ఎనభై ఏళ్ళ జీవితంలో ఏ రాజ్యశక్తిని ఆయన చూశారో అది సామ్రాజ్యవాద రాజ్యశక్తి. బాల్యంలో ఆయన ఏ దేశాలైతే పర్యటించారో, అవి వేరే దేశాలను ఆక్రమించుకున్న పెట్టుబడిదారీ దేశాలే. బ్రిటిష్ దోపిడీ యొక్క చిరస్థాయి బందోబస్త్ పద్ధతినుండి పుట్టిన జమీందారీ కుటుంబంలో ఆయన పుట్టాడు. యవ్వనం నుండి కొన్ని దశాబ్దాలు ఆయన తూర్పు బెంగాల్లో కుటుంబ జమీందారీని ప్రత్యక్షంగా చూసుకోవాల్సి వచ్చింది. బెంగాల్ నవ చైతన్యానికి కలకత్తాలో జోడాసాంకోలో ఉన్న ఠాకుర్‌బాడి (రవీంద్రుని పూర్వీకుల నివాసం) కేంద్రంగా ఉండేది. హిందూ జాతీయతకు కూడా అదే కేంద్రంగా ఉండేది. తాత ద్వారకానాథ్ ప్రయత్నాల వల్ల బెంగాల్ తొలి పారిశ్రామికీకరణ చొరవ కూడా ఈ ఇంటి నుండే జరిగింది. మహారాణి దగ్గర నుండి పాలకులు, వ్యాపార్లుతో ద్వారకానాథ్‌కు చాలా సన్నిహిత సంబంధాలున్నాయి. తమ్ముడు సత్యేంద్రనాథ్ బ్రిటిష్ పాలనలో ఉన్నత పదవిలో ఉన్నారు. ఇలాంటి ఒక కుటుంబంలో ప్రపంచంలోని ఒక ఉత్కృష్ట సృజనశీల వ్యక్తి పెంపకం జరిగింది. సృజనాత్మకతకు సమగ్రంగా తీసుకున్న చొరవతో సహా విద్య, సమాజం, జాతి గురించి ఆలోచన, కృషి కొరకు తనను నిమగ్నం చేయటంలో ఆయనకు ఆయనే సాటి. తన దుఃఖాన్ని వెల్లడిస్తూ చిన్నతనంలో తను పరాన్నజీవి అయి ఉండాల్సి రావటం తనకు దుఃఖాన్ని కలిగించిందని ఆయన చెప్పుకున్నారు. స్రష్ట, కర్మజీవి అయిన రవీంద్రుడు బహుశా జీవితాంతం తనను మార్చుకోవటానికి సాధన చేశాడు.

ఈ వ్యాసం విషయం రవీంద్రుని జాతీయ భావన ఒడిదుడుకులు. వాటిలోనే రాజ్యశక్తి, జనశక్తి వాస్తవిక స్వరూపాల్ని అర్థం చేసుకోగల ఆయన అమోఘమైన సామర్థ్యం ఇమిడి ఉంది. ఆశ్చర్యకరంగా ఆయన ఆలోచనా శక్తి ఇంచుమించు బాల్యావస్థ నుండి తుది శ్వాస దాకా చెదరకుండా ఉంది. ఆయన జీవితంలో అన్ని పరిస్థితులలోనూ జాతీయ, అంతర్జాతీయ రంగంలో రాజ్యశక్తుల గురించి ఆలోచిస్తూ ఉండేవారు. అలాగే ఎప్పటికప్పుడు నిర్ద్వంద్వంగా తన అభిప్రాయాలను వెల్లడించేవారు. ఆయన ఇలా చెప్పారు, 'నా దృష్టిలో రాజ్యశక్తి అనే ఏదైనా స్థిరమైన భావన ఒక్కసారిగా సమగ్రంగా ఏదో ఒక సమయంలో పుట్టలేదు, జీవితానుభావాలతో సహా వివిధ పరివర్తనల ద్వారా అది మెల్లమెల్లగా రూపుదాల్చింది. ఈ మొత్తం పరివర్తనలో నిస్సందేహంగా ఒక ఐక్యతా సూత్రం కూడా ఉంది. ఆయన ఆలోచనల క్రమాన్ని అనుసరించే మనం బ్రిటన్ - భారత్ సంబంధాలతో సహా అంతర్జాతీయ రంగంలో జాతీయ ఘాత - ప్రతీఘాతాలు, వివిధ సిద్ధాంతాలు, ఆందోళన - పోరాటాలు, యుద్ధం - శాంతి వంటి వివిధ ప్రసంగాలకు సంబంధించి ఆయన భావన, ఐక్యతా సూత్రాన్ని అర్థం చేసుకోవటానికి ప్రయత్నిద్దాం.

రవీంద్రుని రచన 'ఛేలే బేలా (బాల్యం), 'హీరక్ స్మృతి (వజ్ర స్మృతి)' నుండి మనకి ఆయన బాల్యం, కిశోరావస్థ నిరుత్సాహంగా, కుటుంబానురాగానికి నోచుకోక పని మనుషుల అదుపులో గడిచిందని తెలుస్తుంది. అన్నల 'హిందుకోష్', 'సంజీవని సభ' లేక నాటక గీతాల ద్వారా స్వదేశీ స్ఫూర్తి ఆయనలో మేల్కొంది, కాని జోడాసాంకో ఇల్లు తప్ప బయట ప్రపంచమే ఆయన జీవితంలో లేదు. విశ్వం సంగతి చెప్పనక్కర్లేదు. అయినా ప్రతిభను ఆపటం కష్టం. ఇది 17 ఏళ్లప్పుడు ఆయన రాసిన 'కవి కాహినీ (కవి కథ)' నుండి స్పష్టమైంది. ఆయన ప్రపంచ పరిస్థితి పట్ల తన ఆవేదన, బెంగ తెలియజేస్తూ, 'ఏమి తీవ్ర అశాంతి ఉందో.... ఈ మానవ జాతిలో...' అని అన్నారు.

ఈ కిశోరుడు కేవలం దోపిడి ప్రపంచమంతటా ఉన్న వలసవాద వ్యథ లోపల చిత్రాన్ని ఉద్ఘాటించటమే కాక భవిష్యద్వాణి కూడా చేశాడు - 'ఏ రోజులు తిరిగి వస్తాయో... ఆ రోజు ఒక ప్రేమలో బంధించబడి, కలిసిపోతాయి కోటికోటి మానవ హృదయాలు.' సమకాలీన రాజకీయ ఆర్థికశాస్త్ర మూలాల గురించి తెలియటం కాని, వాటి గురించి వ్యక్తిగత అనుభవం కాని రవీంద్రుడికి ఆ వయసులో ఉండటం సహజం కాదు, ఐనా యుద్ధం - శాంతి అంశంపై, దోపిడి మూల కారణాలకు సంబంధించి మాత్రం ఆయన ఆశ్చర్యకరంగా శాస్త్రజ్ఞులకు దగ్గరగా ఉన్నారు. ప్రపంచ పరిస్థితి సాధారణ పరిశీలనతోనే ఆయనకు అర్థమైపోయిందేమంటే యుద్ధానికి మూల కారణం పెద్ద దేశాల ద్వారా చిన్న దేశాలను కబళించటం, సామ్రాజ్య కాంక్ష. 19వ శతాబ్దం ఉత్తరార్థం ప్రపంచమంతటా 'మృగయా (వేట)' యుగం, ప్రత్యేకించి ఆసియా, ఆఫ్రికా ఖండాల్లో 1879, 1880 సంవత్సరాల్లో 'భారతి'లో ప్రచురించబడిన, 'యూరప్ ప్రవాసి జాబుల' ద్వారా తెలియవచ్చేదేమంటే తను బ్యారిస్టర్ కావటానికి చిన్నన్న సత్యేంద్రనాథ్ ఠాకూర్ ప్రయత్నంతో బ్రిటన్ చేరుకున్నాక ఐరోపా సామాజిక జీవితంలో అనేక సహేతుకమైన అంశాలు ఆయన దృష్టికొచ్చాయి. కాని వాటి ధాటికీ ఆయన చలించక ఇంగ్లీషువాడి పాలనా - దోపిడి చరిత్ర

గురించి ఆ వయస్సులోనే ఏ భ్రాంతి లేకుండా ఆత్మగౌరవ పూర్వకంగా విశ్లేషణ చేశాడు. ఆయన ఇలా చెప్పారు : "ఇంగ్లండ్‌లో ఏ జాన్, జేమ్స్, టామస్లు వీధుల్లో నిరర్ధకంగా తిరుగుతూ ఉంటారో ఎవరి తండ్రులనైతే ఒక కటికవాడు, దర్జీ లేక బొగ్గులు అమ్ముకునేవాడు తప్ప ఎవ్వరు ఎరుగరో, వారే భారత్‌కు వెళ్ళినప్పుడు, ఏ ప్రాంతానికి వెళ్ళినా అక్కడ వాళ్ల పేరు మారుమ్రోగుతుంది. వాళ్లు గుర్రమెక్కి చేత కొరడా పుచ్చుకుని బయలుదేరితే జనాలు దారి వదిలేస్తారు. వారి ఒక్కొక్క సైగతో భారత్‌లో రాజ సింహాసనాలు కదిలిపోతాయి. ఇలాంటి స్థితిలో వారి పొట్ట పొంగి పొంగి ఏనుగంత అయిపోవటం ఏమి అస్వాభావికం కాదు." ఇంగ్లీషు వారి దుఃఖభాజన, న్యూనతాభావం గల, హాస్యాస్పదమైన అనుకరణ చేసేవారి గురించి వర్ణన ఐదో నెంబరు జాబులో ఉంది. ఇంగ్లీషువారి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం డొల్లతనాన్ని, లోపాల్ని కూడా ఆయన చూడక పోలేదు. బ్రిటిష్ పార్లమెంట్లో గ్లాడస్టోన్ వంటి ప్రపంచ ఖ్యాతిగాంచిన వ్యక్తులను మెచ్చుకుంటున్నా ఐరిష్ పార్లమెంట్ సభ్యుల స్థితి కూడా ఆయన దృష్టిలో ఉంది.

1881వ సంవత్సరంలో రాసిన 'చైనాలో మృత్యు వ్యాపారం' అనే వ్యాసంలో రవీంద్రుడు సామ్రాజ్యవాదుల దోపిడి నిర్దాక్షిణ్యమైన స్వరూపాన్ని చూపించాడు. ఆయన ఇలా రాశారు. "చైనా ఏ వస్తువైతే వద్దనుకుంటుందో అదే బలవంతంగా దాని జేబులో కుక్కేయబడుతోంది. అదే సమయంలో మరో జేబులోంచి దాని ఖరీదు తీసేసుకోబడుతున్నది. సొమ్ము పోగేసుకొనే ఈ పద్ధతిని బందిపోటు తనం అంటారు, (భారతి 1888 జేష్టం)."

ఇంగ్లాండ్ ప్రస్తుత సమృద్ధి వెనుక ఒక చీకటి కోణం ఏదైతే ఉందో, అది వర్గాలుగా విడిపోయిన సమాజంలో అనివార్యం అని ఆయన 'యూరప్ సందర్శకుడి డైరీ'లో రాశారు. ఆయన ఇలా రాశారు : "ఈ సమృద్ధి వెనక చెప్పలేనంత, భరించరాని ఏ పేదరికం ఉందో అది మనకు కనబడదు, కాని ప్రకృతి నియమానుసారం రోజురోజుకి దాని లెక్కలు కట్టబడుతున్నాయి. ప్రకృతిలో ఉపేక్షించబడ్డవాడు తన ప్రతీకారం తీర్చుకుని తీరుతాడు (19 సెప్టెంబర్, 1890)." పెట్టుబడిదారీ సమాజం అంతర్గత సమస్యలకు సంబంధించి రవీంద్రనాథ్ 1891 'స్త్రీ మజూర్' 'కర్మేర్ ఉమేదార్', 'క్యాథలిక్ సోషలిజమ్', 1892లో 'సోషలిజం' అని నాలుగు వ్యాసాలు రాశారు. కార్ఖానాల్లో మహిళా శ్రామికుల ప్రత్యేక సమస్యల నేపథ్యంలో కుటుంబ జటిలతల గురించి రాస్తూ ఇనుప యంత్రాలతోపాటు రక్తమాంసాలు గల మనుషులు కూడా సమానంగా కష్టించివలసి వస్తున్నదని ఆయన రాశారు. దీనివల్ల సంపన్నులకే లాభం, వారు సుఖంగా ఉన్నారు. రాజు ప్రజల స్వాతంత్ర్యానికి అడ్డుగా నిలుస్తే రాజ్య విప్లవం జరగచ్చుని ఆయన హెచ్చరించాడు.

ఈ సమస్యల పరిష్కార రూపంగా ఎన్నో సంశయాలున్నప్పటికీ సోషలిజం ఏకైక భరోసా అని రవీంద్రనాథ్ ఆ సమయంలోనే చెప్పారు. 'ఛిన్న పత్రావళి (వివిధ జాబులు)'లో ఒక జాబులో కవి ఇందిరా దేవికి ఇలా రాశారు : సోషలిస్టులు ప్రపంచమంతటికి ధనం పంచిపెడతారనేది సంభవమో, అసంభవమో నాకు తెలియదు. ఒకవేళ అది పూర్తిగా అసంభవమైతే అది విధి యొక్క విధానం, చాలా నిష్టూరం. మనిషి మందభాగ్యుడు. బహుళాంశం దుఃఖాన్ని తగ్గించటానికి సమాజంలో ఉన్నత అంశం' నిరంతరం ప్రయత్నం చేయగలదు. (10 మే 1893)... 'ఉన్నత అంశం' అంటే ఏమిటో ఆయన స్పష్టంగా చెప్పకపోయినా అది మానవ సమాజం చైతన్యవంతమైన అంశమని నిస్సందేహంగా చెప్పొచ్చు.

19, 20వ శతాబ్దాల్లో రెండు పరిణామాలు రవీంద్రనాథ్‌ని చాలా గాఢంగా ప్రభావితం చేశాయి. దక్షిణాఫ్రికాలో బోయర్ యుద్ధం (1899-1902), చైనాలో బాక్సర్ తిరుగుబాటు (1899-1901). సామ్రాజ్యవాదులు ప్రపంచవ్యాప్తంగా ఆక్రమించుకోవటం, బీభత్సంగా ప్రవర్తించటాన్ని తీవ్రంగా అసహ్యించుకుంటూ, గర్హిస్తూ ఆయన తన 'నైవేద్య' కావ్య సంకలనంలో కొన్ని కవితలు, అలాగే 'వక్తాదర్శన్ (వక్తతత్వం)' పత్రికలో కొన్ని వ్యాసాలు రాశారు. సామ్రాజ్యవాద శక్తుల పరస్పర సంబంధాలు ఎటుపోతున్నవి అనేది వివరించటానికి కవి సమకాలీన రచనల్లో ప్రయత్నించారు. కవి ఇలా రాశారు, (క) స్వార్థ ప్రవృత్తే విరోధం. ఐరోపా నాగరికత సరిహద్దులపై ఈ విరోధం పెరుగుతోంది. (ఖ) 'ఈ మధ్య ఐరోపా యొక్క ఈ విద్వేషం నాగరికత శాంతిని కలుషితం చేస్తోంది.' (సమాజభేద్, స్వదేశ్) (గ) 'అబద్ధం ద్వారా కాని, భ్రమలో పడికాని తనను తాను తన దృష్టిలో గొప్ప అని రుజువు చేసుకోవాలి. అందుకు ఇతరులను కించపర్చాలి... ఇది దేశభక్తికి ముఖ్య ఆలంబనం అయిపోయింది' (ఘ) .....'మానవ సమాజ వికాసం ఒక రాజకీయ తోలుబొమ్మలాటగా మారుతున్నది, దీంట్లో పారిశ్రామికవేత్తలు, బ్యూరోక్రసీ, సైనికులు వగైరా తోలుబొమ్మలను వెనుక నుండి దారం పట్టుకుని ఆశ్చర్యకరమైన నైపుణ్యంతో ఆడించడం జరుగుతుంది. (నేషనలిజం, 1916)'

ఐరోపా దేశాల నైజాన్ని నిర్ధారించటంలో రవీంద్రనాథ్ స్థాయి తీక్షణత ప్రపంచంలో మరెవరూ కనబరచలేదు. 1914 సంవత్సరంలో మొదటి ప్రపంచ యుద్ధం మొదలైనప్పుడు 'సోబూజ్ పత్ర్ (ఆకుపచ్చ పత్రిక)' లో ప్రచురితమైన 'లొడాయిఏర్ మూల్ (యుద్ధానికి మూలం)' వ్యాసంలో కవి ఇలా చెప్పారు : (1) "ఇంకా యుద్ధం మొదలైంది. క్షత్రియులకి వైశ్యులకి మధ్య. దీని తరువాత ఇంకొక యుద్ధం ఎదురవబోతుంది. అది వైశ్యులకి - శూద్రులకి మధ్య. కొద్దిరోజుల బట్టి పెట్టుబడిదార్లు - కార్మికులకి మధ్య దానికి కూడా సన్నాహాలు జరుగుతున్నాయి." (2) "వ్యాపారం ఇప్పుడు కేవలం వ్యాపారమే కాదు... ఒకప్పుడు వస్తువులు వైశ్యుల సంపత్తిగా ఉండేవి. ఇప్పుడు మనుష్యులు వారి సంపత్తి అయ్యారు... దీనివలన ప్రపంచ చరిత్రలో పూర్తిగా ఒక కొత్తరకమైన పరిణామం చోటుచేసుకుంటున్నది. అది ఒక దేశంపై ఇంకో దేశపు ఏలుబడి, ఆ రెండు దేశాలు సముద్రానికి రెండువైపులా ఉన్నాయి."

మొదటి ప్రపంచ యుద్ధం తరువాత రవీంద్రనాథ్ ఐరోపా శక్తుల యుద్ధపిపాస, ధనాశ, ప్రపంచాన్ని పంచుకునే దురాక్రమాల గురించి పుంఖానుపుంఖాలుగా విశ్లేషించారు. యుద్ధం ఆర్థిక కారణాలు కవి చాలా చక్కగా వివరించారు. 'ధనం యొక్క ధర్మమే అసమానత. జ్ఞానమే ధర్మం. కళల సౌందర్యాన్ని నలుగురితో పంచుకుంటే పెరుగుతుంది, తరగదు. కాని, ధనం నలుగురి కంట పడకుండా, నలుగురి నుంచి రక్షించుకోకుండా నిలువదు. అందుకు ధనం కావాలనుకున్న వాడు తన స్వార్థం కోసం పేదరికాన్ని సృష్టిస్తాడు... (లోకహిత్, కాలాంతర్)'

'పశ్చిమదేశాల్లో ఆత్మాభిమానం కొంచెమైనప్పటికి ఉన్నది. వాళ్లకు తమకోపాన్ని చూపించడం తెలుసు. కాని, భారత ప్రజలు ఎంత చీకట్లో ఉన్నారంటే తమకు జరుగుతున్న మోసాన్ని కూడా అర్థం చేసుకోలేరు.' ఈ వెనుకబాటుతనాన్ని రవీంద్రనాథ్ తీక్షణ దృష్టి వెంటనే చూడగలిగింది.

'బంగ్ - భంగ్ (బెంగాల్ విభజన)' వ్యతిరేక ఉద్యమంలో ప్రజావెల్లువ వచ్చినప్పుడు ఆయన సమగ్ర బెంగాలీ జాతిని బిక్షావృత్తి

బదులు పరాధీనతకి వ్యతిరేకంగా దేశ ప్రజల కళ్యాణం కొరకు ఆత్మశాంతిలో పాలుపంచుకోమని, స్ఫూర్తి పొందమని ఆహ్వానించారు. స్వయంగా తాను కూడా తన జమీందారి పరిధిలో ఉన్న పేద రైతులు, ఇతర పేద ప్రజలకు స్నేహితుడై ప్రపంచానికి ఒక ఉదాహరణగా నిలిచాడు. ఏ రాజకీయ నాయకుడ్ని ఇటువంటి పాత్రలో చూడటం జరగలేదు.

ఈ దేశ ప్రజల చైతన్యం గురించి కవి అభిప్రాయం ఇలా ఉంది. 'ఈ రోజు ఆ దేశంలో సాధారణ ప్రజలు కేవలం జనాభా లెక్కల్లోనే నమోదు అవడమేకాక, వారు ఒక శక్తి... వారు ముష్టి అడగటం లేదు, డిమాండు చేస్తున్నారు... మన దేశంలో ఇప్పటికీ సాధారణ ప్రజలు తమను వ్యక్తులుగా గుర్తించటం లేదు. అందుకే తమ ప్రభావం కూడా చూపించలేకపోతున్నారు. వారి లేనితనం, వ్యధ, వారికొరకే విచ్ఛిన్నంగా వ్యక్తిగతంగా ఉండిపోయింది. వారి దుఃఖం ఒకపెద్ద దుఃఖానికి అంతర్గతం అని వారు తెలుసుకోగలిగితే వారు దుఃఖం సమగ్ర సమాజం యొక్క సమస్యగా మారేది (లోకహిత్, కాలాంతర్)'

అందుకు యువ జనశక్తికి కవి ఇచ్చిన పిలుపు : "ఎవరైతే దేశాన్ని చల్లబరిచి ఉంచారో వారు చాలా కాలం ఏకాధిపత్యం చలాయించారు. ఇక వారు దేశ నవ యవ్వనాన్ని అణగద్రొక్కి ఉంచలేరు (వివేచన - అవివేచన కాలంతర్)." ఈ యువశక్తి ఆధిక్యం ఆయన చైనా కార్మికులలో చూసి భవిష్యత్‌వాణి చెబుతూ చైనాయే ఒకరోజు అమెరికాకి వ్యతిరేకశక్తిగా నిలువగల సామర్థ్యం కలిగియున్నదని అన్నారు. చైనా శక్తి చూసి అమెరికా భయపడుతున్నదని ఆయన అన్నారు. పని విషయంలో అమెరికా చైనాన్ని గెలవలేదు. అది చైనాని బలవంతంగా ఆపాలని అనుకుంటున్నది.. (జపాన్ యాత్ర)."



రవీంద్రనాథ్ ఇలా అన్నారు "ఈ రోజు ఐరోపా తీవ్ర సంక్షోభంలో ఒక క్రొత్త వ్యవస్థ, ఒక క్రొత్త జాతీయశక్తి వ్యవస్థ గురించి వెతుకుతున్నది (స్వాధికార్ ప్రమత్, కాలాంతర్)." ఈ ప్రత్యామ్నాయ జాతీయ వ్యవస్థ ప్రారంభం రష్యాలో జరిగింది. విప్లవం గురించి విస్తృతంగా సమాచారం లేనప్పటికి దాని గొప్పతనాన్ని అర్థం చేసుకోగలిగారు.

రష్యా విప్లవం ఎనిమిది నెలల తరువాత 'మోడర్న్ రివ్యూ'లో 'ఎట్ ది క్రాస్‌రోడ్స్' అనే వ్యాసంలో రవీంద్రనాథ్ ఇలా రాశారు : "రష్యాలో ప్రస్తుత విప్లవ చరిత్ర గురించి మనకి చాలా తక్కువనే తెలుసు. మనకున్న కొద్దిపాటి ఆధారాలను బట్టి, రష్యా తన ఆటుపోట్లలో నైతిక దివాళాకోరుతనంపై నిర్మించబడిన సమృద్ధికి వ్యతిరేకంగా, అణచబడలేని మనిషి ఆత్మకు రూపం కల్పిస్తున్నదా? అన్నది మనం ఖచ్చితంగా చెప్పలేము. మనం చెప్పగలిగేదేమిటంటే ఒక నిర్ధారణకి రావడానికి ఇంకా సమయం రాలేదు. ముఖ్యంగా పచ్చి రాజకీయాలు ప్రస్తుతం అతి విషాదకరమైన పరిస్థితిలో ఉన్నప్పుడు నిస్సందేహంగా, ఒకవేళ ఆధునిక రష్యా 'సనాతన' పద్ధతులతో జాత్యాభిమానంతో సమాధాన పడిపోయి ఉంటే ఇంకా ఎక్కువ సుఖమైన పరిస్థితిలో ఉండేది. కాని దాని పోరాటాల తీవ్రత, ఇబ్బందుల నైరాశ్యం బట్టి అది తప్పుద్రోవ పట్టిందని రుజువుకాదు. ఒక జాతిగా రష్యా విఫలం కావటం అనేది జరుగవచ్చు. కాని తన చేతిలో నిజమైన ఆదర్శాల పతాక పుచ్చుకొని అది విఫలమైతే, దాని వైఫల్యం వేగుచుక్కలా కనుమరుగైనా మళ్ళీ క్రొత్త యుగం సూర్యోదయాన్ని తీసుకువస్తుంది (మోడర్న్ రివ్యూ జులై 1918)."

1930లో రష్యా విప్లవం 12 సంవత్సరాల తరువాత గృహ యుద్ధం ముగిసిన వెంటనే ఆహ్వానం అందుకొని కవి సోవియట్ యూనియన్ వెళ్లినప్పుడు అక్కడ అభివృద్ధి చూసి ఆయన ఎంతో పులకించారని మనకు తెలుసు. ఈ సందర్శనాన్ని ఆయన 'తీర్థయాత్ర' అనడానికి కూడా వెనుకాడలేదు. గ్రామీణ బెంగాల్‌లో కర్మయజ్ఞం చేసే రవీంద్రనాథ్ రష్యా విప్లవం తరువాత అక్కడి కర్మ సాధనను ప్రశంసించారు. ఆ ఉదాహరణను దేశవాసులకు బోధపరచడానికి ఆయన ఇలా రాశారు : "1917లో రష్యాలో పని మొదలుపెట్టిన వారికి చాలా ఇబ్బందులు ఎదురైనాయి. అప్పుడు అక్కడ వారి సామాజిక ఆర్థిక పరిస్థితి మనకంటే హీనంగా ఉండేది. కాని అక్కడి ప్రజానాయకులు అబద్ధాలు చెప్పి ప్రజల్ని భ్రమలో ఉంచలేదు. అందుకే ఆ భయంకరమైన బురద కూపం నుంచి సమగ్ర జాతిని బయటికి లాగడానికి ఎక్కువ సమయం పట్టలేదు. (రవీంద్రనాథ్ : జీవితం, సాహిత్యం - సజనీకాంత్‌దాస్ పేజీ 27)."

ఈ అనుభవం ఆధారంగానే ఆయన బూర్జువా సమాజ వ్యవస్థ పట్ల తన మనోభావాలను నిర్ణయించుకున్నారు. అది ఈ రోజుకి అమోఘమైన ఆలోచనా పద్ధతే. ఇంకా చెప్పాలంటే, ఈ రోజు ఉన్న ఏకధృవ ప్రపంచంలో అది ఇంకా స్పష్టం అయింది. ఎందుకంటే, ప్రజాస్వామ్య పరిరక్షణ పేరుతో అమెరికా ఈరోజు వివిధ దేశాలలో సైనికంగా కలుగజేసుకుంటున్నది. రవీంద్రనాథ్ ఇలా రాశారు, "ప్రజాస్వామ్యమంటే ప్రజానీకంలో ఉండే పాలనాపరమైన ఆకాంక్ష మరియు శక్తి ద్వారా జాతీయ పాలనా శక్తిని వ్యక్తపరచడం. అమెరికా ఇలాంటి ప్రజాస్వామ్యాన్ని పొగుడుతూ వుంటుంది. కానీ ఎక్కడైతే పెట్టుబడి, శ్రామికులు మధ్య చాలా తేడా ఉంటుందో అక్కడ ప్రజాస్వామ్యం పదేపదే బాధితురాలు. ఎందుకంటే, అన్నిరకాల ప్రాపకాలకు మూలం ధనమే, అదే పెత్తనాల వాహనం (సమ బాయ్ (సహకార) నీతి, బక్సావాణి - 1921) రవీంద్రనాథ్ ప్రకారం, అదే మార్క్సిజం చెప్పేది కూడా, ఈ పరిస్థితి నుంచి బయటపడాలంటే "అవసరమైన స్వాతం త్ర్యాన్ని సాధారణ ప్రజల సంపదగా మార్చాలంటే దానికి మూల ఉపాయం ధనార్జనలో సాధారణ ప్రజల శక్తిని సమన్వయపరచటం" (అక్కడే)

తరువాతి అధ్యాయం ప్రపంచంలో ఫాసిజం అభ్యుత్థానం, సామ్రాజ్యవాద రాజ్యశక్తి ఇంకో బీభత్స రూపం, అది మనిషి ఎటువంటి స్వతంత్ర ఉనికిని ఒప్పుకోదు, దాన్ని కాలరాస్తుంది, భయోత్పాతం దాని మూల మంత్రం, అందరిని భయపెట్టే వాతావరణం నెలకొల్పడం దాని ఉద్దేశం. మొదటి ప్రపంచ యుద్ధం తరువాత మొట్టమొదట ఇటలీలో 1922లో ఫాసిజం ఆవిర్భవించింది. 1926 ముస్సోలిని భ్రమలో పడి ఇటలీ సందర్శించటానికి రవీంద్రనాథ్‌కి ఆహ్వానం అందింది. కొద్ది రోజులలోనే రోమారోలా సహాయంతో ఆయన ఆ భ్రమలోంచి బయటపడ్డాడు, ఫాసిస్టు పాలనను వ్యతిరేకిస్తు కొన్ని ప్రకటనలు జారీ చేశారు. 23 ఫిబ్రవరి, 1927న ప్యారిస్‌లో జరిగిన మొదటి ఫాసిజం వ్యతిరేక మహాసభ ప్రణాళికలో భారత్ తరపున రవీంద్రనాథ్ ఒక్కరే సంతకం చేసి థాండి బారబుస్‌కి జాబు రాశారు. 'గోల్డెన్ బుక్ ఆఫ్ పీస్' అనే రోలా, బారబుస్ సంపాదకత్వం వహించిన పుస్తకంకు తన సందేశం పంపిస్తూ రవీంద్రనాథ్ రాశారు. "అధిగమించటం అసాధ్యం అనిపించే శక్తివంతమైన విషమ పరిస్థితులు ఉన్నప్పటికీ నరభక్షక రాజకీయాల నరహంతక తాండవం నశించి తీరుతుందని ఈరోజు మనం మన సొంత నమ్మకాల బలంతో నిరూపిద్దాం."

రెండో ప్రపంచ యుద్ధం ముందే ఐరోపాలో ఫాసిస్టు శక్తులు ఒకటి తరువాత ఒకటి దేశాల్లో అధికారంలోకి వస్తున్నప్పుడే రవీంద్రనాథ్ హెచ్చరికలు జారీ చేశారు. కవిత, చిన్న కవితలు, చిత్రాలు, వ్యాసాలు, ఎన్నో ఉపన్యాసాల ద్వారా యుద్ధం, ఫాసిజానికి వ్యతిరేకంగా అలాగే నానా జాతి సమితి నిష్క్రియాపరత్వం గురించి ఆయన తన మనోభావాలు, వ్యధను వ్యక్తం చేశారు. ఇటలీ ద్వారా అబిసీనియాపై దాడిని పురస్కరించుకుని ఆయన 'ఆఫ్రికా' అనే కవిత రాశారు. దాన్ని ఆంగ్లంలో అనువదించి ఇంగ్లాండ్‌లో అమియ చక్రవర్తికి పంపించారు విదేశీ పాఠకుల కొరకు. అబిసీనియాలో యుద్ధం నడుస్తుండగానే ఫాసిస్టు శక్తులు మూకుమ్మడిగా స్పెయిన్‌పై దాడి చేశాయి (జూలై 1936 ఆ తరువాతే (జూలై 1937) జపాన్ చైనాపై దాడి చేసింది. దీనికి వ్యతిరేకంగా 'లీగ్ అగెనెస్ట్ ఫాసిజం అండ్ వార్' పేరున సంస్థ ఏర్పడింది. రవీంద్రనాథ్ దాని భారతీయ శాఖకు అధ్యక్షులు అయినారు. స్పెయిన్‌లో రచయితలు, కళాకారులు ప్రతిఘటనకు ఆయుధాలను చేబట్టారు. కవి కూడా వ్యతిరేకిస్తూ రెండు కవితలు (26 డిసెంబరు, 1937) రాసి నేరుగా ప్రతిఘటించే పోరాటానికి ఆహ్వానం పలికారు.

ఆ మధ్యనే ముస్సోలిని హిట్లర్ మధ్య ఒప్పందం కుదిరింది. చైనా, స్పెయిన్‌తో ఓటమి పొందింది. కవి తన పుట్టిన రోజునాడు 'జన్మదిన్' శీర్షికతో కవిత రాశారు. అది కాలింపాంగ్ (డార్జిలింగ్) నుండి కలకత్తా పాఠకుల కోసం టెలిఫోన్ ద్వారా ప్రసారం చేయబడింది.

'కాంగ్రెస్' అనే శీర్షికతో జాబులో ఆయన జాతీయ కాంగ్రెస్‌లో ఫాసిస్టు శక్తుల చొరబాటు గురించి దేశవాసులను హెచ్చరిస్తూ ఇలా రాశారు "లోలోపల కాంగ్రెస్‌లో ఈ శక్తి పూజకు వేదిక ఏర్పాటైపోయింది. గాంధీ మహాత్ముడుని ఆయన భక్తులు ముస్సోలిని, హిట్లర్‌తో పోల్చి ప్రపంచం ముందు అవమానించినప్పుడు మనకు దాని రుజువు లంభించలేదా?" ముస్సోలిని 1935 - 36లో కాంగ్రెస్ నాయకులు గాంధీజీ, పండిత్ మదన్‌మోహన్ మాలవీయ, జవహర్‌లాల్ నెహ్రూ, సుభాష్‌చంద్ర బోస్‌లకు ఇటలీ సందర్శించమని ఆహ్వానం పంపాడు. ఆ సమయంలో చాలామంది మేధావులు హిట్లర్ , ముస్సోలిని ఎదుగుదలతో ప్రభావితమై కలం పట్టారు. రవీంద్రనాథ్ మోహముక్తుడై ఫాసిజానికి వ్యతిరేకంగా తీవ్ర అసహ్యత వ్యక్తం చేస్తున్న తరుణంలో ఈ మేధావులు చరిత్రని కలుషితం చేసే పనిలో నిమగ్నమైనారు' 'ఆనంద్ బజార్ పత్రికా'లో ఈ కాలంలో (25 మార్చి, 1933) హిట్లర్ - ముస్సోలినీలను 'భాగ్యవిధాతలుగా' చిత్రీకరిస్తూ ఒక వ్యాసం ముద్రించబడింది.

మరోవైపు అమియ చక్రవర్తికి రాసిన ఒక జాబులో వ్యాసం నుండి మనకు రవీంద్రనాథ్‌కి ఫాసిజం గురించి ఎటువంటి భావన ఉండేదో, ఆయనలో ఎంత వ్యథ వుందో తెలుస్తుంది. అమియ చక్రవర్తికి రాసిన ఇంకొక జాబులో ఆయన ఫాసిస్టు నరపిశాచుల హింస గురించి రాశారు. (20. జూన్ 1940)

ఆ కాలంలోనే కవి ఫాసిస్టు నర రాక్షసుల రూపాన్ని ముందున పెట్టుకుని భయంకరమైన పెద్ద పూర్వకాల జీవాల, సర్పాల చిత్రాన్ని కూడా గీశాడు. ఆయన గీసిన ముస్సోలిని చిత్రం నేడు ప్రపంచ ప్రఖ్యాతమైనది.

జీవితం ఆఖరి దశలో రాసిన ఎన్నో చిన్న కవితలలో ఆయన ఫాసిస్టు వ్యతిరేక భావాన్ని సుస్పష్టంగా ప్రకటించాడు. హిట్లర్ చిన్న చిన్న మీసాల గురించి కూడా వ్యంగ్యంగా ఒక చిన్న కవిత రాశారు.

రవీంద్రనాథ్ సామ్రాజ్య వాద, ఫాసిస్టు రాజ్యశక్తిని చూసిన విధంగా ఏ భారతీయ కవి లేక రచయిత చూడలేదు. ఆయన "పూర్తిగా మూల్యం చెల్లించి అర్హత సంపాదిస్తే కాని మనకు ఈ శాంతి ఉండదు. ఆ మూల్యం ఏమంటే బలవంతులు అత్యాశకు పోకూడదు, బలహీనులు ధైర్యవంతులు కావడం నేర్చుకోవాలి (మోడర్న్ రివ్యూ అక్టోబరు 1939) అని రాశారు."

స్పెయిన్‌లో ఫాసిస్టు ఫ్రాంకో ఆధిపత్యాన్ని ధిక్కరిస్తూ కవి ఇలా రాశారు. : "స్పెయిన్ ప్రజల అత్యంత కష్టమైన పరీక్షా సమయంలో నేను మానవాళి వివేకాన్ని అభ్యర్థిస్తున్నాను. స్పెయిన్‌లో పీపుల్స్ ఫ్రంట్‌కు సహాయపడండి. ప్రజా ప్రభుత్వానికి మద్దతు ఇవ్వండి. మితవాదం సమసిపోవాలని లక్ష గొంతులతో అరవండి. ప్రజాస్వామ్యానికి మద్దతు ఇచ్చేందుకూ, నాగరికత, సంస్కృతిని నిలబెట్టడానికి లక్షల్లో కదలిరండి."

ప్రపంచ ఫాసిస్టు వ్యతిరేక ఆఖరి యుద్ధంలో సోవియట్ యూనియన్ గెలుస్తుందని రవీంద్రనాథ్‌కు అంతిమ ఘడియలలో కూడా నమ్మకం ఉండింది. సోవియట్ రాజ్య వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థ కంటే మెరుగైనదని "రాశియార్ చిఠి", ఇతర అనేక రచనలలో ఆయన చెప్పారు. కవి చనిపోయిన తర్వాత ప్రశాంత చంద్ర మహాలానొబిస్ తన వ్యాసంలో రవీంద్రనాథ్ ఆఖరి మాటలు "వాళ్ళే (సోవియట్ యూనియన్) రాక్షసుల్ని దారిలో పెడతారు" అని రాశారు.

జనశక్తిలో రవీంద్రనాథుని నమ్మకం వివిధ రూపాలలో కనబడుతుంది. ఇది వేరుగా చర్చించ తగ్గ విషయం. ప్రజల నుండి వేరుపడి సామాజిక కార్యాలలో సాఫల్యం చెందలేము. ఆయన ఇది అర్థం చేసుకోవడానికి ప్రయత్నించారు. "మనిషి కోరుకున్నప్పుడు ఆయనకు సేవ చేయాల్సి ఉంటుంది. తనను వినమ్ర పర్చుకోవలసి ఉంటుంది (సదుపాయ్)."

కవి నమ్మకం : "భారత దేశంలో విశ్వ మానవుడి సమస్య పరిష్కారం అవుతుంది. ఆ సమస్య ఏమిటంటే ప్రపంచంలో మనిషి రంగు, భాష, స్వభావం, ఆచరణ మరియు ధనపరంగా రకరకాలుగా ఉంటాడు. ఈ వైచిత్ర్యాన్ని కలిగే ఉంటుంది నర దేవత విరాట్ రూపం. ఈ వైచిత్ర్యాన్ని భారతదేశంలో మనం ఒక సూత్రంలో చూస్తాము (సమస్య)."

ఆయన టెర్రరిజం పట్ల తీవ్ర విమర్శకుడు. 'పథ్ ఓ పాథెయ్,' 'సమస్య,' 'సదుపాయ్', 'దేశహిత్' వంటి వ్యాసాలు మరియు - 'ఘరే బాయిరే' (ఇంటా బయట) 'చార్ అధ్యాయ్' వంటి నవలల్లో పోరాటంలో భయోత్పాతాన్ని వాడుకోవడం వంటి తప్పు తోవను ఆయన నిందించారు. ప్రజలని సమీకరించి ఓపికతో ముందుకు సాగమని సలహా ఇచ్చారు. మరోవైపు ఆయన రాజ్యశక్తి కరుకుతనాన్ని కూడా క్షమించలేదు.

జలియన్ వాలాబాగ్ పరిణామం తర్వాత ఆయన తన 'నైట్' ఉపాధిని బ్రిటిష్ వారికి వెనక్కి ఇచ్చేశాడు. ఈ పరిణామం బట్టి మనకు గాంధీజీ లేక ఇతర కాంగ్రెస్ నాయకుల లాగా అధికార శక్తిని క్షమించడం కాని దాని పట్ల మెతక వైఖరి తీసుకోవడం కాని రవీంద్రనాథ్‌కి సాధ్యం కాలేదని అర్థమవుతుంది. భూమి వ్యవస్థ సమూలంగా మార్చివేసే విషయంలో ఆయనలో గందరగోళం ఉన్నప్పటికీ జమీందారు పరాన్నజీవి, జలగలా పీల్చుకు తింటాడు. వీలైతే జమిందారీని వదిలేయడం మంచిది, ఇలాంటి భావాలు ఆయన పదే పదే వ్యక్తపరిచారు. ఆయన దృష్టిలో గ్రామ విద్య, గ్రామ సమాజాన్ని క్రొత్త పద్ధతిలో నిర్మించడమే భూసంస్కరణలకు ఆధారం. ఎందుకంటే విద్య వల్లే గ్రామ ప్రజలు తమను రక్షించుకోవటం, తమ అభివృద్ధికి పోరాడటం కోసం శక్తి పొందుతారు. ఈ అనుభవం ఆశ్చర్యకరంగా ఈరోజు కూడా ప్రాసంగికం.

1930 సంవత్సరంలో రవీంద్రనాథ్ సోవియట్ రష్యా సందర్శించినప్పుడు పెట్టుబడిదారీ వ్యవస్థ భయంకరమైన సంక్షోభంలో

# పర్యావరణం పరిరక్షించుకుందాం



- సువారపు రామచంద్రరావు

ప్రకృతి ప్రసాదించిన
పచ్చని క్షితిరుహాలను
పరిహరించి పట్నాలకు
అధికారుల కళ్లు కప్పి
కాసుల కోసం కొలపంగళ్లకు
తరలించేవాడెవడు?

కొండకోనల్లోంచి
వడివడిగా జడిజడిగా
పాయలై ప్రవహించే
నిర్మల నీటిఝురులను
మినరల్ వాటర్ తయారీ మిషతో
కలుషితం చేసేవాడెవడు?

అడవిలో అందంగా
అడుగులేస్తూ ఆనందం-
అందించే అసంఖ్యాక
మృగ సముదాయాన్ని
చల్లగాలులకు చక్కగా ఎగిరి
రెక్కల సవ్వడితో స్వేచ్ఛగా
గొంతులిప్పి గానమృతం
విన్పించే సుందర పక్షిజాలాన్ని
ప్రతిఘాతనం చేసే పాశికుడెవడు?

జనావాసాల మధ్య
కల్మష వ్యర్థపదార్థాలను
విస్తృత గతిన వెదజల్లుతూ
దుర్వాసనాజనిత
విషవాయువులతో
ప్రజాకోటి జీవితాన్ని
రోగపీడితం చేసేవాడెవడు?

చేటు చేసే చేపల చెర్వుల
నిర్మాణంతో కొల్లేటి సరస్సును
అక్రమ ఆక్రమణలకు గురిచేస్తూ
జలపక్షి జీవరాశులను
మటు మాయం చేసే
భూ బకాసురుడెవడు?

మత్స్యోత్పత్తి పేరిట
మంచినీటి చెర్వుల
మలినం చేస్తూ
అనారోగ్యం సృష్టించే
అత్యాశపరుడెవడు?

నగరాల నడిబొడ్డున నెలకొల్పే
పరిశ్రమల ఫలితంగా
విడుదలయ్యే విషవాయువులతో
మానవాళి ప్రాణాలతో
చెలగాటమాడేవాడెవడు?

భారీఎత్తు భవనాలను
ప్రక్క ప్రక్కన నిర్మిస్తూ
భూతల సాంద్రతా
సమతుల్యతా విచ్ఛిన్నతకు
దోహదపడే దోషి ఎవడు?

జనజీవి రక్షణకు
ఆరోగ్యభద్రతకు
పర్యావరణం శరణ్యమని
తెలిసి గూడా ప్రకృతిని వికృతి చేస్తూ
పర్యావరణ కాలుష్యం చేసేవాడెవడు?

వాడే! వాడే!
మదియంతా స్వార్థం నిండిన మానవుడు!
పెట్టుబడి, లాభం
కలబోసిన విఫణివేత్త!
శ్రమదోపిడి రుచిమరిగిన శాకుడు
తన హితం తన లాభం కాంక్షిస్తూ
పరహితం పరసుఖం కానని కఠినాత్ముడు!!
పర్యావరణం పాలిటి పగతుడు
మానవత పట్ల మమకారం లేని
పృథగ్జనుడు!!
సమిష్టి కృషితో ప్రతిఘటించి
పర్యావరణాన్ని పరిరక్షించుకుందాం!
ఆరోగ్య భద్రతను సాధించుకుందాం!!

---

నడుస్తున్నది. మాంద్యాన్ని అవకాశంగా తీసుకొని బ్రిటిష్ కర్మాగారాల యజమానులు కార్మికులు, రైతులపై పన్నుల భారం వేశారు. ప్రాథమిక విద్యని అభివృద్ధి చేసే నెపంతో రైతులూ, గ్రామీణ పేద ప్రజలపై పన్నులు వేయబోతున్నారని కవికి ఒక సమాచారం అందింది. ఈ సమాచారం ఆయనకు చాలా క్షోభ కలిగించింది. ఆయన 'రాషియార్ చిఠి'లో ఒక జాబులో దీన్ని తీవ్రంగా వ్యతిరేకించారు. శ్రీనికేతన్‌లో ఫిబ్రవరి 1934లో ఒక ఉపన్యాసంలో ఆయన ఇలా వివరించారు, "ఒక చోట కొంతమంది ఆహార ఉత్పత్తి చేసే ప్రయత్నంలో తన పూర్తి శక్తిని నిమగ్నం చేస్తారు, వేరే చోట కొంత మంది స్వతంత్రంగా ఉండి ఆ ఆహారంతో బ్రతుకుతారు. ఒకవైపు దైన్యం మనిషిని వైకల్యపరుస్తోంది, మరోవైపు ధనప్రాచుర్యం, అహంకారం..... ఒకవైపు అన్ని ఉన్నవి కాని మరోవైపు ఏమి లేదు. ఈ సమతుల్యం లేక పోవడం వల్లే నావ తిరగబడిపోతుంది.....

1937లో బెంగాల్‌లో ఫజలుల్ హక్ మంత్రివర్గ కాలంలో కార్మికుల మీద చాలా తీవ్రమైన పీడన ఆరంభమైంది. కార్మికులు సమ్మె చేశారు. ఆ సమ్మెని భగ్నం చేయటానికి హక్, నజ్‌ముద్దీన ప్రభుత్వం లాఠీలు, తూటాలు ప్రయోగించింది. దానితోపాటు సమ్మె భగ్నం చేయటానికి మతతత్వాన్ని ప్రేరేపించటం జరిగింది. ఈ సమ్మె పక్షం వహించమని దేశవాసులకు పిలుపునిస్తూ కవి ఇలా రాశారు, "గత ఫిబ్రవరి నెల నుండి సమ్మె చేస్తున్న లక్షల జనపనార కార్మికుల వెతల గురించి తెలిసి నాకు చాలా బాధ కలిగింది. దీనివల్ల కార్మికులనే కాక వారి మహిళలు, పిల్లలను కూడా చాలా కష్టాలు ఆవరించాయి. వేతన పెరుగుదల, ఇంకా మెరుగైన పని పరిస్థితుల డిమాండ్లు న్యాయమైనవి, సహేతుకమైనవి... మానవత్వం నిర్దేశించేదేమంటే ఎవరైతే సమాజం బరువుని మోస్తారో వారి మంచి చెడ్డలు, రక్షణ సమాజం కూడా చూసుకోవాలి. సరైన ఆలోచన కలిగిఉన్న ప్రతి మనిషి కూడా మతతత్వ పరమైన ఆలోచనలు రెచ్చకొట్టి సమ్మెకు మతతత్వపరమైన మలుపు ఇవ్వటాన్ని ఖండించి తీరాలి. దేశవాసులను నేను అభ్యర్థిస్తున్నది ఏమిటంటే ఈ కష్టకాలంలో జనపనార కార్మికులు, వారి అసహాయ మహిళలు, పిల్లలకు మద్దతు ఇవ్వాలి." ఈ విషయంలో పాఠకులకు 'ఛొడార్ ఛవి' కావ్య గ్రంథంలో 'మాధో' కవిత గుర్తుకు వస్తుంది, అందులో మాధో జనపనార కార్మికుడు.

ఈ వర్గపోరాటం 'రక్త కరబి (ఎర్ర గన్నేరు పువ్వు)' నాటకంలో కూడా ఇంతకుముందు మనం చూస్తాం. ఇది నేటికి ప్రాసంగికం.

ఈ యుగం తాలుక అన్నిటికంటే 'బడీ ఖబర్ (పెద్ద కబురు)' వర్గ పోరాటం. వర్గ పోరాటంలో కష్టజీవులు ఒక అనివార్యమైన అంశం. భవిష్యత్తులో ఈ కష్టజీవులే కేంద్రబిందువుగా ఉంటారు, ఇది రవీంద్రనాథ్ తన 'గ్రంథ సభ' అనే పుస్తకంలో స్పష్టం చేశారు.

**(మే 7 రవీంద్రుని జయంతి)**

- బెంగాలీ నుంచి అనువాదం : **వేదుల రామకృష్ణ**

# ఆదర్శ రైతన్న!

- దామెర్ల సైదులు



మేఘాలు - వర్షించి
తొలుకరి జల్లులు కురిస్తే
పులకరించిన రైతు
జోడెద్దులు జతకట్టి
మేడిపట్టి దుక్కి దున్ని
విత్తనాలు నేల జల్లి
భూతల్లిని నమ్మి
చిరు ఆశల స్వప్నంలో
తేలియాడతాడు
త్యాగాల రైతన్న!
గొప్ప చరిత నీదన్నా!

రేయనక - పగలనక
బ్రతుకును - సమిధగ చేసి
చుక్కల సెమటను తీసి
పంటల రాశులు పోసే
నిస్వార్ధపు శ్రమజీవి
దగాచేసె దళారీలు
సిరులను దోస్తుంటే
మేధావుల విజ్ఞానం
అజ్ఞానంగ మూగబోయే!

నీ సేద్యం అప్పులతో
రైతన్న ఘోష
బ్రతుకు తమాషా!
వినియోగపు ధరలుచూడ
నింగిలోన తారలయ్యె
గమ్యం చేరే నీ నావ
తరంగాల సంద్రంలో
కన్నీటి - వ్యధతో
చేవలేక - చావలేక
వాడిపోయే మొగ్గలయ్యి
కాలి బూడిదవుతుంటే
పార్వర్డ్ ట్రేడింగ్
స్టాక్ నిల్వతో -
సరుకులు ఎక్కడైనా పెట్టుబడి
ఎప్పుడైనా - ఎవరైనా పెట్టొచ్చు
స్వేచ్ఛగ దళారీలు
గుత్త పెట్టుబడులు
షేర్ మార్కెట్‌లో - ఉత్పత్తి
సరుకులేని డబ్బుమయం
కార్పొరేట్ - విధానాలే
ప్రపంచీకరణ ముసుగు
మార్కెట్ మాయజాలం
నీ వ్యవసాయపు సంక్షోభం
ఆదర్శ రైతన్నా!
హక్కులడుగ కదలాలి
అవస్థల వ్యవస్థను మార్చాలి

# మనసు (గజల్)

- వల్లభాపురం జనార్దన



మెదడు శిల్పికరాలు మలచిన అద్భుతానివి నీవు మనసా
మృదుల మోద విషాద పరుషములలదు చుందువు నీవు మనసా

బతుకు నందన వనమునందున కలుపు మొక్కలు పెరుగుచున్నవి
అతికి విడువవు చెరుకు తీపిని చంపునోళ్ళకు నెలవు మనసా

బాట ఊబులు నోళ్ళు తెరచీమింగు చున్నవి పొంగుచున్నవి
ఆటుపోటుల కరుకు లాఠీ తాండవించుట కిరవు మనసా

మందు పాతరలైన వెతలూ విస్ఫులింగములురుము చున్నవి
అందములు ఆనందములు నాకందుబాటుకు రావు మనసా

దోపిడీ విష సర్పనగరము బంధిఖానల వలయమైనది
రేపటికి నా ఊపిరిని తాకట్టు బెట్టకపోవు మనసా

మనిషి మనిషికి నడుమ గోడలు పాడెలై ఆటాడుచున్నవి
మునుపు నేడూ భావిలో పీడించునని మరచేవు మనసా

జీవితము ఒక పద్మవ్యూహము చీల్చకదలు జనార్దనా
మావి చివురులు మేయు కోయిల పాటలే వింటావు మనసా.

# ఎడతెగని ఘర్షణ

- డా॥ కె.నాగేశ్వరాచారి



మనసు మొక్కకు చిగిర్చిన ప్రేమ పుష్పం
ఎంతకాలం నిలుస్తుంది
డార్విన్ చెప్పకపోయినా జరిగే పరిణామమేకదా
మొక్కకు దూరమైన పుష్పానికి మొక్కపై
ప్రేమ ఉన్నట్టా లేనట్టా
ఏదీ కలిసుండక పోవడమూ
విడిపోవడం
మరొక దానితో కలవడమే మార్పంటే
ఔను విడిపోవడం ఘర్షణ కాదు
కలిసిపోవడం ఐకమత్యం కాదు
మరైతే ఈ పయనం ఎక్కడికి
గమ్యం అనంతదూరంలో మిగిలే ఘర్షణే
నిత్యం తప్పని ఘర్షణకు ప్రేమ ఉండదు ద్వేషం ఉండదు
ఘర్షణ కోసం ఒక పక్క నిలబడ్డ వారి మధ్య ప్రేమ.....

# ఆధునిక ఇటలీ కవులు

## - సౌభాగ్య



# ఉంబెర్టో సాబా

ఉంబెర్టో సాబా ఇటలీలోని టియస్టేలో జన్మించాడు. తల్లి యూదు మతస్థురాలు. తండ్రి క్రిస్టియన్. ఉంబెర్టోకి రెండేళ్ల వయసున్నప్పుడు తల్లినీ, బిడ్డనీ వాళ్ల దారంటే వాళ్లను వొదిలేసి తండ్రి వెళ్లిపోయాడు.

ఉంబెర్టో చదువుకుంటున్న రోజుల్లోనే రచయిత కావాలని కలలు కన్నాడు. 1902 మొదలు అవిశ్రాంతంగా ఇటలీ అంతా పర్యటించాడు. ఒక టైలరింగ్ చేసే స్త్రీతో పరిచయం కలిగింది. పరిచయం పరిణయంగా పరిణమించింది. మొదటి ప్రపంచ యుద్ధంలో వైమానికదళంలో పర్యవేక్షకుడిగా పనిచేశాడు. యుద్ధానంతరం ప్రాచీన గ్రంథాలు అమ్మే పుస్తకాల షాపు పెట్టాడు. మానసిక, తదితర కారణాల వల్ల తీవ్రమయిన ఒత్తిడికి లోనయ్యాడు. 1929లో ఆరోగ్య పరీక్ష నిమిత్తం మానసిక వైద్యశాలలో చేరి చికిత్స పొందాడు. ఆ అనుభవంతో ఫ్రాయిడ్ మనోవిశ్లేషణ సిద్ధాంతంతో ఆకర్షింపబడ్డాడు.

రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభం కాకముందే ఫాసిస్టుల నిర్బంధం వల్ల పుస్తకాల షాపు మూసేయాల్సి వచ్చింది. తన కవితలు నిర్లక్ష్యానికి గురికావడం వల్ల తన కవితలకు తానే వివరణలు, విశ్లేషణలు రాసుకున్నాడు. ఆయన జీవిత కాలంలో ఆయన గురించి ఇటలీలో మినహాయిస్తే ఇతర ప్రపంచంలో దాదాపు తెలియదనే అనుకోవాలి.

"కలెక్టర్ పోయమ్స్' ఆయన ప్రసిద్ధ కవితా సంపుటి. మిలటరీ వర్సెస్' అన్న కవితలో ఆయన యుద్ధానుభవాల్ని వివరించాడు.

"నా సొంత కళ్ళతో ఈ రోజు భూమిని చూశాను
నాకు తెలిసి ఇప్పటివరకూ ఏ కళాకారుడూ
ఇట్లా చూసి వుండడు.
ఎందుకంటే జంతు సహజాత గుణంతో
నేను చూశాను
దృఢంగా దద్దరిల్లిన ఆ విస్ఫోటనం
నా బాధకు సోదరుడిలా వుంది.
ఆ బాంబు శబ్దం విన్నంతనే
నేను చిరునవ్వు నవ్వాను.
ఎందుకంటే దాని తరువాత వచ్చే దుఃఖం
ఎంతో భయంకరమైంది కదా"!




అంటూ చివరి పాదాల్లో తన యూదు మతస్థుల కష్టాలు వివరించాడు.

'సెమిటిక్ ముఖ కవళికలున్న మేక వదనంలో
కూలుతున్న జీవితాలు
విశ్రాంతి లేని విలాపాలు
పాపాల రోదనలు విన్నాను' అన్నాడు.

పై కవితలాగే 'టు మై వైఫ్' అన్న కవిత కూడా గొప్పది. భార్యలో స్త్రీని, ప్రపంచ వ్యాప్తమైన స్త్రీ జనాన్ని చూస్తూ చివర్న అందరూ, ఈ స్త్రీలందరూ, శాంతిని ప్రేమించే ఈ జంతువులందరూ దయగల దైవానికి దగ్గరివాళ్ళు కదా! అంటాడు.

ఆయన మొదటి కవితా సంకలనం 'ట్రియస్టే అండ్ లేడీ'లో ఆయన భార్య అడుగడుగునా కనిపిస్తుంది. ఆయన కవితల్లో ఒంటరితనం, ఒంటరి తల్లి, అనాథ బాలుని ఆర్తనాదం అంతర్లీన గానంలా సాగుతాయి. పసితనపు అనుభూతులు, అనుభవాలు తల్లి పట్ల అనురాగం ఎన్నో కవితల్లో కనిపిస్తాయి.

'సానెట్ ఆఫ్ పారడైజ్' అన్న కవితలో 'అక్కడ జీవితంలోని మాధుర్యమంతా వుంది' అని బాల్యం గురించి చెబుతాడు. తెల్లగా వున్న చిన్ని ముచ్చటయిన ఇంట్లో తనకు నాలుగేళ్ల వయసు వచ్చేదాకా నివసించడం, తల్లి పనికి వెళ్లినప్పుడు ఆయా తన ఆలనా పాలనా చూడ్డం... మొదలయినవి వివరిస్తూ 'జీవితం నుండీ వీడ్కోలు తీసుకుంటూ చివర్న చీకటిలోకి నిష్క్రమించడాన్ని' మాతృగర్భంలోకి మరలిపోవడం'గా అభివర్ణించడం మనల్ని మంత్రముగ్ధుల్ని చేస్తుంది. ఆశ అన్న కవితలో తీరని కోరికల తీవ్ర వేదన ప్రదర్శిస్తాడు.

'నానుండీ నేను నిష్క్రమించడానికీ
సమస్త జీవితాల్నీ సమాశ్వాసించడానికీ
మానవులందరూ మనుగడ సాగించడానికీ
నా మనసు అల్లాడుతుంది' అంటూ 1928లో రాసిన 'మనిషి' అన్న దీర్ఘ కవితలో తన అస్తిత్వాన్ని సమస్త మానవాళి అస్తిత్వంగా పరివర్తింపజేసే ప్రయత్నం కనిపిస్తుంది.

ఆయన కవితల్లో ప్రపంచం నుంచి పారిపోవాలన్న తపన, ప్రపంచానికి దూరంగా, అజ్ఞాతంగా జీవించాలన్న ఆరాటం కనిపిస్తాయి. అయినా చివరికి 'మానవ హృదయాలకు తన కవిత దర్పణం కావాలని కోరుకుంటాడు. స్వచ్ఛంగా, సరళంగా, నమ్రతగా వుండమని తన ఉద్దేశాల్ని ఉద్బోధిస్తాడు. ప్రాచీన విలువల్లోని నిర్మలత్వానికి, నిలకడకు ఆకర్షింపబడతాడు. మళ్లీ తనను ఈ ప్రపంచానికి ఎక్కడి నుండో

# ఉదయాలు



- కోసూరి రవికుమార్

ఆకలిగా ఒక లేగదూడ అరుస్తున్నట్టు
లేరెక్కల పిట్ట పిల్లల నోళ్ళలోకి
తల్లి చిన్న చిన్న పురుగులేస్తున్నట్టు,
సద్దెన్నపు మూట నుంచి
చల్లబొట్లు బొట్లుగా కార్తున్నట్టు
నెమరేస్తున్న ఎద్దు మెడమీదికి
కంచు గంటల పట్టెడ చేరినట్టు
వారం కిందట గింజ నాటిన దగ్గర
మొల్చిందేమోనని బుడ్డోడు
గొంతుక్కూర్చుని చూస్తున్నట్టు
ఎంకట్లచ్చిమి కచ్చికేసి
పొళ్ళు కిచకిచా తోంకున్నట్టు
పాల చెంబు మీది నురగలో
ఇంద్రుడు బాణం పారేసుకున్నట్టు,

కొన్ని ఉదయాలు సజీవంగా
ఎఫ్ఫెమ్మ సుప్రభాతంతో,
దుప్పటి కర్టెన్ తొలిగి
బతుకు నాటకం మొదలైనట్టు
బూటు పంజరాల్లో
పాదాలను పెట్టి తలుపేసినట్టు
గుమ్మం దగ్గర అతుక్కున్న
కళ్ళు మెదళ్ళలోకీ,
నోళ్ళు జీర్ణాశయాల్లోకీ,
పేపరూ కాఫీ లైనట్టు,

మనీ ప్లాంటు మొదట్లోకి
ఫ్రీజర్లోంచి ఐసుముక్క విసిరినట్టు,
ఊపిరందని గదిలో
సెల్ సిగ్నలందిందని
చంకలు గుద్దుకుంటున్నట్టు
నైట్ టాక్‌తో పాచిపట్టిన నోటినీ చెవుల్ని
మౌత్ వాషూ, బాడీకేర్ లోషన్లతో
అలంకరించుకున్నట్టు
జంక్ ఫుడ్ జాతర చేసినట్టు
పని పంపు దగ్గర నిలబడి
పగలుకు సరిపడా టాంక్ ఫుల్ చేసుకున్నట్టు
కొన్ని ఉదయాలు నిర్జీవంగా
ఇంతకీ
మనం సజీవులమా? నిర్జీవులమా?

---




వచ్చిన పర్యాటకుణ్ణి అంటాడు. చివరి కవితల్లో వెనక్కి తిరిగి చూసుకోవడం, తాత్విక చింతన కనిపిస్తాయి
రాశాను! బాధలో, వేదనలో రాశాను!
పక్షుల కోసం, పరిమళాల కోసం,
స్నేహం కోసం
దుఃఖం చుట్టుముట్టిన కాలంలో
విషాదం కమ్మిన
నా ఇటలీ గురించి రాశాను'
అని రెండవ ప్రపంచ యుద్ధ కాలం నాటి ఇటలీ పరిస్థితి వివరిస్తాడు. ఈ చివరి కవితల్లో దిగులు నిండిన నిరాశ కనిపిస్తుంది. ఈ అసాధారణమైన ఇటలీ కవి భావుకుల గుండెల్లో గొప్ప భారాన్ని వదుల్తాడు.

## నా భార్యకు

నువ్వు మీగడలాంటి చిన్ని కోడిపెట్టవు
నా తెల్లకోడి పెట్టవు
ఆ కోడి వొంగి నీళ్ళు తాగేటప్పుడు, గింజలు తినేటప్పుడు
గాలి దాని ఈకల్లోకి దూరి గలభా చేస్తుంది
కానీ గడ్డి మైదానాన్ని అది కొలుస్తూ రాణిలా గంభీరంగా సాగుతుంది.
విచ్చుకున్న పువ్వులా విలాసంగా కదుల్తుంది
ఆమె అందరూ స్త్రీలలాంటిదే
ప్రశాంతం నిండిన జంతువుల్లాంటిదే
వాటిలాగే దేవుడికి సన్నిహితమైంది
నా అంచనాల్లో తప్పు లేకుంటే
ఆ లక్షణాలు ఇతర స్త్రీలలోనూ ఉన్నాయి
సాయంత్రం నెమ్మది నింపుకున్న కోడిపెట్టల్లా
నీ స్వరంలో, నీ అరుపుల్లో నిర్మలత్వం తొణికిసలాడుతుంది
నువ్వు కడుపుతో వున్న చిన్న దూడలా వుంటావు
భయపడి అరిచే కోడిపెట్టను
భయం పోగొట్టడానికి గింజలు చల్లి పిలిచినట్లు
నిన్ను నేను బహుమతుల్తో బుజ్జగిస్తాను
నువ్వు ఆశ్చర్యపడి చూసే అందమైన ఆడకుక్కవు
నువ్వు సుకుమారంగా, సుందరంగా కనిపించినా నీ మనసు దృఢమైంది
జయించలేని బలమైన మత విశ్వాసం నిండిన సన్యాసిని లాంటి దానివి
నీపై నువ్వొక గొప్ప అధికారం కలదానివి
విశ్వాసం నిండిన కుక్క నీ వెంట వుంటే
ప్రపంచం నిన్ను సమీపించలేదు
నువ్వు తన చిన్నపెట్టెలో పరవశంగా కదిలే చిన్న కుందేలువు
నువ్వు దూరతీరాల నించే వలసవచ్చిన పిట్టవు
నీ కాంతి మార్గాలు నీకున్నాయి
మీద పడుతున్న వయసుతో నేను భయపడినప్పుడు
ఒక వసంతాన్ని నాకు అందించి ఆనందింపజేస్తావు
నువ్వు పొదుపు తెలిసిన చీమవి
పిల్లల్ని వెంట తిప్పే తేనెటీగవి

## గజ ఈతగాడు

నిన్ను సముద్రంలో వుండగా ఎవరు చూసినా
నిన్ను ఉరుము అంటారు
నా అసహనమనే తెరముందు
నా అసహన జీవనమనే తెరముందు
నువ్వు కనిపించావు, కనుమరుగయ్యావు




పరుగు పందెంలో ప్రథముడుగా వచ్చావు
గుంపులుగా కలకలంతో నిండిన మిత్రుల మధ్య
చిరునవ్వు నవ్వుతూనే
నువ్వు పాదరసంలా జారిపోతావు
సంచలించే నీ గుణంలో సాగే లక్షణముంది
ఒకరోజు ఒక విషాదపు నీడ
క్షణకాలం మెరిసి మాయమైంది
నీ స్వరంలో ఒక మాతృత్వపు
ఛాయ కదిలింది
నీ ఉదయం నా సాయంత్రాన్ని
పెళ్ళి చేసుకుంది.

కథ

# కనువిప్పు

- మౌని



**మట్టిని పిసికే చేతులు మల్లన్నవి. మట్టిని వెన్నముద్దగా మైనం ముద్దగా చేసి, నేల తల్లిని బొమ్మలుగా, మట్టి పాత్రలుగా అపురూపంగా మలిచేవాడు. కర్రతో కుమ్మరి చక్రం తిప్పుతూ... మట్టిని కుండలుగా మలిచే తీరు చూస్తుంటే ఒక అద్భుత శ్రామిక శక్తి అతనిలో భాసించేది.**

మల్లన్న మట్టి పాత్రల్ని, బొమ్మల్ని మానవ మనుగడకు ఆధారంగా తయారుచేసి, అందరికీ అందించేవాడు. వాళ్ల అవసరాలను తీర్చేవాడు. వాళ్లిచ్చిన తృణమో ఫణమో ఆనందంగా తీసుకునేవాడు. చదువురాని మల్లన్నకు సంస్కారమే సంపద. గంతకు తగిన బొంతలా భార్య రాములమ్మ మల్లన్నకు మంచిజోడు... మాయా మర్మం ఎరుగని జంట. పల్లె గుండెల్లో రాములమ్మకు, మల్లన్నకు గుప్పెడంత గూడు దొరికింది. ఆ గూటిలో చిలకా గోరువంకల్లా ఒద్దికగా వొదిగిపోయి ముద్దుముద్దుగా జీవితాన్ని అనుభవిస్తున్నారు. అయితే పెళ్లయి పదేళ్లు దాటిపోతున్నా బిడ్డలు లేరన్న బాధ భార్యభర్తల్ని కుంగదీస్తూనే వుంది... బిడ్డల కోసం వాళ్లు పడ్డ తపన వారికి నిద్రాహారాలు లేకుండా చేసింది.

'ప్రాప్తమున్న చోట ఫలమేల తప్పురా' అని వేమన చెప్పినట్లుగా ఇంతకాలానికి వారికి ప్రాప్తం కలిగినట్లు రాములమ్మ గర్భవతి అయ్యిది. మల్లన్న సంతోషం చెప్పనలివి కాకుంది. ఊరూ, వాడంతా చెప్పుకుని మురిసిపోయారిద్దరు. తొమ్మిది నెలలు గడిచిపోయాయి. ఆ రోజు రానే వచ్చింది. రాములమ్మ కడుపు పంట పడింది. కొడుక్కి జన్మనిచ్చింది. ఆ తర్వాత... వారికి ఆ బిడ్డే లోకం అయిపోయాడు. వాడి కోసమే బతకడం నేర్చుకున్నారు. ఇంతకాలం తాము ఏ ఆశయం లేకుండా బతికింది ఒకతైతే, ఇప్పుడు బిడ్డ భవిష్యత్ కోసమే బతకాల్సిన ఆశయం మరొకటుందని తమలో తామే తలపోసుకుంటున్నారు. ఏమైతేనేమీ, పల్లెల్లో వున్న పెద్ద రైతుల పిల్లల్తోబాటు, తమ కొడుకుని కూడా టవున్ పంపించి చదివించాలనే నిర్ణయానికొచ్చేశారు...

కాలం గడుస్తోంది సంవత్సరాలు దొర్లిపోతున్నాయి. కొడుకుని కాన్వెంట్ స్కూల్లో చేర్చే వయస్సు వచ్చేసింది... తాము దాచుకున్న డబ్బుల్ని కట్టేసి కొడుకుని స్కూల్లో చేర్పించారు. రోజూ కాన్వెంట్ స్కూలు వ్యాన్‌లోనే అటుపది, ఇటు పది కిలోమీటర్లు వెళ్లి వస్తున్నాడు. కొత్తలో మల్లన్న, రాములమ్మలు చాలా ఆనందపడిపోయారు. రాములమ్మకు కొడుకుమీదే ధ్యాస, తెల్లారిలేచినప్పటి నుంచి కొడుకును స్కూలు వ్యాను ఎక్కించేటంతవరకు వేరే పనులేమీ చేసేదిగాదు. పిల్లాడికి క్యారియర్ కట్టి, పుస్తకాలు బ్యాగుల్ సర్ది... తనే ఆ బ్యాగును మోసుకెళ్లి కొడుకును వ్యాన్ ఎక్కించేది... తిరిగి కొడుకు ఇంటికి వచ్చేవరకు ఎదురుచూపుల్తో కాలం గడిపేసేది. మల్లన్నకు కుండలు చేసే

పనిలో కూడా సహకరించడం బాగా తగ్గించేసింది. కొడుకు పుట్టాక రాములమ్మకు మొగుడి మీద ప్రేమ తగ్గిందని మల్లన్న భార్యను ఆటపట్టించేవాడు. నిజానికి రాములమ్మ కొడుకు కోసం అంతగా ఆరాటపడుతుంటే, మల్లన్న అంతకంటే ఎక్కువగా లోలోన ఆ ఆనందాన్ని అనుభవించేవాడు. నిన్నగాక మొన్న కొడుకు పుట్టినట్లుగా వుంది. అప్పుడే వాడికి పదేళ్లు నిండాయి. ఇప్పుడు వాణ్ని మంచి ఇంగ్లీషు మీడియం స్కూల్లో చేర్పించాలి, ఫీజులు వేలల్లో వున్నా ఫరవాలేదనుకున్నాడు మల్లన్న.. అంతే ఇంక వెనకాముందు చూడకుండా మొదటిసారిగా ఊరి పిన పెద్ద దగ్గర అప్పు చేశాడు. అనుకున్నట్లుగానే కొడుకుని పట్నంలో మంచి స్కూల్లో చేర్పించాడు.

అప్పటి నుంచి తమ ఖర్చులకు బాగా తగ్గించేసుకున్నారు. కుల వృత్తిమీద వస్తున్న ఆదాయం చాలదని తెలిసిపోయింది. అందుకే మల్లన్న, రాములమ్మలు తమ వృత్తి పనులు చేసుకుంటూనే పొలం పనులు చేయడం నేర్చుకున్నారు. కాయకష్టం చేశారు. ఒళ్లు హూనం చేసుకున్నారు. వాళ్ల ధ్యేయం ఒక్కటే "మా కొడుకు మట్టి పిసికి, బొమ్మలు, కుండలు చేసుకుంటూ బతుక్కూడదు. అందరి పిల్లల్లాగా ఏదో ఒక ఉద్యోగం చేసుకుని దర్జాగా బతకాల. మంచి పిల్లను పెళ్లి చేసుకుని నిండు నూరేళ్ళు బతకాలి మాకు తినడానికి ఇంత పెట్టి, వాడి పంచన పడుకోనిస్తే చాలు.. మాకు శక్తి వున్నంత వరకు మా పని మేం చేసుకుంటూ ఇలాగే బతికేస్తాం" అని నిర్ణయించుకున్నారు.



అందుకే.. పాపం.. కొడుకు మీది ప్రేమతో తలకు మించిన బరువెత్తుకున్నారు. నడుములు వంగిపోతున్నా లెక్క చేయలేదు. అప్పుడప్పుడు అనారోగ్యం బాధపెడ్తున్నా... బిడ్డమీది ప్రేమ ముందు ... వాళ్ల ధ్యేయం ముందు ఈ కష్టాలన్నీ ఒక లెక్కా? అనుకున్నారు. అంతే, ఇక వెనుకకు తిరిగి చూసుకోలేదు... వాడి చదువు పూర్తయింది. పట్నంలో బ్యాంకు ఉద్యోగం కొడుకుని వెతుక్కుంటూ రానే వచ్చింది. మల్లన్న, రాములమ్మలు పడ్డ కష్టానికి ఫలితం దక్కింది. వెంటనే కొడుకు బ్యాంకు ఉద్యోగంలో చేరిపోయాడు. కాలం కలిసొచ్చింది. పట్నంలోనే కొడుకు పెళ్ళి సంబంధం కుదిరిందని తెలిసింది.

అబ్బాయి పని చేస్తున్న బ్యాంకు మేనేజరు తమ్ముని కూతురు, బాగా చదువుకున్న అమ్మాయేనట, అనే విషయం మాత్రమే ఇతరులెవరో చెబితే తెలుసుకున్నారు మల్లన్న, రాములమ్మలు. పైకి బాధపడినా లోన మాత్రం... కొడుక్కి మంచి సంబంధం కుదిరినందుకు ఆనందించారు... పెళ్లయితే మాత్రం తమ కొడుకు తమ వాడు కాకుండా పోడు గదా... అనే నమ్మకంతో – కానీ, బ్యాంకు మేనేజరు, అబ్బాయి డ్యూటీలో చేరిన రోజే, అతని బయోడేటా పరిశీలించి తన రొట్టె విరిగి నేతిలో పడినట్లుగా ఒక నిర్ణయానికొచ్చేశాడు. తన ప్లాను ప్రకారం పావుల్ని కదిపాడు. అబ్బాయికి ప్రత్యేక గౌరవం ఇస్తూ,, అప్పుడప్పుడూ తమ ఇంటికి ఆహ్వానిస్తూ.. పరిచయాలను అనువుగా తనవైపుకు తిప్పుకున్నాడు. తన తమ్ముడి కుమార్తెతో పెళ్లి సంబంధం ఖరారు చేశాడు. కనీసం అబ్బాయి తల్లిదండ్రుల్ని సంప్రదించకుండానే. అయినా అబ్బాయి కూడా తాను బ్యాంకు ఉద్యోగంలో పైకి రావాలంటే భవిష్యత్తులో ఇలాంటివారి బంధుత్వం తప్పనిసరి" అని తన మనసుకి తనే సర్దిచెప్పుకున్నాడు... గంగిరెద్దులా బ్యాంకు మేనేజర్ మాటకు తల ఊపేశాడు తల్లిదండ్రుల్ని సంప్రదించకుండానే.

ఈ లోకంలో చదువుకున్న కొడుకు ఏమి చెప్పినా.. చదువులేని తల్లిదండ్రులకు అదే వేదం. గుడ్డిగా నమ్మడమే వారికి మానవత్వానికి నిదర్శనం – కొడుకు మాటలకు గంగిరెద్దులా వీళ్లు తలలూపారు. వారం రోజుల్లోనే పెళ్లి జరిగిపోయింది. వారికి ఒక కొరత మాత్రం మిగిలిపోయింది. పెళ్ళి అర్జెంటుగా పట్నంలో పెట్టుకోవడం వల్ల తమ బంధువుల్ని, ఊళ్ళో వాళ్ళని కూడా పిలవలేకపోయారు. అదీగాక పట్నంలో పెళ్లంటే... దూరాభారం ఖర్చులు తడిసి మోపడవుతాయని భయపడ్డారు. ఎలాగైతేనేమి, కొడుకు కోడల్ని వెంటబెట్టుకుని ఆ రోజే తమ పల్లెకు తిరుగు ప్రయాణం అయి వచ్చేశారు.

కొడుకు, కోడలు మాత్రం పట్టుమని ఒక్కరోజు మాత్రమే ఆ పల్లెటూళ్ళో ఉండినారు. ఆ పల్లెలో చిన్న ఇంట్లో కొత్త కోడలు వుండలేకపోయింది. కృత్రిమ సౌకర్యాలకు మరిగిన కోడలు స్వచ్ఛమైన పల్లె వాతావరణం, పల్లె జనుల మధ్య ఇమడలేకపోయింది.

మొగుణ్ని కొంగుకు కట్టేసుకుని పట్నానికి ఎగిరి వచ్చేసింది. కొడుకు కోడల్ని కూర్చోబెట్టి... పెళ్లింటిలో పల్లెలోని పదిమందికి పప్పునం పెట్టాలన్న.. మల్లన్న, రాములమ్మల ఆశ... అడియాశయింది. భార్యాభర్తల ముఖంలో కత్తివేటుకు నెత్తురు చుక్క రాలనట్లు పాలిపోయిన శవాల్లా నిలబడిపోయారు. ఆ తర్వాత కొడుకుతోబాటు కోడలు ఆ ఊరికి వచ్చినట్లు దాఖలాలు లేవు. ఎప్పుడో ఏడాదికోసారి కొడుకు వచ్చినా... వాడు తల్లిదండ్రులతో ఏదో పొంతన లేని మాటలు మాట్లాడేవాడు... చెప్పుల్లేకుండా అగ్గిమీద నడుస్తున్నట్లు... ఉరుకులు పరుగుల మీద పట్నం వెళ్లిపోయేవాడు.

మల్లన్న, రాములమ్మలు.. కొడుకు పనికిమాలిన వాడని తెలుసుకున్నారు. వాడిమీద ఆశల్ని ఒక్కొక్కటి తుంచుకుంటూ వస్తున్నారు. అయినా ఇది కన్నకడుపు.. ఒక్కోసారి ఎన్ని అవమానాల్ని భరించైనా పేగు బంధాన్ని కాపాడుకోవాలనుకుంటుంది... కొడుకూ, కోడలు మారకపోతారా... అన్న చిన్న ఆశను తమ గుండెల్లో ఆరకుండా కాపాడుకుంటున్నారు. అందుకే ఆ వెర్రిబాగుల అమ్మా నాన్నలు అడపాదడపా, ఊరిలోని పోస్టాఫీస్ నుంచి కొడుకుతో ఫోన్లో మాట్లాడడం, చదువుకున్న వాళ్ళను ప్రాధేయపడి ఉత్తరాలు రాయించడం, కొడుకు కోడల్ని, ఊరికి రమ్మని బ్రతిమాలడం.. ఇప్పటికీ జరుగుతున్న తంతే.

వాడు రేపో, మాపో వస్తాననడం తప్పితే.. వచ్చింది లేదు మల్లన్నను, రాములమ్మను పట్నానికి తీసుకెళ్లింది లేదు. ఒక్క కొడుకు కొడుకు గాదు.. ఒక కన్ను కన్నుగాదు" అనే సామెత ఇలాంటి కొడుకు వల్ల వచ్చిందేమో! కొడుకు, కోడలు మాత్రం వీళ్లను పూర్తిగా మరిచిపోయారు. మనమరాలు పుట్టిన విషయం సంవత్సరం తర్వాత ఎవరో చెప్తే గానీ వీళ్లకు తెలియలేదు. అయినా మనసు చంపుకోలేక పేగు బంధం తెంచుకోలేక కన్నీళ్ల పర్యంతం అయ్యారు. పిలవని పేరంటానికి వెళ్లడానికి సిద్ధమయ్యారు. కొడుకు కోడలికి కొత్త బట్టలు, మనమరాలికి కొత్త గౌను, బంగారు గాజులు, వెండిపట్టీలు, మరీ అప్పు చేసి తీసుకెళ్లారు. అక్కడి పరిస్థితులను అంతా కొత్తగా ఉన్నాయి. అంటీముట్టనట్లుగా పలకరింపులు, మాట వరసకన్నా మనవరాలితో తాత, నాన్నమ్మలని చెప్పడానికి కూడా కొడుకు, కోడలు జంకుతుంటే.. ఇక చేసేది లేక తామే బలంతాన బిడ్డను ఎత్తుకుని ముద్దాడి మురిసిపోయారు. తాము తెచ్చిన బంగారు గాజుల్ని కొత్త గౌనును, వెండిపట్టీలను బిడ్డకు అలంకరించమంటే... కొడుకు, కోడలు ఒకరి ముఖాలు ఒకరు చూసుకుని చిన్నగా నవ్వుకుంటున్నారు.



''మా అమ్మవాళ్ళు బిడ్డకు కావాల్సినవన్నీ ఎప్పుడో కొనిపెట్టేశారు. ఇవి సైజులు కూడా సరిగా వుండవు. ఇప్పుడెందుకులే... తర్వాత వేస్తాములే!" అంటున్న కోడల్ని ఏ ఒక్కమాట అనకుండా వంతపాడుతున్న కొడుకుని చూస్తే ఆ తల్లిదండ్రులకు పెళ్ళాం కొంగు పట్టుకుని తిరిగే ఆడంగి అడవే గుర్తొచ్చాడు. కళ్ళు వర్షిస్తున్నాయి. మనసు మూగబోయింది. "మట్టి చేతుల్తో కొడుకుని పెంచి, ఆ మట్టితల్లిని కుండలు చేసి అమ్ముకుని చదివించి, ఆ మట్టి దయతో ఉద్యోగస్తుడైన కొడుక్కి, ఆ ఉద్యోగస్తుణ్ణి కొంగున కట్టేసుకున్న స్వార్థపరురాలైన పెళ్ళానికి... మట్టి కుండలతో మనుగడ సాగించిన ఈ మట్టి మనుషులకు దక్కిన గౌరవం ఏమిటి? తల్లిదండ్రుల బంధాల్ని తెంచి, కడుపుకోత విధిస్తున్న బిడ్డల్నేమనాలి? క్షణక్షణం బిడ్డల ఔన్నత్యం కోసం చచ్చిబతుకుతున్న కన్న పేగుకు దక్కిందేమిటని?" తమలో తామే దుఃఖంలో మునిగిపోయారు మల్లన్న, రాములమ్మలు.

వీధిలో ఒక్కసారిగా లైట్లు వెలిగాయి. మల్లన్న మనస్సుల్లో కూడా ఏదో పరిష్కారం వెలిగినట్లయింది. అంతే ఆ రాత్రికి రాత్రే పల్లెకు తిరుగు ప్రయాణం అయ్యారు ఎవరికీ చెప్పా పెట్టకుండానే. గుండెలు దిటవు చేసుకున్నారు. కొడుకు కోడలికి కనువిప్పు కలుగుతుందనుకున్నారు. వారి కళ్ళు స్వార్థంతో మూసుకుపోయాయి. ఇక, అవి ఈ జన్మకు తెరుచుకోవని తెలిసిపోయింది. కొడుకు కొరివి పెడ్తారనుకున్నారు చచ్చినాక, కానీ వీడు బతికుండగానే కొరివిపెట్టేశాడు. కోడలు పండంటి బిడ్డల్నిచ్చి ప్రేమలు పంచుతుందనుకున్నారు. ఆమె మొదటికే బంధాల్ని తెంచేసింది. "వాళ్లు మాత్రమే కష్టపడి బిడ్డనుకన్నారంట, వాళ్ల సంపాదన వాళ్లే తింటున్నారంట. బిడ్డపై సర్వహక్కులు వాళ్లవేనంట. "ఎంత చిత్రమైన మాటలు మాట్లాడినారు. అయితే ఇంకెవరూ ఈ లోకంలో బిడ్డల్ని కనడం లేదా? కష్టపడి సంపాదిస్తూ తమ తోటివారు కన్నవారికి అన్నం పెట్టడం లేదా? వీరిలాగే ప్రతి కొడుకు, కోడలు అనుకుని వుంటే ఈ సంఘంలో తల్లీదండ్రులు బతికి బట్టకట్టేవారా? మానవత్వం పరిమళించేదా? కొడుకు విషయంలో తాము పొరబాటు చేశాము. తాము ధృతరాష్ట్రుని ప్రేమను తలపించారు. గుడ్డిగా కొడుకుని నమ్మారు. వాడు ఏరుదాటాక తెప్పను కాల్చేశాడు. ఇలాంటి వాడి కోసమా తాము జీవితాలను ధారబోసింది.. బూడిదలో పోసిన పన్నీరుగా చెడింది. అన్నిటికీ కాలమే.. చెబుతుంది అనుకుంటూ భార్య భర్తలు ఒకరినొకరు ఓదార్చుకుంటున్నారు.

మల్లన్న మట్టిని చేతుల్తో పిసుకుతున్నాడు..మట్టి వెన్నముద్దగా మైనంముద్దగా చెప్పినట్లుగా చేతిలో ఒదిగిపోతుంది..రాములమ్మ కుమ్మరి చక్రం తిప్పుతోంది. మట్టే మనకు అన్నం. మట్టే తమ పాలిట తల్లి, తండ్రి, పిల్ల, పాప. ఈ మట్టిలోనే పుట్టాం. ఈ మట్టిలోనే కలిసిపోతాం, ఈతి బాధల్తో మట్టి బొమ్మలుగా పగిలి, రగిలి... అంటూ భార్య భర్తలు చూపుల్తోనే పలకరించు కుంటున్నారు. ఈ మాటలు విన్నట్లుగా వసారాలోని లేగదూడ మల్లన్నను ఆనుకుని నిలబడిపోయింది. అలాగే తాము పెట్టే ఎంగిలి అన్నం తినే తమ ఇంటిలోని రెండు కుక్కపిల్లలు బిలబిలమంటూ వచ్చేశాయి. కుండలు చేస్తున్న మల్లన్న చేతుల్ని మూతిని నాకుతూ ఒక కుక్కపిల్ల ఎగబాగుతుంటే, ఇంకో కుక్క పిల్ల రాములమ్మ కాళ్లకు చుట్టుకుని ప్రేమగా కాళ్లను ముద్దుచేస్తూ ఎత్తుకోమని కళ్లలోకి చూస్తుంటే, భార్యాభర్తల కన్నుల్లో కన్నీరు కట్టలు తెంచుకుంది. తమ ఎంగిలి మెతుకులు తిన్నందుకు నోరులేని కుక్కపిల్లలు విశ్వాసంతో తమ కోసం, తమ ప్రేమ కోసం పడుతున్న వాటి ప్రేమ ఆరాటం ముందు, ఈ బూటకపు మానవ ప్రేమలు బలాదూర్ అనిపించింది ఆ క్షణం. విశ్వాసం, జాలి లేని కన్న బిడ్డలకంటే కూడా ఈ మూగజీవాలే ఎంతో మేలనుకున్నారు. మల్లన్నకు, రాములమ్మకు జ్ఞానోదయం లాంటి కనువిప్పుకల్గింది. అంతే ఇక జీవితాంతం మూగజీవాల్ని పెంచి పోషించాలని, జీవ కారుణ్య మార్గంలో నడవాలని ప్రేమానురాగాలను మూగజీవాలతో పంచుకోవాలనే తీర్మానం వారికి కొండంత బలాన్నిచ్చింది. ఇప్పుడు మల్లన్న రాములమ్మలు సమాజంలో బిడ్డలచేత దగా పడ్డ సగటు తల్లిదండ్రులకంటే కూడా మానసికంగా ఎంతో ఎత్తులో నిలబడి జీవిత సత్యాన్ని దర్శించిన ఆదర్శ దంపతుల్లా కన్పిస్తున్నారు.

# అవినీతిపై పోరు అనేక సవాళ్ళు



- తెలకపల్లి రవి

నిన్నటి పారిశ్రామిక దిగ్గజం టాటా, నేటి అగ్రగాములలో ఒకరైన అనిల్ అంబానీ, వీటన్నిటిని బయటపెట్టే మీడియా దళారీ నీరా రాడియా ఇదే సమయంలో పార్లమెంటరీ కమిటీ ముందు వాంగ్మూలం ఇవ్వాల్సిన స్థితి దేన్ని సూచిస్తుంది. అవినీతి నిర్మూలనను ఆర్థిక మూలాలతో సంబంధం లేని ఆదర్శంగా చూపించడం అవాస్తవికతే. ఎన్రాన్ కుంభకోణం నుంచి సబ్ ప్రైమ్ సంక్షోభం వరకూ అమెరికా తదితర దేశాల్లో సాగిన అవినీతిని విస్మరించే వాటినే నమూనాలుగా చెప్పడమూ సరికాదు. రాజకీయ అవినీతిని అదేపనిగా దూషించే మార్కెట్ మార్కు అవినీతికి కూడా కళ్ళెం వేయగలగాలి. విశృంఖల ప్రైవేటీకరణ విచ్చలవిడి అవినీతి కవల పిల్లలనే పరమ సత్యాన్ని గుర్తించక పోవడమంటే అది నీడతో యుద్ధ క్రీడగా మిగులుతుంది.

అవినీతికి వ్యతిరేకంగా అన్నా హజారే నిరాహార దీక్షకు దేశ వ్యాపితంగా కొత్త చర్చకు దారితీసింది. ఆయనను మొదటి దశలో అభినందించడమే ప్రధానమైన తర్వాత కాలంలో ఇతర కోణాలు కూడా ముందుకు వచ్చాయి. అత్యంత అవినీతిపరులు కూడా అతి బిగ్గరగా సంఘీభావం తెల్పడం కూడా విమర్శలకు గురైంది. కేంద్రంలోని పాలక పక్షం ప్రతినిధి దిగ్విజయ్‌సింగ్ వంటి వారు అదేపనిగా అన్నా హజారేపై దాడి చేయడాన్ని ఎవరూ ఆమోదించలేదు. కాని అన్నా చెప్పే మార్గమే సమగ్రమైందన్న భావన కూడా ప్రశ్నార్థకమైంది. ఆయన చుట్టూ వున్నవారిలో కొందరు ఆరోపణలకు గురైనారు.

అవినీతిపై ప్రజానీకం ఎప్పుడూ కోపంగానే వుంటారు తప్ప కొందరు అంటున్నట్టు సర్వ సాధారణమేనన్నట్టు ఆమోదించరు. కేవలం గత్యంతరం లేక అందుకు తలవంచుతుంటారు. కమల్‌హాసన్ చిత్రం భారతీయుడు ఘన విజయంతో మొదలై ఒకే ఒక్కడు, ఠాగూర్, అపరిచితుడు వంటి చిత్రాల విజయ పరంపర అవినీతిపై ప్రజల్లో పేరుకుపోయిన అసంతృప్తికి, ఆగ్రహానికి ఒక ప్రతిబింబం వంటిదే. వాటిలో పరిష్కారాలు సమగ్రమైనవా, సక్రమమైనవా అంటే కాదు. అందుకే తెలుగు భాషలో నాకు నచ్చని ఒకే ఒక పదం క్షమించడం అన్న మెగా కథానాయకుడు అవినీతిని అరికట్టేందుకు సోనియా గాంధీ కృతనిశ్చయంతో వున్నారని జనపథ్‌లో ప్రకటించేశారు. కాల్పనికతకూ, వాస్తవికతకూ తేడా ఇక్కడే తెలుస్తుంది. జన లోక్‌పాల్ బిల్లును తమను కూడా కలుపుకొని హడావుడిగా ఆమోదించాలని పట్టుబట్టిన అన్నా హజారే దీక్ష వల్ల కలిగిన ఫలితాలకు కూడా అలాటి పరిమితులు వుంటాయన్నది స్పష్టం. దాంతోపాటు ఆయన వైఖరి కూడా కొత్త వివాదాలకు తావిచ్చింది. తన దీక్ష దగ్గరకు రాజకీయవేత్తలెవరూ రాకూడదని శాసించిన అన్నా హజారే రాజకీయ బాబాగా అభివర్ణించబడే రామ్‌దేవ్‌ను స్వాగతించారు. అధికార వ్యవస్థలో భాగంగా చాలాకాలం వున్న కిరణ్‌బేడీని ప్రముఖంగా ముందు నిలిపారు. మతతత్వ శక్తులకు సన్నిహితులైన మేధావులు అనేక మంది అక్కడ సాక్షాత్కరించారు. ఆఖరులో నరేంద్ర మోడీని, నితీష్ కుమార్‌ను కీర్తించడంతో హజారే దీక్ష ముగిసింది. తమను మెచ్చుకున్నందుకు నితీష్ కుమార్ నమ్రత ప్రకటిస్తే మోడీ మరింత గడుసుగా ఇది విమర్శలకు దారితీస్తుందేమోనని ముందు జాగ్రత్త ప్రదర్శించారు.

ఏమైనా దేశం ముందున్న సమస్య అవినీతి అని సాక్షాత్తూ రాష్ట్రపతి ప్రతిభా పాటిల్ గణతంత్ర దినోత్సవ సందేశంలోనే చెప్పారు. అవినీతిపరులని తెలిసినా అధికారం కోసం రాజా వంటి వారిని చేర్చుకోక తప్పడం లేదని మన్మోహన్‌సింగ్ ఆ తర్వాతే వెల్లడించారు. కనుక అవినీతిపైన ఈ దేశంలో విమర్శలు చేయని వారు, ఆవేదన చెందని వారు ఎవరూ లేరు. అయితే వ్యవస్థీకృతమైన అవినీతి

మూలాలు చూడకుండా కాయకల్ప చికిత్సలపై కదన శంఖాలు ఎంతగా పూరించడం వేళ్ళు వదిలి కొమ్మను విరచిన చందంగానే మిగిలిపోతుంది. అనేక విధాలైన ఆర్థిక దోపిళ్ళపై ఆధారపడిన ధనస్వామ్య వ్యవస్థ సరళీకరణ యుగంలో మరీ దుర్గంధభరితమై. దుర్మార్గమై పోయిందనేది అసలు వాస్తవం. అవినీతి పాతకాల సరళీకరణ తప్ప పరిష్కారాల సరళీకరణ కాదిది. వామపక్షేతర పార్టీలన్నీ నేతలు రీతులు ఏవైనా సరళీకరణను భుజాన మోస్తూనే వున్నాయి. ప్రపంచ బ్యాంకు ప్రవచిత విధానాల అనివార్య ఫలితం అవినీతి అని అంతర్జాతీయ అనుభవమూ చెబుతున్నది. విప్లవాత్మకమైనదిగా వర్ణించబడిన సూక్ష్మ రుణ పిత, నోబుల్ బహుమతి గ్రహీత మహ్మద్ యూనస్ అవినీతి ఆరోపణపై బోనెక్కడం దీనికో ఉదాహరణ. పౌర సమాజం పేరుతో ప్రభుత్వేతర సంస్థలు (ఎన్‌జీవోలు) ప్రతి దాన్ని నడిపించాలని చెప్పడం చాలా ఆకర్షణీయంగా వుంటుంది గాని వాస్తవంలో అది ప్రాతినిధ్య ప్రజాస్వామ్య సూత్రాలనే ప్రశ్నిస్తుంది. పైగా ప్రభుత్వాలనే కొనుగోలు చేయగల అంతర్జాతీయ తిమింగళాలు ఈ సంస్థల ప్రతినిధులను ప్రభావితం చేయలేవనుకోవడం కూడా అసంబద్ధమే. పుచ్చిన మిరియాలైనా జొన్నల కన్నా నయం అన్నట్టు రాజకీయ పార్టీలు కనీసం ప్రజల ఓట్ల కోసం, ఆమోదం కోసం బూటకంగానైనా కొన్ని పనులు చేస్తుంటాయి. ప్రభుత్వాలను పార్లమెంట్‌లో ప్రశ్నించే, నిలదీసే అవకాశమైనా కొంత వుంటుంది. కాని కేవలం నీతిమంతులనే ముద్ర వేసుకున్న కొందరు వ్యక్తులకు వ్యవస్థాగతమైన పాత్ర కల్పిస్తే ప్రశ్నించడానికి అవకాశమేమిటి? రాజకీయాలపై తరచూ అసహనం ప్రదర్శించే లోక్‌సత్తా జయప్రకాశ్ నారాయణ వంటి వారు కూడా అన్నా హజారే వైఖరిలో అవాస్తవికత కొంత వుందని చెప్పడం గమనించదగ్గది.

లోక్‌పాల్ బిల్లు 42 ఏళ్ళలో ఎనిమిదిసార్లు వెనక్కు పోయిందంటే పాలకులకు దాన్ని తీసుకురావడం పెద్దగా ఇష్టం లేదనేది స్పష్టం. ఎప్పటికైనా ఆ బిల్లు తెచ్చినప్పటికీ అంతటితోనే అవినీతి ఆగిపోతుందని కాదు. నిబంధనల ఉల్లంఘన అవినీతి అనడం ఒకటైతే అసలు నిబంధనలే అంతర్జాతీయ బేహారులకు అనుకూలంగా వున్నప్పుడు చేయగలిగిందేమిటి? బ్రహ్మణి స్టీల్స్ అమ్మకంపై వచ్చిన కథనాలు గాని, అంతకు ముందు ఎమ్మార్ వ్యవహారం గాని ఏం చెబుతున్నాయి? నిబంధనల నిర్ణయంలోనే ప్రజల వనరులను గుత్తాధిపతులకు కట్టబెట్టే ఏర్పాటు జరిగాక అంతా చట్టబద్ధంగానే అవినీతి జరిగిపోతుంది. అవినీతి పడగ నీడ పేరిట ఈ రచయిత (క్. వీరయ్యతో కలిసి) అనువదించిన పుస్తకం ప్రపంచ బ్యాంకు ప్రతి చోటా అవినీతిని పెంచి పోషిస్తున్న తీరును సోదాహరణంగా వివరిస్తుంది. ఈ నిరాహారదీక్షతో సహా నిరంతరం అవినీతిపై వినిపించే విమర్శలలో సామ్రాజ్యవాదం, ప్రజా వనరుల ప్రైవేటీకరణ వంటి మాటలే వినిపించవు. అందుకే ఇది పాక్షికమైన వ్యవహారం.

ఈ పాక్షికత్వం ఇంకా ఇతర విధాలుగానూ కనిపిస్తుంది. నరేంద్ర మోడీ పాలనలో గుజరాత్‌లో సాగిన జాతి హత్యాకాండ దేశమంతటి ఖండనకు గురైంది. నాటి ప్రధాని వాజ్‌పేయి కూడా ఒక దశలో మోడీని తప్పించే విధంగా మాట్లాడి సంఘ్ పరివార్ చేతుల్లో దెబ్బతిన్నారు. మోడీపై ఇతర ఆరోపణలు అటుంచి రాజకీయాధికారం కోసం మత మారణహోమాన్ని సృష్టించడం అవినీతిని మించిన అఘాయిత్యం కాదా? మోడీతో కలిసి ఎన్నికల ప్రచారానికే నిరాకరించిన నితీష్‌ను కూడా కలిపి పొగడటంలో రాజకీయ వాస్తవికత ఎంత? ఇదే సమయంలో నిరాడంబరంగా నామినేషన్ వేసి స్వంత ఇల్లు లేదని ప్రకటించిన బుద్ధదేవ్ భట్టాచార్య ప్రత్యేకత ఎందుకు కనిపించలేదు? త్రిపుర నుంచి వెలువడే డైలీ దేశర్ కథ సంపాదకులు గౌతం దాస్ ఒక సందర్భంలో అప్పటి ముఖ్యమంత్రి నృపేన్ చక్రవర్తి తానూ ఒక మామూలు రూమ్‌లో వుంటామని చెప్పినప్పుడు చాలా ఆశ్చర్యం కలిగింది. నిజంగానే నృపేన్ పదవీ విరమణ సందర్భంలో ఒక్క సూట్‌కేస్‌తో బయటకు నడిచాడు. నిజాయితీపరుడైన శంకరన్‌ను పిలిపించుకుని మరీ నియమించుకున్నాడు. మరోవైపున రెండు దశాబ్దాలకు పైబడి బెంగాల్ ముఖ్యమంత్రిగా వున్న జ్యోతిబసుపైన ఎలాటి ఆరోపణలు నిలబడలేదు. ప్రశ్నల కుంభకోణం స్టింగ్ ఆపరేషన్‌లో ఒక్కరంటే ఒక్క కమ్యూనిస్టు సభ్యుడు తమకు దొరకలేదని ప్రకటించడం ప్రపంచమంతా చూసింది. కమ్యూనిస్టేతర ఇంకా చెప్పాలంటే రాజకీయేతర కార్పొరేటీకృత మార్గాల గురించే ఆలోచించే వారికి ఈ ప్రత్యేకతలు పొరబాటున కూడా కనిపించవు. సరళీకరణను ప్రశ్నించని ప్రత్యామ్నాయాలు మాత్రమే వారికి కావాలి. ప్రజల, ప్రజాసంఘాల, ప్రజా పక్షాల పాత్ర లేని పౌర సమాజ ఫార్ములాలే సర్వశ్రేష్టమైనవి! పైగా అన్నా దీక్షకు తమ స్పందనను కూడా తమ నిజాయితీకి తార్కాణంగా వారు ప్రచారం చేసుకునే అవకాశం లభిస్తుంది.

రాజకీయాలంటేనే చెడ్డవి అని శాపనార్థాలు పెట్టడం ద్వారా నిజమైన చెడ్డ రాజకీయాలను, పాలక వర్గాల దోపిడీ వ్యూహాలను రక్షించడమే జరుగుతుంది. రాజకీయేతర శక్తులకు పెద్ద పీట వేయడం ద్వారా పరోక్ష పద్ధతిలో మార్కెట్ శక్తుల ఆధిపత్యానికి మార్గం సుగమమవుతుంది. పౌర సమాజం అంటే అర్థం నానా రకాలైన ఎన్జీవోలు కాదు. ముసుగులు వేసుకున్న కార్పొరేట్ ప్రతినిధులు కాదు. అన్నా హజారే మొదలెట్టిన వాటర్ షెడ్ వ్యవస్థ కూడా అనేక చోట్ల అవినీతి ఆరోపణలకు గురికావడం అసత్యం కాదు. నిన్నటి పారిశ్రామిక దిగ్గజం టాటా, నేటి అగ్రగాములలో ఒకరైన అనిల్ అంబానీ, వీటన్నిటిని బయటపెట్టే మీడియా దళారీ నీరా రాడియా ఇదే సమయంలో పార్లమెంటరీ కమిటీ ముందు వాంగ్మూలం ఇవ్వాల్సిన స్థితి దేన్ని సూచిస్తుంది? అవినీతి నిర్మూలనను ఆర్థిక మూలాలతో సంబంధం లేని ఆదర్శంగా చూపించడం అవాస్తవికతే. ఎన్రాన్ కుంభకోణం నుంచి సబ్ ప్రైమ్ సంక్షోభం వరకూ అమెరికా తదితర దేశాల్లో సాగిన అవినీతిని విస్మరించే వాటినే నమూనాలుగా చెప్పడమూ సరికాదు. రాజకీయ అవినీతిని అదేపనిగా దూషించే మార్కెట్ మార్కు అవినీతికి కూడా కళ్ళెం వేయగలగాలి. విశృంఖల ప్రైవేటీకరణ విచ్చలవిడి అవినీతి కవల పిల్లలనే పరమ సత్యాన్ని గుర్తించక పోవడమంటే అది నీడతో యుద్ధ క్రీడగా మిగులుతుంది. తాజా సురేష్ కల్మాడీ అరెస్టు, కనిమొళిపై కేసు నమోదు నేపథ్యంలో అవినీతి విశ్వరూపం మరింతగా తేటతెల్లమైంది గనుక దానిపై పోరాటం కూడా అంత నిశితంగానూ, వాస్తవికంగానూ పోరాడవలసి వుంటుంది. సరళీకరణ ప్రభావాన్ని ప్రశ్నించని అవినీతి వ్యతిరేక సూక్తి ముక్తావళి నిరర్థకంగానే పరిణమించడం తథ్యం.

●

# ఉత్తరం

- బొగ్గరపు రాధాకృష్ణమూర్తి



ఉత్తరమంటే
ఒక ఆత్మీయ పలకరింపు...
అభిమానాల చిలకరింపు
విలక్షణమైన ఊహల మధనం
ఆలోచనాలోచనాలతో కథనం
అది-
అనంత భావాల సదనం
అనేక ప్రభావాల వదనం...
ఒక్కోసారి
ప్రమోద భరిత విషయాన్ని తీసుకొస్తుంది
ప్రమాద సహిత విషాన్ని వేసి తెస్తుంది...
ఉత్తర కావ్యానికి
ఫ్రమ్ అడ్రస్ ముందుమాట

ఉత్తరమంటే
జీవన గమనాల సమీక్షణం
ఉత్తర తెరపై
వివిధ పాత్రల ప్రత్యక్షం...
ఉత్తరమంటే...
అక్షరాల్ని పోగు చెయ్యటం కాదు
పరిమళాల పోగవెయ్యటం
మరలా మరలా ఆఘ్రాణించటం...

ఒక్కో ఉత్తరం
పాత జ్ఞాపకాల
ఆపాత మధురాల్ని
తెరలు తెరలుగా తీస్తుంది...
దశాబ్దాల సంగతుల్ని
దర్శించే సంగీతంలా
స్పర్శించే సాహిత్యంలా
మదిని ఊయలలూపుతుంది....
ఒక్కొక్క లేఖ
జీవితాన్ని వెలిగించే కాంతి రేఖ కావచ్చు
ఆలోచనల్ని మొలిపించే
మరో శాఖ తేవచ్చు..
అందుకే - ఉత్తరం
కాలంతోపాటు కరగని కల
మానస సంద్రంలో చెరగని అల...

---

# చందన న్యాయంలా...

- రఘుశ్రీ



కొందరికి
మొహమాటాలుండవు..
మరికొందరికి
మాటలే ఉండవు...
మనం సందేహ
సందిగ్ధాలలోంచి
తేరుకునేలోపే
వాళ్ళు -'వాళ్ళ వాళ్ళ'
మాటల శరాలను
సంధించేస్తారు...
సందేహం కొందరికి
జవాబు దొరకని ప్రశ్న...
మాట కొందరికి
అర్థంగాని జవాబు...

కొందరి భాష
పదాలు లేని నిఘంటువు...
కొందరి మౌనం
రచించని మహాకావ్యం...
ఇది వరకందరూ
నా చెవిలో పూలు పెట్టేవారు...
ఇప్పుడంతా
చెవినే మెలిపెట్టేస్తున్నారు...
ఏమాట కామాటే చెప్పాలి...
నేను ఇదివరకటి కన్నా
ఇప్పుడే సుఖంగా ఉన్నాను...
కారణం -

నేను మూగినే కాదు,
చెవిటినీ అయినాను...
ఆ పుణ్యమంతా...
ఈ సమాజపు శబ్ద కాలుష్యానిదే!
అందుకే -
ఆవల నుండి ఈ - వల కొచ్చేశాను...
నాకై నేను...
ఘట పర్యాసనం గావించుకొని
నన్ను నేను సంస్కరించుకొని...
ఇన్నాళ్ళూ నేను కాలంతో స్నేహం చేశాను
ఇప్పుడు కాలమే నాతో స్నేహం చేస్తోంది
విభూతాత్ముడనై... అవధూతలా
ఇక ఈ గదిలో నేను...
చందన న్యాయంలా!!...

---

# వాళ్ళు

- మాధవీ సనార



జనారణ్యంలో వాళ్లు
నిత్యం
ఏవేవో పొదల్ని కదిలిస్తుంటారు
సమస్యల కట్టె పుల్లల్ని ఏరి
వాటికి నిప్పెట్టి రాజేస్తుంటారు
అవి హోమాలని చెప్పి
ప్రజల కోసమే వాటిని
ఆజ్యంపోసి రగిలిస్తున్నామని
వేదికలెక్కి
మాటలతో మెస్మరైజ్ చేస్తుంటారు
సత్యం పలకడంలో గాంధీ తమ్ముళ్లో

సేవాభావంలో మదర్ థెరిస్సా సోదరులో
ప్రజా సంక్షేమ పరాయణత్వంలో
రాముడి అనుయాయులో
త్యాగనిరతిలో పొట్టి శ్రీరాములు తమ్ముళ్లో
అన్న భ్రమల ఎండమావుల్ని సృష్టిస్తుంటారు

సమయా సమయాల్ని బట్టి
రకరకాల ఫ్యాన్సీ డ్రెస్సుల్లో కనిపిస్తుంటారు
వేషాలు వేసే వారంటే
మోసాలు చేసేవారనే కదా అర్థం.
అర్థం కోసం అరచేతిలో
వైకుంఠం చూసేవాళ్లనే కదా అర్థం
సులువుగా అర్థమయ్యే ఈ పదాలకు కూడా
యింకా...
అర్థతాత్పర్యాల కోసం
దేబ్యం మొహం వేసుకొని చూస్తున్నంతకాలం
చెవులు రిక్కించుకొని వింటున్నంత కాలం
నిన్ను నువ్వే రక్షించుకోలేవు

# ఈ నెలలో సోమవారం



- కె. ఆనందాచారి

సాధారణంగా రచయితలు, కవులు, సాహితీవేత్తలు, సాహితీ ప్రియులు 'సోమవారం' దినపత్రిక కోసం ఆసక్తితో ఎదురుచూస్తారు. ఎందుకంటే దాదాపు తెలుగు దినపత్రికలన్నీ ఆ రోజు ప్రతిరోజూ వుండే సంపాదక పేజీలో రాజకీయ, సామాజిక వ్యాసాలు కాకుడా సోమవారాన్ని సాహిత్యానికి సంపాదకీయ పేజీని కేటాయిస్తున్నారు. ప్రతి వారం అనేక శీర్షికలతో అనేక సాహిత్య విషయాలు ఆ పేజీలో చోటుచేసుకుంటాయి. సాహిత్యపరమైన వాదోపవాదాలు, చర్చలు, విమర్శ, ప్రతివిమర్శలు, పరిచయాలు, నివేదికలు, ప్రకటనలు, కవితలు, కళారంగ విశ్లేషణలు, సంస్కృతి, మీడియా, సాహిత్యపరమైన కరపత్రాలు, స్పందనలు ఇలా ఎన్నో అంశాలతో ఆ వారానికి సరిపోయేంత ఆహారాన్ని సాహితీవేత్తలకు అన్ని పత్రికలు అందిస్తాయి.

కొన్ని కొన్ని వారాలు ఎప్పటికీ భద్రపరచుకునే సాహితీ పేజీలూ వుంటాయి. పత్రికల్లోని సాహితీ పేజీలను ప్రతివారం చదవగలిగితే నేటి సాహిత్య తీరుతెన్నులు ఎలా వున్నాయో అవగాహనకొస్తుంది. ఒక్క ఈనాడు పత్రిక తప్ప అన్ని తెలుగు పత్రికలూ ఈ సాహిత్య పేజీలను నిర్వహిస్తున్నాయి. ఒక్కో పత్రిక ఒక్కో పేరుతో ఈ పేజీని నడుపుతున్నది. ఆంధ్రజ్యోతి 'వివిధ', 'ఆంధ్రజ్యోతి సాహిత్య వేదిక', ఆంధ్రభూమి 'సాహితి' అని, ప్రజాశక్తి 'సవ్వడి'... సాహిత్యం, కళలు, చరిత్ర, మీడియా, సూర్య – 'అక్షరం', వార్త – 'కావ్య, ఆంధ్రప్రభ – 'సాహితీ గవాక్షం', సాక్షి 'సాహిత్యం / సాక్షి', విశాలాంధ్ర 'సాహిత్యాను బంధం' అనే పేర ఈ సాహిత్య పేజీల నిర్వహణ కొనసాగుతున్నది.

ఒక నాలుగు వారాల కాలంలో సోమవారం నాటి ఈ సాహిత్య పేజీలలో ఏయే సాహిత్యాంశాలు చోటు చేసుకున్నాయి. ఏ రకమైన సాహితీ చర్చలు జరుగుతున్నాయి అనే విషయాన్ని రేఖామాత్రంగా పరిచయం చేయటమే ఈ సమీక్ష ఉద్దేశం. మార్చి 28, ఏప్రిల్ 4, ఏప్రిల్ 11, ఏప్రిల్ 18 తేదీలలోని సాక్షి, ఆంధ్రజ్యోతి, ఆంధ్రభూమి, వార్త, విశాలాంధ్ర, ప్రజాశక్తి పత్రికలను పరిశీలించడం జరిగింది. ఈ మొత్తం నాలుగు వారాలలో అన్ని పత్రికలలో కలపి డెబ్బయి ఎనిమిది సాహిత్య అంశాలపై రచనలు వచ్చాయి (కవితలు గాక). పదకొండుమంది కవులు, రచయితలను పరిచయం, వారి రచనల పరిచయం వున్నాయి. ఎక్కువ మొత్తంలో వున్న అంశాలు పుస్తక పరిచయాలే. ఒక పది కథలకు సంబంధించిన విశ్లేషణలు, పరిచయాలు వున్నాయి. ఇందులో ప్రత్యేకంగా 'సాక్షి' పత్రిక ప్రతివారం ఒక ప్రముఖమైన కథను పరిచయం చేయడం ప్రత్యేకత. విశాలాంధ్ర పత్రికలో ప్రతివారం ఒక ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఒక కవిని, కవిత్వాన్ని పరిచయం చేస్తున్నారు. ఇది విదేశీ కవితను, సాహిత్యాన్ని తెలుసుకునేందుకు ఉపయోగపడుతుంది. వార్తలో ప్రముఖ రచయితల మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలను (సాహిత్యపరమైన చర్చలకు సంబంధించి) అపురూప లేఖాసాహిత్యంగా ప్రచురించి ఆనాటి చర్చలు ఎలా వుండేవో, వారి సాహితీ నిజాయితీ నిబద్ధతలు వీటి ద్వారా అర్థమవుతున్నది. ఇక కళారూపాల గురించి, మీడియా గురించి మూడు వ్యాసాలు ప్రచురితమయ్యాయి. అందులో రెండు 'ప్రజాశక్తి'లో రాగా మరోటి విశాలాంధ్రలో వచ్చింది. ఇవి కళా సాంస్కృతిక రంగాలలో మన అవగాహన పెంచేవిగా వున్నాయి. ముఖ్యంగా జానపద కళలకు సంబంధించిన వ్యాసాలు ఉపయోగంగా వున్నాయి. ఒక ముగ్గురి ఆత్మకథలు, రెండు నాటకాలకు సంబంధించిన అంశాలు చోటు చేసుకున్నాయి. ఇక సామాజిక అంశాలకు సంబంధించిన ఒక అంశం వార్తలో వచ్చింది. చర్చకు సంబంధించిన వాద ప్రతివాదాలు 'ఆంధ్రజ్యోతి', 'వార్త'ల్లో ఎక్కువగా మనకు కనపడతాయి. సాహిత్య సభల నివేదికలూ మూడున్నాయి.

రచయితను రచనను ఇతర రాష్ట్రాల రచయిత రచనలతో పోల్చుతూ తులనాత్మక సాహిత్యవ్యాసం 'ప్రజాశక్తి'లో సుబ్రహ్మణ్య భారతి – గురజాడ రచనలను చల్లా రాధాకృష్ణశర్మ చేసిన పరిశీలన సాహితీ లోకానికి ఎంతో ప్రయోజనకారిగా వుంది. అలాగే మన గతకాలపు సాహితీ మూర్తులు, ఎవరికీ గుర్తులేని, తెలియని తెలంగాణా ప్రాంతంలో 1887 జన్మించిన ఒద్దిరాజు సోదరులు అన్ని సాహిత్య ప్రక్రియలను చేపట్టినవారి విశిష్టతలను తెలిపే వ్యాసం కొండపల్లి నీహారిణి ఆంధ్రజ్యోతిలో చేయడం సాహితీ లోకానికి ప్రయోజనం చేకూరే రచనాంశం.

ఆంధ్రభూమిలో ప్రవాసాంధ్రుల నవ కవిత పేర ఇతర రాష్ట్రాలలో వున్న తెలుగు కవుల కవిత్వాన్ని, కవులను పరిచయం చేయడం విశేషణంగా చెప్పుకోవచ్చు. భాషకు సంబంధించిన వ్యాసం ఒకటి మాత్రమే వుంది.

**పత్రికల వారీగా వచ్చిన కొన్నింటిని పరిశీలిద్దాము.**

## ఆంధ్రజ్యోతి

విగ్రహాలు.. వైఖరులు, విధ్వంసాలు...! అనే శీర్షికలో ట్యాంకుబండ్ విగ్రహాల విధ్వంసంపై దివి కుమార్‌గారు వరవరరావును విమర్శిస్తూ వ్యాసం రాశారు. ఒక జాతి తన భాషా సాహిత్య సాంస్కృతిక ప్రతీకలైన వైతాళికుల విగ్రహాలను పగలగొట్టడం ఆత్మహత్యా సదృశ్యమే అంటూ 1980 నాటి వరవరరావు దృక్పథానికి ఇప్పటికి వచ్చిన మార్పును అనేక ఉదాహరణలను ఇస్తూ విమర్శ రాశారు. నామిని సుబ్రమణ్యం ఆత్మకథ 'నామిని నెంబర్ వన్ పుడింగి' పేర వస్తున్న పుస్తకంలోని కొంత భాగాన్ని ఇచ్చారు. దళిత వర్గాలపై అగ్రవర్ణాల వివక్షను హృద్యంగా ఆత్మీకరించిన తీరు బాగుంది.

దివికుమార్‌గారికి వరవరరావు 'ప్రజాస్వామిక ఉద్యమం – దృక్పథాల సమస్య' అంటూ ప్రతి విమర్శ రాశారు. గిరీష్ కర్నాడ్ 'బలి' నాటకాన్ని దెంచనాల శ్రీనివాస్ తెలుగులో ఎలా ప్రజెంట్ చేసింది విమర్శ కొండేపూడి నిర్మలగారు చేశారు. గోపిని కరుణాకర్ తన కథను సినిమా గాలితో కలిసి వివరించారు. ఈ మధ్యకాలంలో వచ్చిన ఐదు దీర్ఘ కవితల సంకలనాలను దిలావర్‌గారు ఒకేసారి పరిచయం చేశారు. అలాగే 1969 – 73 నుండి నేటి వరకు ప్రత్యేక తెలంగాణా ఉద్యమం సంబంధించిన తొమ్మిది కవితా సంకలనాలను అమ్మంగి వేణుగోపాల్ పరిచయం చేశారు. "తెలుగుజాతి మరచిన బద్దిరాజు సోదరులు" అని కొండపల్లి నీహారిక వారి జీవితం, రచనలు పరిచయం చేశారు.

## ఆంధ్రభూమి

'కుందుర్తి జయాపజయాలు' వచన కవిత్వాన్ని కుందుర్తి భాషా ప్రయోగాలతో ఎలా నిర్వహించారో గుమ్మన్నగారి బాల శ్రీనివాసమూర్తి విశ్లేషించారు. కథల తెలుగు శీర్షికన సింగమనేని నారాయణ కథలలో ఉత్తరాంధ్ర, తెలంగాణ మాండలికాలను రచయితలు 1970, 1975 తర్వాత వాడుతూ వచ్చారని చెబుతూ 1961లో రావిశాస్త్రి 'ఆరు సారా కథలు'లో భాషలో కొత్త పదాలు వాడిన తీరును ఉదహరించారు. 'సాహితీ శిఖరం – పిలకా గణపతి శాస్త్రి' శీర్షికన ద్వా.నా. శాస్త్రిగారు 'విశాల నేత్రాలు' అశోకవర్ధనుడు, కాశ్మీర పట్టమహిషి, గృహిణి మొదలైన నవలలలోని పాత్రలు, కథను పద్ధతిని వివరించారు. ద్వా.నా. శాస్త్రిగారి తెలుగు భాషా బోధనపై రాసిన వ్యాసానికి సమాధానంగా 'తేడాలని చూడలేని తేలికైన విశ్లేషణ' అంటూ డా॥ కనకయ్యగారు ప్రతిస్పందించారు. మళ్ళీ కనకయ్యగారి సమాధానం జొన్నలగడ్డ మార్కండేయులు రాశారు. పత్రికల వాళ్ళు పద్య ప్రక్రియను పట్టించుకోవడం లేదని, మరచిపోతున్నారని ఎన్.సి. రామసుబ్బారెడ్డిగారు విమర్శ చేశారు.

## వార్త

'ఊహలో నడిచే నవల'ంటూ 'డెడ్ అండ్ గాన్' చార్లెయిన్ హేరిస్ నవలను బి.పి. కరుణాకర్ పరిచయం చేస్తూ మనం ఊహించిన పాత్రలతో సూపర్ నేచురల్ నవలగా విశ్లేషించారు. 'తెలుగును కాపాడుకోవడం ఎలా' మాతృభాషలో పరిపాలన, విద్య ఎంతో మేలని చెలిదె వీరశంకరు వివరించారు. ఇక రాచపాళెం, ద్వా.నా. శాస్త్రిల మధ్య నాటక దినోత్సవాల గురించిన చర్చ విషయాలు. తెలుగులో తొలి నాటకం 'మంజరీ మధుకరీయం'ను కోరాడ రామచంద్రశాస్త్రి రాశారు. కాబట్టి కోరాడ జయంతిని నాటక దినోత్సవంగా, కందుకూరి జయంతిని రంగస్థల దినోత్సవంగా జరపాలని స్పందనలు, సూచనలు చేస్తున్నారు. 'చమురు కోసం యుద్ధాలు జరుగునో...' దిలీప్ హీరో రచించిన 'బ్లడ్ ఆఫ్ ద ఎర్త్ – ద బ్యాటిల్ ఫర్ ద వరల్డ్స్' అనే ఆంగ్ల పుస్తకాన్ని టంకశాల అశోక్ పరిచయం చేశారు. అలాగే 'మ్యాటర్స్ ఆఫ్ డిస్క్రిమిషన్ ఏన్ ఆటో బయోగ్రఫీ' ఐ.కె. గుజ్రాల్ ఆత్మకథనూ పరిచయం చేశారు. దాశరథి కవిత్వంలో తెలంగాణాను గురించి ద్వా.నా. శాస్త్రి వివరించారు. కన్యాశుల్కాన్ని 'గర్ల్ ఫర్ సేల్' పేరుతో వేల్చేరు నారాయణరావుగారు ఆంగ్లంలోకి అనువదించిన దానిపై ప్రొ॥ ఉషాదేవి 'శ్రమ కోర్చిన సమర్థవంతమైన అనుమానం' అంటూ అభినందించారు. దేవరాజు మహారాజుగారి స్వర్ణోత్సవం సందర్భంగా ఆయన 'అంతరం' కథను కొలకలూరి స్వరూపరాణిగారు విశ్లేషించారు.

## ప్రజాశక్తి

'నేరాలు – సంస్కృతి – మీడియా' సామ్రాజ్యవాద కార్పొరేట్ మీడియాను ప్రజాస్వామిక మీడియాగా ఎలా మార్చుకోవాలి అంటూ మీడియా విశ్లేషణను తెలకపల్లి రవిగారు చాలా వివరంగా అందించారు. 'భారతి – గురజాడ' నాటకాన్ని వ్యవహార భాషలోకి తెచ్చిన గురజాడ, కవితను వ్యవహార భాషలోకి తెచ్చిన భారతిని పోలుస్తూ చల్లా రాధాకృష్ణశర్మ వ్యాసంలో వివరించారు. 'జీవితం పలకపై రచనాభ్యాసం' , 'రైటింగ్ యువర్ ఓన్ లైఫ్ స్టోరీ' బెర్నార్డ్ సెల్లింగ్ స్వీయ జీవిత కథను చదివితే కొత్తగా రాసేవారికి మంచి పాయింట్లు దొరుకుతాయి. కిలపర్తి దాలినాయుడు నానీలు 'నడిచే నక్షత్రాల'ను కొడవలి సత్యనారాయణ సమీక్ష చేశారు.

'పల్లె కళాకారులు – జానపద సంపదలు' ఒగ్గు కథ, గంగిరెద్దులు, శివభక్తులు, పోతురాజు, మందహెచ్చులు మొదలైన జానపద కళారూపాల గురించి జి. వెంకటస్వామి వ్యాసం చాలా బాగుంది. 'వివక్షతా ప్రపంచంపై కవిత్వ విస్ఫోటనం' కత్తి పద్మారావు... దళిత మహాకావ్యాన్ని వొరప్రసాద్ విశ్లేషించారు. మ్యాన్ బుకర్‌ప్రైజ్ జాబితా వివరాలనూ వొరప్రసాద్ అందించారు. ముఖ్యంగా ప్రముఖ మార్క్సిస్టు నాయకుడు సీతారం ఏచూరిగారు ఫైజ్ అహ్మద్ ఫైజ్‌పై 'విప్లవ భావాల జయకేతనం' అంటూ చేసిన విశ్లేషణ ప్రగతిశీల సాహితీకారులకు ఎంతో ఉత్తేజాన్నిచ్చేదిగా వుంది. 'గ్రామీణ పేదల వాస్తవ కథలు' మేరెడ్డి యాదగిరి రెడ్డిగారి 'కొలిమి కథల'ను కె. శాంతారావుగారు పరిచయం చేశారు. సంత్ సూరదాసు మానవీయతపై డా॥ జి.వి. రత్నాకర్ మంచి విశ్లేషణ రాశారు. ఇక ప్రత్యేకమైన వ్యాసం 'భరత్ యాదవ్' చిత్రాల గురించిన 'పరిణిత యువ చిత్రకారుడు' అంటూ గుడిపూడి విజయరావు రాసిన వ్యాసం చిత్రకారులపై వచ్చిన ఏకైక వ్యాసం.



# ప్రతిబింబం

- వడ్డాది

నా నిలువుటద్దం నన్నే నొసటితో వెక్కిరిస్తుంది
నుదుటి మీద మడతల్లోని జ్ఞాపకాల్ని వెలికితీస్తుంది
జీర్ణించిపోయిన కళ్లల్లోని విరక్తిని బహిర్గతం చేస్తుంది
నెరిసిపోయిన వెండి జుట్టుని ప్రస్ఫుటం చేస్తుంది
ఇప్పుడీ అద్దం చూపించే ఆకృతిని నేను భరించలేను
నా జీవితంలో మచ్చల్ని ఎత్తి చూపటం నేను సహించలేను
జీవితంలో నేను పడ్డ రాజీలకు
జాలి ప్రదర్శించడం నేను ఒప్పుకోను
ఈ అద్దమే ఒకానొకప్పుడు అతిశయించే
నా అందాలని చూపించింది
నా వైవాహిక జీవితంలోని ఆనందాన్ని ద్విగుణీకృతం చేసింది
జీవితంలోని మాధుర్యాన్ని ప్రతిఫలించింది
ఇప్పుడెందుకిలా తయారయింది ఈ అద్దం?
దాన్ని ఏ లోయలోనైనా విసిరెయ్యనా?
ఏ కొండల క్రిందనైనా పిండిచెయ్యనా?
అయినా లాభమేముంది?
నా ప్రతిబింబం పూర్తిగా తుడిచిపెట్టుకు పోతుంది
బింబం మాత్రం ఇలాగే మిగిలిపోతుంది

## సాక్షి

'రవల వెలుగుల గంగ' యెంకి పాటల నండూరి సుబ్బారావుగారిపైన మందలపర్తి కిశోర్ వ్యాసం ఎన్నో వివరాలు తెలుపుతుంది. యెంకి పాటల పూర్తి టెక్స్ట్ నెట్‌లోనూ, కె.బి. గోపాలం పాడిన యెంకి పాటలు వెబ్‌సైట్ లింక్ వివరాలు ఇచ్చారు. టెక్స్ట్ కోసం → http://andrabokk.sinfo.blogspot.com/search/label/Enki%20patalu - కె.బి. గోపాలం – గోపాలం కారంచేడు – గారి వెబ్‌సైట్‌లో యెంకి పాటలు వినే లింక్ -http:/lokabiramam.blogspot.com/2010/04/enki-patalu-nanduri-subba-rao.htm.

'ఎంపు' శీర్షికన తిలక్ కథ 'హోటెల్లో'ను ఉప్పలపాటి నారాయణరావుగారు పి. రామకృష్ణగారి 'దయ్యం' కథను సూరపరాజు రాధాకృష్ణమూర్తి, యశోదారెడ్డి కథ 'నాగి'ని డా॥ పగడాల నాగేందర్ పరిచయం చేశారు.

రీడింగ్ రూం శీర్షికన వారాల కృష్ణమూర్తిగారి 'నిశ్శబ్ద సంకేతం' కథలను రావుగారు పరిచయం చేశారు. 'నాయకురాలు నాగమ్మ' వై. హెచ్.కె. మోహనరావుగారి పుస్తకాన్ని పున్నా కృష్ణమూర్తిగారు, రామ్‌మనోహర్‌లోహియా గారి వ్యాసాలను రావెల సాంబశివరావు అనువాదాల పరిచయం చేశారు. విశాలాంధ్ర ప్రచురణ 'ప్రసిద్ధ తెలుగు నాటికలు' , 'ప్రసిద్ధ తెలుగు హాస్య నాటికలు' అరుదైన సంకలనాలని 'ఆ పుణ్యం కలాలదే' శీర్షికన డా॥ గోపరాజు నారాయణరావు అభినందిస్తూ రాశారు. 'ప్రయోగం సరే, ప్రయోజనం', 'మరిగే తారు సరోవరం' ఎస్. గణపతిరావుగారి కథలో వస్తువు, రూపం కొత్తగా వున్నాయని కల్హణ పరిచయం చేశారు. యక్షుల తిం'గానం' శీర్షికన పున్నా కృష్ణమూర్తిగారు కూచిపూడి నృత్య పరిశోధన చేసిన శ్రీదేవి గురించి యక్షగానాల గురించిన శివానంద్ హెగ్డేగారి అభిప్రాయాలను రిపోర్టు చేశారు. 'కొడిగట్టని సూర్యుడు' అంటూ శీలా వీర్రాజు 'మాస్టర్ ఆఫ్ మెనీ ఆర్ట్స్' అంటూ తూలిక ఆయన బహుముఖ ప్రజ్ఞను పరిచయం చేశారు. శ్రీ శార్వరి రాసిన 'ధర్మభిక్షువు మిలారేపా కథ'ను గోపరాజు పరిచయం చేశారు. గదర్ విప్లవం – కందిమళ్ళ ప్రతాపరెడ్డి పుస్తకం – ఈసఫ్ కథలు గజల్ సౌందర్య దర్శనం పరిచయాలు వున్నాయి.

## విశాలాంధ్ర

'అక్షర రూపం దాల్చిన పూల పరిమళం' సాహిత్యంలో కవిత్వంలో కవులు ఎలా వర్ణించారో వివిధ సందర్భాలను ఉదహరిస్తూ మల్లీశ్వరిగారు చక్కని వ్యాసాన్ని రాశారు. వల్లూరు శివప్రసాద్ గారి నాటికల సంకలనాల గురించి చందు సుబ్బారావుగారు పరిచయం చేశారు. ప్రపంచ కవులు – రూట్‌గర్ కోప్‌లాండ్ గురించి బెల్జియం కవి, విడ్డీవాన్ విలియట్ గురించి డెన్మార్క్ కవి, హెన్రిక్ నార్డ్ బ్రాండ్ గురించి స్టాక్ హోం కవి, టోమస్ ట్రాన్స్ ట్రోమర్ కవిని గురించి సౌభాగ్య పరిచయం చేస్తూ కవితలనూ తెలుగులో అనువదించి ఇచ్చారు. ప్రతివారం ఒక వేమన పద్యం, భావం ఇస్తున్నారు. 'తెలుగువారి పనిపాటలు' ఆచార్య ఎస్. గంగప్ప వ్యవసాయ పనులు, జానపదులు పనిలో పాడుకునే పాటలను పరిచయం చేశారు. సాహితీ స్రష్ట పుట్టపర్తి నారాయణాచార్యులు సాహిత్యాన్ని రామవరఝుల శ్రీశైలం పరిచయం చేశారు. రోణంకి అప్పలస్వామి ఆంగ్లంలోనే అనువదించిన తెలుగు పద్యాల గురించి డా॥ మానేపల్లి, ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి కవిత్వం గురించి రామడుగు వేంకటేశ్వర శర్మ వ్యాసాలు ఉపయుక్తంగా వున్నాయి. నాగప్పగారి సుందర్‌రాజు రచనల్లో బసివిరాలు (దేవదాసీ) కథలను మానేపల్లి పరిచయం చేశారు. తిరుపతిలో జరిగిన కృష్ణదేవరాయలు ఉత్సవాల రిపోర్టు, ప్రాక్పశ్చిమ దర్శనాలు రాహుల్‌జీ అనువాదం కౌశిక పరిచయం చేశారు.

నాలుగు వారాలలో సాహిత్య పేజీలలో కవిత్వం, కథలు, పుస్తకాల పరిచయాలు ఎక్కువగా వున్నాయి. కళలకు, సంస్కృతికి, మీడియాకు సంబంధించిన విషయాలపై వ్యాసాలు చాలా తక్కువ. ఇంతకుముందు కవులు, రచయితల పరిచయాలు మళ్ళీ మళ్ళీ రావటం కూడా మనకు కనపడుతుంది. నేటి కవిత్వానికి సంబంధించిన, కథలకు సంబంధించిన విమర్శనాత్మకమైన విశ్లేషణలు చాలా అరుదు. ఇక కొన్ని చర్చలు, వాద ప్రతివాదాలు ఏ రకమైన సాహితీ ప్రయోజనాన్నీ పొందలేనివిగా వుంటున్నాయి. తులనాత్మక పరిశీలన జరగడం లేదు. సమకాలీన కవిత్వానికి సంబంధించి భారతీయ ఇతర భాషల సాహిత్యాన్ని, విదేశీ సాహిత్యాన్ని ఇంకా ఇవ్వగలిగితే సాహితీకారులకు ఉపయోగకరంగా వుంటుంది. ప్రతివారం సాహిత్య పేజీలలో దాదాపుగా పాతికమంది రచయితలు అనేక సాహిత్యాంశాలను విశ్లేషణ రూపంలో, పరిచయాల రూపంలో పాల్గొంటున్నారు. పేరున్న విమర్శకులు, రచయితలకే కాక కొత్తగా వస్తున్న విమర్శకులకు, రచయితలకు అవకాశాన్ని కల్పిస్తే ఇంకా సాహితీ క్షేత్రం బలవంతమవుతుంది. ఇప్పటికి వస్తున్న సాహిత్య పేజీలు సాహితీకారులకు మంచి వేదికలుగా కొనసాగుతున్నాయనడంలో ఏ సందేహం లేదు.

# వివక్షతా ప్రపంచంపై కవిత్వ విస్ఫోటనం




- వీరప్రసాద్

తెలుగు సాహిత్యరంగంలో దళిత బహుజన భావజాల వ్యాప్తికి కృషిచేస్తున్న వారిలో డాక్టర్ కత్తి పద్మారావు ముఖ్యులు. సామాజిక, రాజకీయ కార్యకలాపాలలో క్రియాశీలంగా ఉంటూనే సమాంతరంగా సాహిత్య వ్యాసంగం కొనసాగిస్తున్నారు. దళిత కోణానికి ప్రాచుర్యం కల్పించాలనే సంకల్పంతో ప్రచురణలు కూడా చేపట్టడం కత్తి పద్మారావు లక్ష్య నిబద్ధతకు నిలువుటద్దం పడుతుంది. తరతరాలుగా కొనసాగుతున్న సాంఘిక వివక్షతలను ఎండగట్టే ఆయన సాహిత్యం సామాజిక మార్పుకోరుకునే వారందరికీ చైతన్యాన్ని, అవగాహనను అందిస్తుంది. తాజాగా 'దళిత మహాకావ్యం' ట్యాగ్‌తో 'ఆత్మగౌరవ స్వరం' కవితా సంపుటిని తీసుకొచ్చారు. 2006 - 2008 సంవత్సరాలలో రాసిన ఈ కవితలు పాఠకుడికి సరికొత్త అనుభూతులని, ఆలోచనలని అందిస్తాయి. పుస్తకం మొదటి పేజీ నుండి ఒక ప్రవాహంగా సాగిపోయే కవితాధార పాఠకుడిలో ఆలోచనల విత్తనాలను నాటుతుంది. సరళ వచనంలో వస్తు ప్రధానంగా ఉంటూనే చక్కని భావుకతను కవిత్వంలోకి అలవోకగా నింపుతారు. సామాజిక వివక్షత, అణచివేతలపై ఆగ్రహంగా కవితా స్వరాన్ని వినిపిస్తారు. అగ్రకుల సమాజం దళితుల పట్ల వ్యవహరించే తీరును తన కవిత్వంలో ప్రధానంగా ఆవిష్కరిస్తారు.

ప్రతీ వ్యక్తికీ తన ఊరు గురించి మధురమైన ఊహలు ఉంటాయి. అదే ఊరిలో భిన్నమైన అనుభవాలు పొందిన దళితుల ఆగ్రహం ఎలా వుంటుందో శక్తివంతమైన కవి వ్యక్తీకరణలో చూడండి- 'ఊరి చెరువులో వాడు గేదెను కడుగుతూ/ నన్ను మెట్లమీదకే రానివ్వనప్పుడు/ ఊరిని నేను కళ్ళురిమి చూశాను/ బావిలో నీటిని వాడు తోడి/ మా కడవల్లో పోయాలన్నపుడు/ దిక్కుతోచకుండా ఎండలో నిలబడ్డానే/ అప్పుడు, ఆ వూరికి మానవత్వం లేదనుకున్నాను' అంటాడు. అంతటితో ఆగకుండా మరింత గాఢంగా- 'నేను ఆడుకుంటూ ఆడుకుంటూనే/ పిడికిలి ఊరిమీదకు విసిరాను' (మా ఊరికి మానవత్వం లేదు) చరణాలను జోడిస్తారు. ఊరి మీద పిడికిలి విసరడమంటే తరతరాల సామాజిక అణచివేతపై పోరాటం చేయడం. ఊరిలోని అసమానత్వాన్ని తీవ్రగొంతుతో ప్రశ్నించడమే.

'మీరు కళ్ళు పీకారు/ వారు అంధులుగానైనా జీవించ ప్రయత్నించారు/ మీరు చెవుల్లో సీసం కరిగించిపోశారు/ వారు తమ గుండె చప్పుడుతో బ్రతికారు/ మీరు నాలుక మీద ఇనుప ఘంటం/ కాల్చి అంటించారు/ వారు చేతులతో సంజ్ఞలు చేస్తూ ముందుకు వెళ్ళారు/ ఇప్పుడు మీరు వారి గొంతును దగ్గర/ మీ గోళ్ళతో నొక్కాలని చూస్తున్నారు/ అప్పుడు వాళ్ళు/ మీరు వేసిన సంకెళ్ళను తెంచుకుంటారు/ ..../..../ఇప్పుడు ఇక మీరేమీ చేయలేరు/ ఇదే ప్రకృతి సూత్రం!' (తిరుగుబాటు ఓ ప్రకృతి సూత్రం) అంటూ తరతరాలుగా దుర్మార్గమైన అణచివేతకు గురైన వాళ్ళు అంతిమంగా సంకెళ్ళను తెంచుకోవటమే తప్ప మరో మార్గం ఉండదంటూ కవిత్వ చిత్రం చేస్తారు.

ఏ వస్తువు తీసుకున్నా వర్తమానాన్ని చరిత్ర అద్దంలో చూపిస్తూ కవిత్వ పాఠకుడిని ఒప్పిస్తారు- 'నిజమే/ శిల్పాశెట్టిని తెల్లవాళ్ళు అవమానించారు/ ఇప్పటివరకు భారతావనిలో/ అవమానింపబడిన మూలవాసులను కూడా/ విజేతలుగా ప్రకటిద్దాం/ ఎందుకంటే వారు/ అవమానాన్ని భరించారు/ అవమానాన్ని జయించారు కూడా/ మానవ సంబంధాల్ని నిలుపుకున్నారు/ ఆత్మీయ బంధాన్ని వారికి కిరీటంగా పెట్టండి' (అపహాస్యం చేయబడినవారే ఇప్పుడు విజేతలు). శిల్పాశెట్టిని బ్రిటీష్ న్యూస్ చానల్‌లో జాతి పేరు మీద అవమానించినందుకు పెద్ద యెత్తున నిరసన వ్యక్తమయింది. ఆ సంఘటనను ప్రస్తావిస్తూ దళితుల ఆత్మగౌరవ పరిస్థితిని పాఠకుల ఊహకు చేరవేస్తారు. తన దృక్పథంలోంచి కవిత్వ అభివ్యక్తీకరణ చేస్తూ వైరుధ్యాన్ని విజయవంతంగా ఆవిష్కరిస్తారు కత్తి పద్మారావు.

మారుతున్న వర్తమానాన్ని 'ఇప్పుడు ఇది వ్యక్తిత్వ నిర్మాణ ప్రపంచం/ గడ్డిపోచలన్నీ/ తమ ఆత్మగౌరవాన్ని ప్రకటిస్తున్నాయి' /..../ ..../అందరం ఒకే వ్యక్తిత్వంతో/ జీవించే నగరం కావాలి/ కూలిపోయే వాటిని కూలిపోనివ్వండి/ ఇప్పుడు కావలసింది/ మానవులు సమంగా జీవించే నగరం/ ఒక్క జాగ్రత్త తీసుకోండి/ ఈ నగరంలోకి 'మనువు'ని రానివ్వద్దు' (ఈ నగరంలోకి 'మనువు'ను రానివ్వొద్దు) అని వ్యాఖ్యానిస్తారు. ఇటువంటి కవితా చరణాలు చదివినప్పుడు పాఠకుడు ఒక్కసారిగా ఉలిక్కిపడతాడు. తనను తాను చెక్ చేసుకొనే ప్రయత్నం చేస్తాడు. తన బాధ్యతను గుర్తుచేసుకుంటాడు. నిజానికి నగరాలలో సమంగా జీవించే పరిస్థితుల సంగతేమో గాని వ్యాపార కేంద్రాలుగా మార్చబడుతున్న నేటి నగరాలు కనీస మానవీయతను కోల్పోతున్నాయి.

'మానవులారా కలసినడవండి' కవితలో కవి ఊహ పాఠకుడికి సుందర దృశ్యాన్ని కళ్ళ ముందుంచుతుంది- 'ఆ మంచు ఒక సన్ననిధారలా/కురుస్తున్నప్పుడు ఆ కొండపైన పచ్చిక/ ముత్యాలతో అలంకరించినట్టు వుంటుంది/ సూర్యోదయం కాగానే/ బంగారు తీగలు పొదిగినట్లూ వుంటుంది' అంటూ పాఠకుడిని అసలు విషయం లోకి దింపుతారు. అక్కడ పాఠకుడికి అనేక ప్రశ్నలు ఎదురవుతాయి. అనివార్యంగా పాఠకుడు ఆ ప్రశ్నలను తనవిగా చేసుకుని కవితో భుజం కలుపుతాడు. 'మనుష్యుల్ని విడదీసే గుర్తులు/ మీ పేరుల్లో వున్నంతకాలం/ మీరు విశ్వజనీనులు ఎలా అవుతారు/ మీరు సౌహార్దులు కండి' (మీరు విశ్వమానవులు ఎలా అవుతారు?) అనడంలో పేర్లకు కుల సూచికలు పెట్టుకుంటూ సమాజంలో అంతరాలను నిర్మూలిస్తామనడంలోని వైరుధ్యాన్ని కవితీకరిస్తారు.

వినూత్నంగా వుండే అభివ్యక్తి చదువరిలో ఆసక్తిని రేపుతుంది. ఆ కవితా వస్తువును అవగాహన చేసుకున్న పాఠకుడిలో సామాజిక స్ఫూర్తి వికసిస్తుంది. అప్పటిదాకా ఉన్న అవగాహనను మార్చివేస్తుంది. సామాజిక చైతన్యానికి దారితీస్తుంది. అదే సృజన పరమార్థం. అటువంటి శక్తివంతమైన వ్యక్తీకరణలు ఈ కవితల్లో అనేకం ఉన్నాయి. 'మాట శక్తివంతం కావాలంటే/ జీవితం చలనంలో వుండాలి/ నీవు ఆదర్శంగానే కాదు/ ఆత్మీయంగా కూడా వుండు/ అప్పుడు/ ప్రపంచం నీతో నడుస్తుంది' (అప్పుడు ప్రపంచం నీతో నడుస్తుంది). మనిషి వ్యక్తిత్వానికి సంబంధించి ఈ చరణాలు విస్తార మానవీయ అనుబంధాల ఆవశ్యకతను చాటుతుంది.

'అమెరికాలో పదిహేను ఏళ్లు వున్నవాడికి/ఇండియా అమ్మాయెందుకు?/అక్కడ ఎవరినీ ఇంతకాలం ప్రేమించలేని వాడు/ ఈ అమ్మాయిని ప్రేమించగలడా?/సముద్రాలు దాటి కులం ఒక అంతర్వాహినిలా ప్రవహించడమేమిటి? (ఎల్లలు చెరగాలంటే?). వివాహం ఎక్కడైనా, ఎవరినైనా చేసుకోవచ్చుననే భావనను ఈ కవిత ఎంత హాయిగా చెబుతుందో చూడండి!. మన దేశ కులవ్యవస్థ మనిషిని ఇన్నాళ్ళుగా సంకుచితం చేస్తూ వచ్చిన తీరును ఈ కవిత వ్యక్తీకరిస్తుంది. ఈ సంకుచిత ధోరణుల పట్ల, వివక్షతల పట్ల కవి తన ఆగ్రహాన్ని వ్యక్తీకరిస్తూనే సామాజిక మార్పు ఆవశ్యకతను నేర్పుగా చెప్పటానికి ప్రయత్నిస్తారు.

సోషలిస్టు పంథాలో సాగుతూ అద్భుత ప్రగతి సాధిస్తున్న చైనాదేశం బీజింగ్ ఒల్లంపిక్స్ నిర్వహణ ద్వారా తన విశిష్టతను ప్రపంచానికి చాటిచెప్పింది. ఆ ఒల్లంపిక్స్ నిర్వహణపై కవి స్పందన ఆకట్టుకుంటుంది- 'లాంగ్‌మార్చ్‌లో రక్తం ఓడ్చిన నేల/కాంతి కుసుమాల్ని విరబూయడం/ఒక చరిత్ర/ ఎరుపు ఒక పోరాటం/బులుగు ఒక చైతన్యం/ తెలుపు ఒక క్రాంతి/రంగుల్లో మానవుడు/మానవుల్లో చైతన్యం/వెల్లివిరిసిన చీనా ఆటలభూమి'(స్నేహితా! యిదే నా కరచాలనం). చైనా ప్రజల ఈనాటి అభివృద్ధి వెనుక గడచిన త్యాగాల గుర్తులను పాఠకులకు గుర్తుచేయడం కవి సామాజిక స్ఫూర్తిని చాటుతుంది.

నూతన ఆర్థిక విధానాలను మన పాలకులు అవలంభించడం ప్రారంభించిన తరువాత దేశంలో ఆర్థిక వ్యత్యాసాలు బాగా పెరిగాయి. కొద్దిమంది వద్దే సంపద పోగుపడింది. బహుళ ప్రజానీకం అవస్థల పాలయ్యింది. సంపద చుట్టూ తిరుగుతున్న వ్యవస్థను నిరసించే కవితలు నేటి తరాన్ని హెచ్చరిస్తాయి- 'మీ పిల్లల్ని చూడడానికి /తెల్లవాళ్ళని చూడడానికి ఎగబడినట్టు/ప్రజలు ఎగబడుతున్నారు/కారణం, మన తెలుగు వాళ్ళలా వారు లేరు/వారు పుట్టిన వూరికే వాళ్ళు కొత్త' (నెత్తురు ఇంకినచోట నుండి ఒక హెచ్చరిక). కవిత్వ అభివ్యక్తి ఒక విషయంలోని వైరుధ్యాన్ని ఎంత చక్కగా ఆవిష్కరిస్తుందో ఈ కవిత చూస్తే తెలుస్తుంది. తెల్లగా ఉండే విదేశీయులను ఆశ్చర్యంగా చూసే మన దేశ ప్రజలు మన దేశీయులనే ప్రత్యేకంగా చూసే పరిస్థితి రావడం ఎంత దౌర్భాగ్యమో పరోక్షంగా ఈ కవిత తెలియచెబుతుంది.

తన కవిత్వం గురించి 'గాయపడిన గుండెలకు/ఔషధపు కట్టులు కట్టే వైద్య శాస్త్రం/నా అక్షరాల్లో వుంది//...../..../....../మార్పు కోసం నేను వేస్తున్న ప్రతి కేకలో/ఒక చార్వాకుల ప్రశ్న వుంది/ (నాది ఆత్మగౌరవ స్వరం) అనడం ఈ పుస్తకంలోని కవిత్వానికి సరిగానే అద్దం పడుతుంది. భవిష్యత్తు పట్ల ఆశావహ దృక్పథాన్ని, సమాజం మారి తీరుతుందనే ధీమాను ఈ కవిత్వం వ్యక్తం చేస్తుంది- 'ఒక్కమాట నిజం/ జీవిస్తున్న వారందరూ/సజీవంగా లేరు/సజీవంగా వున్నవారందరికీ/ జీవితం అందుబాటులో లేదు/మనిషి మనిషి కలసి/జీవించడానికి/అడ్డు వచ్చే ప్రతి గోడా కూలిపోతుంది/ ఇది సామాజిక సత్యం' (ప్రేమ సజీవమైంది) అని పలికిన డాక్టర్ కత్తి పద్మారావు కవిత్వం అసమానతల సమాజం లోని అంతరాలను నిర్మూలించడంలో భాగంగా తన వంతు కర్తవ్యాన్ని మాత్రమే కాకుండా ఎందరిలోనో స్ఫూర్తిని రగిలిస్తుంది.

●

# జీవితపు గొప్పదనాన్ని వినిపించిన 'మువ్వలు'

**- యాళ్ల అచ్యుతరామయ్య**




భమిడిపాటి జగన్నాథరావు కథా సంపుటి 'మువ్వలు'లో కథలు తప్ప మరేమీ లేవు. జగన్నాథరావు జగమెరిగిన కథకులు కాబట్టే, రచయిత పరిచయం కానీ, మరెవరివో యోగ్యతా పత్రాలు కానీ ఈ సంపుటికి అవసరంలేదు. హడావిడిగా సాగిపోయే ఈ ఆధునిక జీవితంలో, ఇంత మంచి పుస్తకాన్ని ఎవరూ మిస్ కాకూడదు.

వీరు 1951లో రాసిన మొదటి కథ 'జీవితపు విలువలు' మొదలుకొని, ఇటీవల (2003)లో ప్రచురింపబడిన కథ 'బంతి' వరకూ – అన్నీ అనుభూతి సాంద్రతతో నిండి ఉన్న కథలే! తెలుగు సాహిత్యంలో ఇప్పటి వరకూ వచ్చిన ఉత్తమ స్త్రీవాద కథలలో 'బంతి' ఒకటిగా నిలిచిపోతుంది.

ఈ కథలన్నిటిలో – మనందరికీ పరిచయమైన జీవన దృశ్యాలను రచయిత ఓ కొత్తకోణం నుండి దర్శింపజేస్తారు. తాను చూపించదలుచుకున్న జీవితాన్ని పరిచయంచేసి, రచయిత తప్పుకుంటారు. కథ చదవడం పూర్తి అయ్యాక, పాఠకుడి మనో ప్రపంచంలో ఓ వెలుగు ప్రసరిస్తుంది. అందుకే ఇస్మాయిల్ అంటారు. 'కవిత్వం చేసే పని మనస్సులో దీపం వెలిగించడమే! అని. ఇదే పనిని జగన్నాథరావు కథలు కూడా చేస్తాయి.

ఉపనిషత్తులలో మహా వాక్యాలున్నట్లే ఈ కథలన్నిట్లోనూ అనేక జీవిత సత్యాలు మనకు తారసపడతాయి. మచ్చుకు కొన్ని:

"జీవితం చాలా గొప్పది. అందుకే ప్రపంచంలోని మహా రచయితలందరూ వారి ఆదర్శాలకంటే జీవితపు గొప్పదనానికే తల వంచారు" (సముద్రం)

"చిన్నప్పుడు దొంగాట ఆడుతూ పరిగెడుతుంటే అలుపొచ్చినప్పుడనిపించేది – 'ఎందుకింత భయం? దొరికిపోతే దొరికి పోతాం – ఇదీ ఆటే కదా! 'అనీ,' ఎప్పుడైనా ఆ చిన్నతనపు ఊహ గుర్తొచ్చి, చిన్నబోయినట్టనిపిస్తుంది. ఈనాడు ఔట్ అయితే ఎంత పరువునష్టం? ఎంత ప్రాణభీతి?" ('అలుపు')

"మీ విస్తృతమైన గ్రంథపఠనం అంతా మీ మెదడులోకి ఎక్కేసింది. మీరు మీ చదువులలోని సారం మీ హృదయాల్లోకి పీల్చుకుని ఉంటే – మీ అమ్మగారిలా ఇతరులను గౌరవించ గలిగేవారు... "(చూపు')

"నా జీవితంలో ఆనందాన్ని నేనే మథించి, సాధించి పొందాలని... ఎంత వివరంగా పూవు సహజంగా విరిసినట్టు నాకే తెలిసేలా చెప్పింది!" (వెన్నెల జల్లులు).

తానెరిగిన జీవిత సత్యాన్ని రచయిత కళాత్మకంగా వ్యక్తీకరించే ప్రక్రియ – కథ. ఎత్తుగడ మొదలుకొని, పాత్రల పరిచయం, కథా సంవిధానం, ముగింపు వరకూ – తనదైన శైలి ప్రతి రచయితకూ ఉంటుంది. పుస్తక పరిచయం పేరుతో – కథలను, కట్టె, కొట్టె, తెచ్చె అన్నరీతిలో ముక్కలు, ముక్కలు చేసి చూడడం సరైంది కాదని నా ఉద్దేశ్యం.

వర్జినియ వల్ఫ్ (VIRGINIA WOOLF) ఏ రష్యన్ పాయింట్ ఆఫ్ వ్యూ అన్న వ్యాసంలో ముఖ్యంగా చెహోవ్ కథల గురించి ప్రస్తావిస్తూ, రచయిత నిజాయితీ వలనే సాహిత్యం నాలుగుకాలాలపాటు నిలబడుగలుగుతుంది అంటుంది. 'మువ్వలు' సంపుటిలోని ప్రతి కథా రచయిత నిజాయితీకి నిలువెత్తు నిదర్శనంగా నిలబడుతుంది.

ఈ కథలన్నిటిలోనూ జీవితం ఉంది. జీవితాన్ని యథార్థంగా చూపించడమే తప్ప, వీటిలో శిల్పం పేరుతో ఏ టక్కు టమారా విద్యలనూ రచయిత ప్రదర్శించలేదు.

"వెన్నెల జల్లులు" కథలోని పాత్ర 'నాలాంటి భావుకులు అందరికీ ఇంత అపురూపమైన ప్రేయసితో ఇంత గొప్ప అనుభవమూ కలుగుగాక!' అని అంటుంది. దీనినే నేను కొద్దిగా మార్చి – 'నా లాంటి కథాభిమానులు అందరికీ ఇంత అపురూపమైన కథలతో ఇంత గొప్ప అనుభవమూ కలుగుగాక!' అని కోరుకుంటున్నాను.

# కన్నీళ్లూ పగబడతాయి

- డా॥ నూకతోటి రవికుమార్



మీరట్టా ఫొటోలకి నవ్వులిస్తుంటే
నే కోల్పోయిన నవ్వుల్లోని సారం గుర్తుకొస్తోంది
ఇప్పుడన్నీ నవ్వులే
ఏడ్వటం చేతగాని లోకానికి
నవ్వు విలువ తెలుస్తుందంటే నేన్నమ్మను
పొలం గట్ల మీద బుడిబుడి నడకల్తో నేనడుస్తున్నప్పుడు
అమ్మా, నాయ్న నవ్వుల్తో పొలం అంతా పచ్చగా నవ్వేది
ఏటికేడు ఎవసాయం జూదం
ఆడే ఆటలో ఎప్పుడో ఓడిపోయే నాయ్న
కానీ, బూమిని ఆయన మన అమ్మరా అనేవోడు
మనిషికింత తిండిపెట్టేవోడు ఎట్టా ఓడిపోతాదురా
అనేవోడు నాయ్న
నా చేతిలో పుస్తకాల్ని చూసి అమ్మా,
ఎప్పుడన్నా సెలవుల్లో ఏతాం యేసే నన్ను చూసి నాయ్నా
నవ్వుకునేవోళ్ళు కలల్ని కన్నారా కనేవోళ్లు
కొలువుల వేటలో నేనలిసినప్పుడు
బూతల్లుండగా నీకేటి దిగుల్రా అంటూ
ధీమా పలుకుతూ మీసం మెలేసేవోడు నాయ్న
నాయ్న తర్వాత నేను
మళ్లీ మడిమీద మంచెలో పొలానికి కాపలా ఉన్నప్పుడు
అమ్మ కళ్లలో నీటిపొర
రైతోడి బతుకంతా అటేరా అని,
అమ్మంటే నవ్వి ఊరుకునేవోడ్ని
నే పొలం దున్నుతుంటే
గెనుమ్మీద కర్ర ఆసరాలో ముసురుకున్న నవ్వుల్లో
నాయ్న రూపం నాకింకా గుర్తే
తాత తర్వాత, నాయ్న, ఆయనతర్వాత నేను
పొలం అంటే అదో మజా
నేలంటే చెప్పరానీల్లేనంత ప్రేమ
నా అన్ని శ్వాసల్నీ పసిగట్టేది నేల
దుక్కి దున్నీ, సాగు చేసి అలసినవేళ
అమ్మ చూపై చేరదీసేది
పనలుపనలుగా మొక్కలు చేతికొచ్చినప్పుడు
గింజలన్నీ కళ్లంలో మీసం మెలేస్తున్నప్పుడు
నే కోల్పోయిన ప్రేమలన్నీ గుర్తుకొచ్చేవి
సద్దితో అమ్మా, మంచె మీద నాయ్నా
నా కోసమే ఇంకా ఇలా ఉన్నారని మురిసిపోయేవాడ్ని
కన్నీళ్లని, కష్టాలనీ దాటుకుంటూ
రైతు కలల కొనసాగింపుగా
నేను పొలంలోనే కూలబడ్డా
పగబట్టే ప్రకృతికీ, మద్దతులేని పాలనకీ మధ్య
నేనో వధ్యశిలగా నిలబడిపోయాను
కళ్ళాల్లో గింజలన్నీ నీళ్ల మీద తేలుతూ
నా ఓటమిని అపహాస్యం చేసేవి
విరగ్గాసే పంట మీద మేఘం
ఆడుకునే చెడుగుడాట చూసి
నాలో నేను కూలబడిపోయేవాడ్ని
గింజతో తూగివూగే మొక్కమీద
వీరవిహారం చేసే పురుగును చూసి
నేనో కలల బేహారినై పిడికిలి బిగించేవాడ్ని
అంతా... అననుకూలం
రైతును ఒంటరివాడ్ని చేసే పకడ్బందీ కుట్ర
కల్తీకి, నకిలీకి మార్కెట్‌కీ మధ్య
నిరంతర ఓటమిని చవిచూస్తూ
నేనో చెమట చుక్కగా
నేల గట్ల మీద నిలబడే ఉండేవాడ్ని
పత్తి, మిరప, జనుము, మినుము, పెసర
వంగిన వరి వెన్నె
వెన్నెముక లేకుండా పోయాను
అన్నదాతన్న పేరుకి బదులుగా
బఫూన్‌గా మిగిలిపోయాను
రాజకీయ పాచికలాటలో
మొక్కకీ, మార్కెట్‌కీ మధ్య
నా కోసం కొత్తకొత్త సమాధులు మొలకెత్తాయి
ఇంకిన నా కన్నీటి సముద్రాన్ని చూసి
ప్రణాళికలే బొక్కబోర్లా పడుతున్నాయి
నేలకి మొక్కల్లా నవ్వటం నేర్పినందుకు
నా నవ్వునే ఆర్పే ప్రక్రియ
పకడ్బందీగా నిరంతరాయంగా జరుగుతోంది
ముంచెత్తే వానలు, ముసురుపట్టే దుఃఖాలు
నీటిమీద తేలాడే ప్రతి పన వెనకా
ఎగతాళి చేసే నా నెత్తుటి చుక్కలు
... అలా ఫొటోల ముందు నవ్వకండి
పంటనే నమ్మినందుకు
నేను రుణపీడితుడిగా మిగిలాను
వాగ్దానాల్నే ముడేసుకున్నందుకు
నేను అణాకాణీ బికారిగా మిగిలాను
పంట పచ్చదనం మీద మూగే చీడనీ
గింజల ఊహల మీద వాలే దళారీనీ
మార్కెట్ చుట్టూ పొంచి వున్న నక్కల గుంపునీ
చట్ట సభల్లో ఓటికుండై మిగిలిపోతున్న
నా స్వరాన్నీ గమనిస్తూనే ఉన్నాను.
... ఇప్పుడిక కన్నీళ్లూ పగబడతాయని చాటింపేస్తున్నాను
నేను ప్రకృతి విలయాన్నై ముంచుకొస్తాను
ఏరియల్ సర్వేల పేరుతో జరిగే కాలయాపన మీద
కార్చిచ్చునై తిరుగుబాటు చేస్తాను

**(వరదల్లో సర్వం కోల్పోయిన రైతన్నలను చూసి దుఃఖంతో)**

## 'మేడే' వాణి

- వి. సుర్యారావు

మేడే అంటే...
శ్రమజీవుల ఐక్యనాదం
నినాదం -
నెత్తురు బొట్టు
చెమట చుక్కగా మారిన
మార్చిన
సమైక్య సౌందర్యం
చీకటి పిడికిట్లోంచి
వెలుతురు ప్రపంచంలోకి
ప్రభంజనంలోకి
విద్యుత్‌లా ఉద్యమ శక్తిగా నిలిచి
ఒక మహోజ్వలంగా ఎదిగిన శక్తి
ఈ ప్రపంచ చైతన్యానికి స్వేదం
నిర్మాణానికీ
ఆత్మవిశ్వాసానికీ
ఒక పునాది రాయి అయితే
అనంత కోటి సూర్యకిరణాల ప్రభాతం
ఐక్యశక్తి
విశ్వం పుట్టుక ప్రకృతిలోంచి అయితే
ఈ ప్రపంచ చైతన్యం శ్రమశక్తి లోంచి
అందుకే -
శ్రమ శక్తీ జిందాబాద్
కష్టజీవి జిందాబాద్
'మేడే' జిందాబాద్

## మేడే

- నల్లా త్రినాధ దుర్గా శ్రీనివాస్

నేటి కార్మిక ప్రపంచంలో
శ్రమ దోపిడీలు ఘరానాగానే
అధికారుల ఆధ్వర్యంలో
"మామూలు" గానే జరుగుతున్నాయా!
శ్రమిస్తున్న వాడికి చెమట మాత్రమే ఆస్తిగా
మిగులుతూ... మింగడానికి
మెతుకులు కరువైపోతున్నా...
హక్కుల కోసం గొంతు చించుకుంటూ
పోరాడుతూ... వున్న...




చట్టాలు పెట్టుబడిదారుని
పెంపుడు కుక్కల్లా మారుతూ...
పనివాడిని నిలువు దోపిడీ చేస్తున్నాయ్!
ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నట్లుగా
బ్రతుకు బండిని ఈడుస్తూ...
"ఏసుక్రీస్తులా" ప్రతి క్షణం
బాధల విలువను మోస్తూ...
ఎన్నాళ్ళీ... బ్రతుకు దగాకోరుతనం?
ఇకనైనా...
అధికారులు మొద్దు నిద్ర మేల్కొని...
చట్టాలను... 'చట్రాలు'గా బిగించి...
ప్రతి ఒక్కడి అసంఘటిత కార్మికుడికి
"సమాన న్యాయం" జరిగినపుడే...
నిజమైన మేడే!

## పిలుపు

- ఉప్పలధడియం వెంకటేశ్వర

తల్లి నేల పిలిచె సోదరా!
తగని నిదుర విడిచి లేవరా!! ॥తల్లి నేల॥

రెక్కలెన్ని ముక్కలైన
డొక్కకింత కూడులేక
బిక్కచిక్కి బీదబిక్కి
బిక్కు బిక్కుమంటు ఉంటె ॥తల్లి నేల॥

గాడిదల్లె కష్టపడితె
బూడిదొకటె తుదకు మిగిలి
చెమటోడ్చే జీవులెల్ల
కరువు బతుకు గడుపుతుంటె ॥తల్లి నేల॥

కూడులేక గూడులేక
గోడు గోడు మనేజనం
చేయి చేయి కలపాలని
వెలుగుబాట నడపాలని ॥తల్లి నేల॥

## మేడే ప్రస్థానం

- కోటం చంద్రశేఖర్

ఆశలడే ఆశయాలడే
హక్కులడే చిక్కులడే దిక్కుల కలిపినడే
నేల నీదని పాడినడే
నింగి నీదని ఆడినడే
కళ్ళు తెరిచినడే పిడికిళ్ళు బిగిసినడే
చిందిన రక్తం ఒలికిన చెమట
ప్రశ్నార్థకమైతే
ప్రతిఘటించినడే
ప్రతిధ్వనించినడే -
శివమెత్తిన కూలీల హమాలీల గాలి
ఈలలో
యజమానుల మానులు కూడినడే
శిరసెత్తిన పాలేర్ల పదఘట్టనలో
దొరబాబులు చిరుబాబులైనడే
కార్మిక స్వప్నం పల్లవించినడే
కర్షక స్వర్గం పరిఢవిల్లినడే -
దృఢ సంకల్పంతో సాగిన అపూర్వ
యజ్ఞంలో
చేవ చూపినడే -
జావ దొరికినడే -
గెలిచినడే
శ్రమశక్తిని కొలిచినడే
శ్రమకి సిరికి సమన్వయం కుదిరినడే
మనీ పిపాసులకి మహిషాసురులకి
మరణశాసనం రాసినడే
మానవీయతకి మృత సంజీవని పోసినడే
పరమకృతక సరళీకృత సరిగమల
నయవంచక ప్రపంచీకరణ పదనిసల
ప్రాణాంతక ప్రైవేటీకరణ గమనిపదల
సవరించిన అగ్రరాజ్య వీణియ తీగల
హింసిస్తూ
ధ్వంసిస్తూ
నింగివైపు నినదిస్తూ
సాగుతున్న ప్రస్థానం మేడే -
సాగనున్న ప్రస్థానం మేడే -

# కొత్త పుస్తకాలు




**అమ్మ** (నవల)

**- అక్కినేని కుటుంబరావు**

వెల : రూ.40/- పేజీలు : 120

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు) మరియు అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో**

ఒక స్త్రీ జీవిత సంఘర్షణని నేనీ చిన్న నవలలో వివరించే ప్రయత్నం చేశాను. వివాహంలో, గృహిణిత్వంలో, ఇంటి చాకిరీలో, తాము ఎంతగానో పెనవేసుకున్న గృహానుబంధాలలో గురయ్యే దారుణమైన పరాయికరణలో స్త్రీల అనుభవాలను పట్టుకునే ప్రయత్నం కూడా చేశాను. 1990లో రాసిన ఈ నవల ఎక్కడా ప్రచురితం కాకముందే ఉషాకిరణ్ మూవీస్ వారు సినిమాగా తీసేందుకు ముందుకొచ్చారు. 'అమ్మ' పేరుతో (1991లో) సినిమా విడుదలైంది. కాలానికంటే ముందున్న సినిమా అన్నారు. దాదాపు 20 సంవత్సరాల తర్వాత ఈ నవలను ప్రచురిస్తున్నాను.

**- అక్కినేని కుటుంబరావు**




**మాట** (దీర్ఘ కవిత)

**- చిన్ని నారాయణరావు**

వెల : రూ.40/- పేజీలు : 104

**ప్రతులకు : 92473 02882**

మాటని బట్టే మనిషి ఆంగిక చలనాలన్నీ రూపుదిద్దుకుంటై. మాటయే మనిషి ఆనంద, విషాదాలకు కారణమవుతుంది. మాట గురించి ఎన్నో కవితలు, అన్ని దేశాల సాహిత్యంలో కోకొల్లలుగా వున్నై. అయితే తెలుగు కవిత్వంలో 'మాట' అనే అంశంపై దీర్ఘ కవిత మొదటిసారిగా రాసినవారు చిన్ని నారాయణరావే... అన్నమాట. ఆయన రాసిన 'మాట' దీర్ఘకవిత ద్వారా తెలుస్తున్నది.

**- డా॥ అద్దేపల్లి రామ్మోహనరావు**




**విముక్త** (కథలు)

**- ఓల్గా**

వెల : రూ.30/- పేజీలు : 103

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు) మరియు అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో**

ఈ కథలు వర్తమాన సమాజంలో స్త్రీల వేదనలకు ప్రాతినిధ్యం వహించే కథలు కూడా. ఇవాళ్టి సమాజంలో అనేక ఆంక్షలకూ, అవమానాలకూ, హింసలకూ గురై వాటినధిగమించి లేస్తున్న స్త్రీలు కొందరైతే, వాటిలోనే కూరుకుపోయి వాటిని దాటలేక, భర్త నుండి విముక్తం కావాలనే స్పృహ లేకుండా వారిని ద్వేషిస్తూనే, అసహ్యించుకుంటూనే వారిని గట్టిగా పట్టుకునే స్త్రీలు, ద్వేషంతో తమను తాము హింసించుకోవడం అలవాటైన స్త్రీలు.

**- ఓల్గా**




**మరిగే తారు సరోవరం** (కథలు)

**- ఎస్. గణపతిరావు**

వెల : రూ.100/- పేజీలు : 172

**(ప్రతులకు : విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలలో, నవోదయ బుక్‌హౌస్‌లలో)**

గణపతిరావుగారు తన భావాలను కుండబద్దలు కొట్టినట్లుగా వెలిబుచ్చారు. ప్రతీ కథలోను నీతి లేదా ఒక సందేశం ఉంది. సమాజంలోని నేటి పరిస్థితులను కళ్ళకు కట్టినట్లు కాచి వడబోసి మలిచారు. అవి చదువుతుంటే ఆ పాత్రలు మనకు బాగా తెలిసిన వాళ్ళవిగానే కనిపిస్తున్నాయి గాని కల్పితాలుగా లేవు.

**- సగిలి సుధారాణి**




**కడప గడపలో జీవన మధురిమలు** (ఆత్మకథనం)

**- అలపర్తి పిచ్చయ్యచౌదరి**

వెల : రూ.60/- పేజీలు : 100

**ప్రతులకు : 9441781957**

సాహిత్యపు విలువల కోసము కొసమెరుపు సంఘటనలు ఆశించే యీ రచనను చదివిన వారికి నిరాశ కలగవచ్చు గానీ, వ్యక్తిగా అడుగుపెట్టిన తనను ఒక బలమైన శక్తిగా మార్చిన ఈ కరువు నేల కోసం తన జవసత్వాలన్నీ ధారబోసిన మానవమాత్రుడి గురించి తెలుసుకోవాలంటే తప్పక చదవాల్సిందే. తనను ఆదరించి అక్కున చేర్చుకున్న మట్టి పొత్తిళ్ళను తల్లి ఒడికంటే ఎక్కువగా ప్రేమించిన ఆ నరున్ని నారాయణ స్వరూపాన్ని వీక్షించాలంటే తప్పక చదవాల్సిందే.

**- సన్నపురెడ్డి వెంకట రామిరెడ్డి**




**మాదిగోడు** (కథలు)

**- నాగప్పగారి సుందర్‌రాజు**

వెల : రూ.126/- పేజీలు : 138

**ప్రతులకు : 94904 72427**

ఈ "మాదిగోడు" "నిజాల నిప్పుల తప్పెట" చూస్తున్నారు కదా! ఇంకేం... మౌనం వీడండి, ముసుగులు తీయండి, మనసు విప్పి మాట్లాడేది నేర్చుకోండి. మంచి అయినా చెడు అయినా, ప్రశంసనైనా విమర్శనైనా అక్షర రూపంలో నిక్షేపించండి. మీ అభిప్రాయాలను రేపటి తరానికి అందిస్తారని ఆశిస్తూ..." – సుందర్‌రాజు – అన్న మిత్రుని కోరికను కనుమరగవనీయకుండా మరికొంతకాలమైనా ఉంచాలనీ... 'అచ్చీకరించి' తన ఆశను విస్తృతపరచాలనే చిరు ప్రయత్నమే మళ్ళీ మీ చేతుల్లోని మాదిగోడి 'కతల' సంపుటి.

**- వత్సల**




## విడీవిడని చిక్కులు (కథలు)

- వీరాజీ

వెల : రూ.50/- పేజీలు : 133

**ప్రతులకు : 98481 32208**

ఈ నవలలో విశిష్టమైనది ముగింపు, సర్వేజనా సుఖినోభవంతు అని కథను సుఖాంతం చేసి గ్రూప్ ఫోటో తీసే విధంగా ముగించలేదు. ఆ విధంగా ముగించడానికి తన దగ్గర మంత్రదండం లేదంటారు వీరాజీ. సమాజంలో జరుగుతున్న అవకతవకలను, అక్రమాలను ప్రతిభావంతంగా సమీక్షించుకొని రచనలో నిక్షేపించారు. రచయిత కథనంలో జోక్యం చేసుకొనే తీరును పాలలో కలిపిన చక్కెర రీతిగా చెప్పడం చాలా బాగున్నది.

- డా॥ కడియాల రామమోహనరాయ్




## సై సై ఓ నల్లగొండ వీరుండా!

- జి. రఘుపాల్, భూపతి వెంకటేశ్వర్లు

వెల : రూ.50/- పేజీలు : 160

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

తెలంగాణా పోరాట 60వ వార్షికోత్సవ సందర్భంలో ఇప్పటి వరకూ అంతగా వెలుగుచూడని వీరుల గాథలు సేకరించి 'వీర తెలంగాణా మాది' అనే పేరుతో ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించింది. తర్వాత కాలంలో వరంగల్, ఖమ్మం, నల్గొండ జిల్లాల గ్రామాలలో వివరాలు సేకరించి అందించాలన్న కృషి జరిగింది. 'వరంగల్ వీరగాథలు' అన్న గ్రంథం ఆ కోవలోనే వెలువడుతుంది. ఇప్పటికే లబ్ధప్రతిష్ఠులైన నాయకుల వివరాలు గాక ద్వితీయ శ్రేణి కార్యకర్తలపై ఈ పుస్తకం కేంద్రీకరించింది.

- ప్రచురణకర్తలు




## సముద్రమంత గాయం (కవిత్వం)

- కెరె జగదీష్

వెల : రూ.100/- పేజీలు : 151

**ప్రతులకు : 08495 - 251433**

ఈ రెండు దశాబ్దాల్లో జాతీయ అంతర్జాతీయంగా జరిగిన సామాజిక రాజకీయ అల్లకల్లోలాన్ని, సంక్షోభాన్ని ఆయన అక్షర బద్ధం చేశారు. 'నోయిడా' హత్యల నుంచి, మత ఛాందస హింసల నుంచి దీన వృద్ధురాలు నుంచి, దళితుల వివాదం నుంచి, గోకుల్‌చాట్ పేలుళ్ళ నుంచి - వృద్ధాశ్రమాల నుంచి, సునామీ నుంచి 'జీవన ప్రస్థానం' దాకా ఆయన దేన్నీ వదలలేదు. కవిత్వీకరించడానికే ప్రయత్నించారు.

- కె. శివారెడ్డి




## నెలకూన (కవిత్వం)

- డా॥ జె. భాగ్యలక్ష్మి

వెల : రూ.60/- పేజీలు : 93

**ప్రతులకు : 040-27608107**

**(ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు) మరియు**

**అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో**

ఎంతో సున్నిత మనస్కులైనవారు రవీంద్రనాథ్ ఠాగూర్ రచనల పట్ల ఆకర్షితులై, సమ్మోహితులవుతారు. సృజనాత్మకతా, అభివ్యక్తిలో నైపుణ్యం ఉన్నవారు తమ మాతృభాషలోకి అనువాదం చేయాలను కోకుండా ఉండలేరు. వారిలో కొందరే రాణిస్తారు. విశ్వవిఖ్యాతి పొందిన రవీంద్రుని 'గీతాంజలి'ని సమర్థంగా అనుసృజన చేయడంలో కళాత్మకతనీ, పరిణితినీ ప్రదర్శించిన డా॥ జె. భాగ్యలక్ష్మి 'ది క్రెసెంట్ మూన్'ని అనుసృజన చేయడంలో ఆనందానుభూతీ, తదాత్మ్యభావనా పొందినట్లు స్పష్టమవుతోంది.

- - అబ్బూరి ఛాయాదేవి




## కొత్త తరం (కథల సంపుటి)

- సిహెచ్.వి. బృందావనరావు

వెల : రూ.80/- పేజీలు : 157

**ప్రతులకు : 0866-2538673**

కథలన్నిటినీ వరుసగా ఒక్కసారిగా ఒకే సిట్టింగ్‌లో చదవడం అసంభవం. చదవలేము. ఒక రైలు కదిలిపోయి ప్లాట్‌ఫారమ్ ఖాళీ అయితేనే గాని రెండో రైలు ఎలా పట్టాల మీదకి రాలేదో - అలా ఒక కథ చదవగానే మరొకటి చదవడం కుదరదు. ఒకటి చదవగానే గుండెలు నిండిపోతాయి. వ్యవధి ఇచ్చి రెండోది చదవాలి. కథానికలో భాష అతి నిరాడంబరంగా సహజ సువాసనతో అలరారితేనే బాగుంటుంది. ఆ గుణం ఈ కథలలో పుష్కలంగా కనబడుతుంది.

- పెద్దిభొట్ల సుబ్బరామయ్య




## కథాకృతి (పరిచయాలు-పరామర్శలు)

రెండవ భాగం

- విహారి

వెల : రూ.100/- పేజీలు : 280

**ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్**

కథానికకి క్లుప్తత, స్పష్టతతో బాటు ఏకాంశం ముఖ్యం. ఈ వ్యాసాల్లో విహారిగారు ఒక కథానిక ద్వారా, ఆ రచయిత(త్రి) విశ్వరూపం మనకు అర్థమయ్యేలా చెప్తారు. మంచి కథానికా రచయిత వ్యక్తిగత కోణం నుంచి కాక సామాజిక కోణం నుంచి విషయాన్ని చూస్తూ రాస్తారు. విహారిగారు విమర్శ పేరుతో రచయిత లోపాల్ని లాగి మనముందు పడేయాలని ప్రయత్నించక, ఆ రచయిత(త్రి) సామాజిక బాధ్యతగా మరింత మంచి కథానికలు రాయడానికి అవసరమైన ఉత్సాహాన్నందించేట్టు రాశారు ఈ వ్యాసాల్ని.

- వేదగిరి రాంబాబు

# "ఇది నా ఊరేనా" పాటల సిడి ఆవిష్కరణ



పాటల సి.డి.ని ఆవిష్కరిస్తున్న అల్లూరి సీతారామరాజు, గంటేడ గౌరునాయుడు, డాక్టర్ చాగంటి తులసి, చీకటి దివాకర్, ఎస్.వి. కృష్ణారావు

డా॥ అంబేద్కర్ జయంతి సందర్భంగా ఏప్రిల్ 14న సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో నెల్లిమర్లలోని గవర్నమెంట్ జూనియర్ కాలేజి ప్రాంగణంలో సాహితీ సమావేశం జరిగింది. ఈ సందర్భంగా విజయనగరం జిల్లాకు చెందిన ప్రముఖ రచయిత గంటేడ గౌరునాయుడు రచించిన "ఇది నా ఊరేనా" పాటల సి.డి. ఆవిష్కరణ సభ జరిగింది. సభా కార్యక్రమంలో చీకటి దివాకర్, ముఖ్య అతిథిగా ప్రముఖ రచయిత్రి డా॥ చాగంటి తులసి, ఆవిష్కర్తగా ప్రముఖ నటులు అల్లూరి సీతారామరాజు, రచయిత గంటేడ గౌరునాయుడు, సభాధ్యక్షులు ఎస్.వి. కృష్ణారావులు పాల్గొన్నారు.

గంటేడ గౌరునాయుడు రచించిన "పనికి తోడు పాట..." అనే గీతాన్ని మోహనరావు మాష్టారు ఆలపించడంతో సభ ప్రారంభమయింది.

చీకటి దివాకర్ మాట్లాడుతూ మాండలికాల్ని, వర్తమాన విషయాలను, రైతుల వ్యథార్థ జీవితాలను, నిర్జీవమవుతున్న పల్లె సౌందర్యాలను గంటేడ గౌరునాయుడు పాటలుగా రాశారని, ఆ పాటల్లో కొన్నింటిని "ఇది నా ఊరేనా..." పేరుతో సి.డి.గా రూపొందించామని, ఈ స్ఫూర్తితో మరిన్ని సి.డి.లు రావాలని అన్నారు.

ప్రముఖ నటులు అల్లూరి సీతారామరాజు "ఇది నా ఊరేనా..." పాటల సి.డి.ని ఆవిష్కరించి మాట్లాడారు.

ముఖ్య అతిథి డా॥ చాగంటి తులసి మాట్లాడుతూ... ప్రజల సంస్కృతికి, ప్రజల శ్రమకు, రైతు జీవితానికి సంబంధించిన మూలాలు నాయుడులో ఉన్నాయన్నారు. నగరంలో పుట్టి పెరిగిన వారు ఇటువంటి పాటలను రాగయుక్తంగా పాడలేక పోతున్నారని, మన జీవితం నుండి లయ తప్పిపోయిందని, దాన్ని మరల లయబద్ధంగా తీర్చిదిద్దవలసిన అవసరముందని చెప్పారు.

రచయిత గంటేడ గౌరునాయుడు సభ నుద్దేశించి మాట్లాడుతూ ఇన్ని శతాబ్దాలు గడిచినా ఇంకా మనం సామాజిక న్యాయం అడుగుతూనే ఉండాలా అని ఈ 21 వ శతాబ్దంలో ప్రతి ఒక్కరూ వేసుకోవలసిన ప్రశ్న. ఇట్లా అడగటం తలదించుకొని సిగ్గు పడాల్సిన విషయమని చెప్పారు. చరిత్రలో జరిగిన పొరపాట్లను సరిదిద్దుకోవలసిన అవసర ముందని, అందుకు ఇటువంటి వేదికలు అవసరమని గుర్తు చేశారు.

సభా కార్యక్రమం మధ్య మధ్యలో కవులు, గాయకులు తమ కవితలను, పాటలను గానం చేసి సభను రంజింపచేశారు. సభలో కవులు మానాపూరం రాజాచంద్రశేఖర్, పి. లక్ష్మణరావు, మౌళి, మొయిద శ్రీనివాస్, చింతా అప్పలనాయుడు, మిరియాల కృష్ణారావు, శ్రీమతి లావణ్య తదితరులు పాల్గొన్నారు. గాయకులు గండ్రేటి శ్రీను, మోహన్‌రావు మాష్టారి బృందం, మల్లిపురం జగదీశ్, జానకీరాం, చెళ్ళపిళ్ళ శ్యామల, షణ్ముఖరావు తదితరులు గీతాలాపన చేశారు. కొసమెరుపుగా సభను స్ఫూర్తిగా చేసుకొని తొమ్మిదవ తరగతి చదువుతున్న హరి, మురళీకృష్ణ అనే విద్యార్థులు రైతు జీవనంపై కవితలు రాసి గానం చేశారు. ప్రముఖుల ప్రసంశల్ని పొందారు. కథకులు ఎ. రమేష్ స్వాగతం పలుకగా, జయంతి సాంబశివరావు వందన సమర్పణతో సభ ముగిసింది.



ఫిబ్రవరి 26న సాంస్కృతిక శాఖ, జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్‌ల ఆధ్వర్యంలో రవీంద్రభారతిలో "నేనెందుకు రాస్తున్నాను?" అనే అంశంపై జరిగిన కార్యక్రమంలో ప్రసంగించిన కె. శివారెడ్డి, డా॥ విజయభాస్కర్, సలీం, శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిలను సత్కరించిన దృశ్యం. చిత్రంలో డాక్టర్ ఓలేటి పార్వతీశం, డా॥ కె.వి. రమణాచారి, డా॥ ద్వా.నా. శాస్త్రి, ఆరాధన వెంకటరెడ్డి



**సీనియర్ రచయిత, సాహిత్య విమర్శకులు పాయసం సుబ్రహ్మణ్య మహర్షికి నెల్లూరు తిక్కన రచయితల సంఘం విశిష్ట పురస్కారాన్ని ఏప్రిల్ 2న అందజేసింది. శాసనసభ్యులు ముంగమూరు శ్రీధర కృష్ణారెడ్డి రచయితను సత్కరించారు. సంస్థ అధ్యక్షులు కె. మురళీమోహనరాజు, దేవరాల సుబ్రహ్మణ్యం తదితరులు పాల్గొన్నారు**

## తనికెళ్ళ భరణి సాహితీ పురస్కారం

ప్రముఖ నటులు, రచయిత తనికెళ్ళ భరణి ప్రతీ సంవత్సరం 'తనికెళ్ళ భరణి సాహితీ పురస్కారం' అందివ్వనున్నట్లు ఒక ప్రకటనలో తెలిపారు. ఈ సంవత్సరం ఈ పురస్కారాన్ని 2009 జనవరి 2011 ఏప్రిల్ మధ్య ప్రచురించిన వచన కవితా సంపుటికి ఇస్తామని తెలిపారు. కవులు యాభై పేజీలకు తక్కువ కాకుండా ఉన్న తమ వచన కవితా సంపుటాలను మూడు ప్రతులను 'కళ ఫౌండేషన్, 6-1-69/5ఎ, సైఫాబాద్, హైదరాబాద్-4' చిరునామాకు మే 30 లోపు పంపించాలి. తనికెళ్ళ భరణి జన్మదినమైన జూలై 14న యాభైవేల రూపాయల విలువ గల బంగారు పూలతో, జ్ఞాపికతో ఎంపికచేయబడిన కవిని సత్కరించనున్నట్లు తెలియజేశారు. ఇతర వివరాలకు 9490484606 ద్వారా సంప్రదించగలరు.

## దుర్గానంద్ సృజన పురస్కారం

ప్రతిభావంతులైన సాహితీ సృజనకర్తలకు 'మహాకవి దుర్గానంద్ సృజన పురస్కారం' ఇవ్వనున్నట్లు దుర్గానంద్ సాహిత్య కళాపీఠం కార్యదర్శి కిరణ్‌బాబు ఒక ప్రకటనలో తెలియజేశారు. ఈ పురస్కార ఎంపికకు అన్ని ప్రక్రియలను పరిగణనలోకి తీసుకుంటామని తెలిపారు. గత సంవత్సరం ఇద్దరు కవులకు పద్య, వచన ప్రక్రియలను ఈ పురస్కారాన్ని అందించినట్లు తెలిపారు. ఈ పురస్కారం కోసం కవులు, రచయితలు తమ ప్రచురణలను, సాహిత్య జీవిత విశేషాలను పూర్తి చిరునామా, ఫోన్ నెంబరుతో సహా దుర్గానంద్ సాహిత్య కళాపీఠం, 7డి, సోమా ఎన్‌క్లేవ్, దీన్‌దయాల్ నగర్, నేరేడ్‌మెట్, హైదరాబాద్-500 056 చిరునామాకు పంపించవలసిందిగా ఆయన కోరారు. ఇతర వివరాలకు 9440307337, 9247125509 ద్వారా సంప్రదించవచ్చును.



ఖమ్మంలో జిల్లా కలెక్టర్ ఆధ్వర్యంలో జరిగిన 'శ్రీఖర ఉగాది ఉత్సవం'లో ఆర్డీఓ శ్రీవాసం వెంకటేశ్వర్లు నుంచి 'ఉగాది పురస్కారం 2010-11' అందుకుంటున్న ప్రముఖ కవి, కళాకారులు సాధనాల వేంకటస్వామినాయుడు

## బాలల కథా సంకలనం - విజ్ఞప్తి

బాలల సృజనాత్మకతను, నైతికతను పెంపొందించే విధంగా తెలుగులో వెనకటి కాలం నుంచి వస్తున్న జానపద, పౌరాణిక, సాంఘిక కథల్ని సంకలనం చేయనున్నట్లు పాపినేని శివశంకర్, వల్లూరి శివప్రసాద్‌లు ఒక ప్రకటనలో తెలిపారు. రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల నుంచి తాము విన్న, చదివిన అత్యుత్తమమైన వెనుకటి కథలను పంపించవలసిందిగా విజ్ఞప్తి చేసారు. కథలను వల్లూరు శివప్రసాద్, డోర్ నెం. 5-60/2-211, టి-7, అమూల్య టవర్స్, రింగ్‌రోడ్డు, చంద్రమౌళినగర్, గుంటూరు-522 007 చిరునామాకు పంపించవలసిందిగా కోరారు.




హైదరాబాద్ శ్రీ త్యాగరాయ గానసభ - కళా సుబ్బారావు కళా వేదికలో వంశీ - వంగూరి ఫౌండేషన్ ఆధ్వర్యంలో జరిగిన సభలో "అరవయ్యేళ్ళ మహా ప్రస్థానం"పై ప్రసంగిస్తున్న డాక్టర్ ద్వా.నా. శాస్త్రి. చిత్రంలో ఆచార్య సి.నారాయణరెడ్డి, వంశీరామరాజు, కళా వేంకట దీక్షితులు



ఏప్రిల్ 1న ఆంధ్రప్రభ కార్యాలయంలో జరిగిన కార్యక్రమంలో జి.వి.ఆర్. ఆరాధన - ఆంధ్రప్రభ నిర్వహించిన కవితల పోటీలో ముత్తా గౌతమ్ ద్వారా బహుమతి అందుకున్న పొత్తూరి సుబ్బారావు. చిత్రంలో 'ఆంధ్రప్రభ' పూర్వ సంపాదకులు డా॥ పొత్తూరి వెంకటేశ్వరరావు, ఎ.బి.కె. ప్రసాద్, వాసుదేవ దీక్షితులు, జాగృతి విద్యాసంస్థల ఛైర్మన్ ఓ.ఎస్. రెడ్డి, జి.వి.ఆర్. ఆరాధన అధ్యక్షులు గుదిబండి వెంకటరెడ్డి

# ఖమ్మంలో ఉగాది కవి సమ్మేళనం

ఖమ్మం మంచికంటి భవన్‌లో ఏప్రిల్ 3న సాహితీ స్రవంతి – ఎ.వి.ఎం. (బి.వి.కె) సంయుక్తంగా ఏర్పాటుచేసిన కవి సమ్మేళనంలో సాధనాల వెంకటస్వామినాయుడు అధ్యక్షులుగా, పోతగాని సత్యనారాయణ సమన్వయకర్తగా వ్యవహరించారు. తొలుత ఎవిఎం బాధ్యులు అఫ్జల్ స్వాగతం పలుకగా, ఆనందాచారి, కపిల రాంకుమార్, లెనిన్ శ్రీనివాస్, శంకరరెడ్డి, సంపటం దుర్గా ప్రసాదరావు, ఎం. శేషగిరి, కె. వెంకటయ్య, కొత్తపల్లి కృష్ణారావు, రౌతు రవి, రాచమళ్ళ ఉపేంద్రరావు, వి. సునంద, ఆలేటి పరంజ్యోతి, వనం తేజశ్రీ, అంకిత కేశవులు, సిహెచ్. ఆంజనేయులు, 'అమ్మ ఒడి' బాబు, వైద్యం భాస్కర్, శ్రీనివాస్, బాల కవులు తదితరులు కవితా గానం చేశారు. గాడ్ ది సేవియర్ అనే గాడిద సవారీ కవితలో "ఈ సాలంతామగాడిద సవారీయే మనకు / వసుదేవుడంతటి వాడికే తప్పలేదు / సామాన్యులం మనమెంత?... పుట్టుకతో వచ్చిన వారసత్వాల కంటే / పట్టుదలతో ఆశయాలాచరిస్తేనే రాజకీయ వారసత్వం / కానప్పుడు అది అహంకారమే / సంస్కారహీనమే" అంటూ రామ్‌కుమార్, "శంభూకుని శిరం నుండి / చిందిన వెచ్చటి నెత్తుటిలో మొలచిన ప్రశ్నలు కావాలిప్పుడు / ఏకలవ్యుడి తెగిబడ్డ బొటనవ్రేలు నుండి / బొటబొటా కారిన నెత్తుటి చుక్కలు వేసిన ప్రశ్నలు కావాలిప్పుడు /.... ప్రశ్నించడం మరువద్దని" రౌతు రవి. "పన్నెండు అంతస్తుల సిమెంట్ భవనం చెట్టు కొమ్మల్లోంచి/ సెల్‌ఫోన్ కోయిల గళం నుంచి / ఉగాది రింగ్‌టోనిచ్చిందంటూ" కన్నెగంటి వెంకటయ్య, "ఉగాదికై ఎదురుచూపు" అని ఆలేటి పరంజ్యోతి, "మనసు మసకేస్తే / మజిలీ యిక చీకటే / మనస్సాక్షి మలిగితే / భవిష్యత్తంతా అమావాసే" రాచమళ్ళ ఉపేందర్‌రావు, "ధరిత్రి అశ్రునయనాల్లో పచ్చదనం పచ్చికైనప్పుడే / మానవాళికంతటికీ నిజమైన ఉగాది" అంటూ యువకవి కొత్తపల్లి కృష్ణారావు. "కంటి మామిడి పిందె కోణంగుల చూసి / జీడి కన్నులు గీటి జిహ్వ లూరించెనంట / చిలిపి చింతల చిగురు చెలుల చెంతకు పిలిచి / శుక పికమ్ములకు తాను నెలవిచ్చెనంటూ" ఉగాది ప్రకృతిని వర్ణించారు వనం తేజశ్రీ. ఎవిఎం అధ్యక్షులు జోసెఫ్ వందన సమర్పణతో కవి సమ్మేళనం ముగిసింది.




**ఏప్రిల్ 3న ఖమ్మంలో జరిగిన ఉగాది కవి సమ్మేళనంలో పాల్గొన్న సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి ఆనందాచారి, వేదికపై సాధనాల, పోతగాని సత్యనారాయణ, బి.వి.కె. గ్రంథాలయ నిర్వాహకుడు కపిల రామ్‌కుమార్**

# "మట్టి పరిమళం" ఆవిష్కరణ

ఎంతో నేర్పుగా, ఓర్పుగా రచయితలు చేసే గొప్ప గొప్ప రచనలు సమాజాన్ని చైతన్యవంతం చేస్తాయని, అపుడు ఆ రచనకు, ఆ రచన ఆవిర్భావానికి కారణమైన సాహిత్యానికి విలువ పెరుగుతుందని ఖమ్మం మున్సిపల్ మాజీ ఛైర్మన్ అఫ్రోజ్ సమీనా అన్నారు. ఏప్రిల్ 13న స్థానిక మంచికంటి భవన్‌లో రాచమళ్ళ ఉపేందర్ రచించిన "మట్టి పరిమళం" పుస్తకాన్ని ఆవిష్కరించి ప్రసంగించారు. రచనలు సమాజ అభివృద్ధికి ప్రేరణగా నిలవాలని ఆమె ఆకాంక్షించారు. కవితాత్మకంగా రచనలు చేయడం రచయితలకు అలవాటని, ఆ సృజన అందరికీ రావాలని ఆకాంక్షించారు. కవిత్వ ప్రభావం చాలాకాలం వరకు వుంటుందనేది వాస్తవమని, ఆనాటి ప్రాచీన కవిత్వం మొదలుకొని నేటి వివిధ రకాల కవిత్వాల వరకు చూస్తే ఈ విషయం తెలుస్తుందన్నారు. సభకు అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు కటుకోర్ఖ్వుల ఆనందాచారి మాట్లాడుతూ సాహిత్యం కొంతమందికి సంబంధించింది కాదని, ముఖ్యంగా రాజకీయ నాయకులు, సామాజిక కార్యకర్తలు సాహిత్యం చదవాలని అన్నారు. సాహిత్యానికి స్ఫూర్తినిచ్చే ఉద్యమాలు జరుగుతున్న ఈ తరుణంలో చక్కని సాహిత్యం సమాజానికి ఎంత ఉపయోగ పడుతుందో వారు గమనించాలని కోరారు. స్పందించే గుణం ఎక్కువ వున్న కవులు, రచయితలు మార్గదర్శకం చేయాలని సూచించారు. ఓ చక్కటి సాహితీ విలువలు గల పుస్తకం పన్నాల జ్యోతికి అంకితమివ్వటం గొప్ప విషయమన్నారు.



**ఏప్రిల్ 13న 'మట్టి పరిమళం' పుస్తకావిష్కరణ సభలో ఖమ్మం మున్సిపల్ మాజీ ఛైర్మన్ అఫ్రోజ్ సమీనా, సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి ఆనందాచారి, వివిధ రాజకీయ నాయకులు, కళాకారులు, విద్యావేత్తలు**

ఈ కార్యక్రమంలో పోతినేని సుదర్శన్‌రావు, పోటు రంగారావు, ఆచార్య మారంరాజు సత్యనారాయణ, రౌతు రవి, వి సాంబశివరెడ్డి, వి.వి. అప్పారావు, నాగబత్తిని రవి, రంజిత్‌రెడ్డి, వీరారెడ్డి, ఎ. సుబ్రమణ్యకుమార్, సాధనాల వెంకటస్వామినాయుడు, రాచమళ్ళ ఉపేందర్, పి. మధుసూదన్‌రెడ్డి, బుర్రి వెంకటకుమార్, కపిల రాంకుమార్, లెనిన్ శ్రీనివాస్; శంకర్‌రెడ్డి, కన్నెగంటి వెంకటయ్య, అద్దంకి కృష్ణప్రసాద్ తదితరులు పాల్గొన్నారు. 'మట్టి పరిమళం' పుస్తకావిష్కరణ సమీనా చేతుల మీదుగా జరిగింది.

# సంస్కృతి, సాంప్రదాయాలకు పండుగలు ప్రతీక

పాశ్చాత్య సంస్కృతి వేళ్ళూనుకొన్న నేటి తరుణంలో సాంప్రదాయాలు, సంస్కృతి, ఐక్యతలకు పండుగలు ప్రతీకలని సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి ఎస్.వెంకట్రావు అన్నారు. సాహితీ స్రవంతి విజయవాడ నగరశాఖ ఆధ్వర్యంలో స్థానిక శ్రీశ్రీ సభా మందిరంలో ఉగాది కవి సమ్మేళనం జరిగింది. కార్టునిస్టు డాక్టర్ రావెళ్ళ శ్రీనివాస రావు అధ్యక్షతన జరిగిన ఈ కవి సమ్మేళనాన్ని రచయిత ఉమా మహేశ్వరి నిర్వహించారు. ఈ సందర్భంగా వెంకట్రావు మాట్లాడుతూ నేడు ఉగాది రోజున కూడా కవి సమ్మేళనాలు జరగడం గగనమై పోయిందన్నారు. ఉగాది కవి సమ్మేళనాలు అన్ని సాహితి, సాంస్కృతిక సంస్థలు నిర్వహించాలన్నారు. ఈ సమ్మేళనాల్లో సంస్థలతో ప్రమేయం లేకుండా ప్రతి ఒక్కరూ పాల్గొనాలన్నారు. ఈ కార్యక్రమంలో శ్రీశ్రీ సాహితీ నిధి కన్వీనర్ సింగంపల్లి అశోక్‌కుమార్, ప్రజాసాహితీ సంపాదకులు కొత్తపల్లి రవిబాబు, బూరుగుపల్లి ప్రభావతి, కోకా విమల కుమారి, చిత్తలూరి సత్యనారాయణ, అరసవిల్లి కృష్ణ, ఎస్‌కె. అహ్మద్, వి. ఉమామహేశ్వరి,



ఎరుకలపూడి గోపీనాథ్, పొన్నాడ సత్య ప్రకాశ రావు, సిహెచ్.బృందావనరావు, కె.ఎస్. రామారావు, జె.వి. సాంబ శివరావు, పాణిగ్రహి రాజశేఖర్, కొండపల్లి మాధవరావు పాల్గొన్నారు.

# 'శ్రీ శ్రీ శతకం' ఆవిష్కరణ

డాక్టర్ గుమ్మా సాంబశివరావు రచించిన మహాకవి శ్రీశ్రీ శతకం' పుస్తకావిష్కరణ సభ విజయవాడ శ్రీశ్రీ సభా మందిరంలో సాహితీ స్రవంతి నగర అధ్యక్షులు డాక్టర్ రావెళ్ళ శ్రీనివాసరావు అధ్యక్షతన ఏప్రిల్ 3న జరిగింది. ఈ పుస్తకాన్ని గోళ్ళ నారాయణరావు ఆవిష్కరించి మాట్లాడారు. శ్రీశ్రీ రచనలు, భావాలను గుర్తు పెట్టుకోవాలనుకొనే వారికి ఈ పుస్తకం ఎంతగానో ఉపయోగ పడుతుందన్నారు. తెలుగు సాహిత్యం మరుగునపడుతున్న నేటి పరిస్థితుల్లో శ్రీశ్రీ భావజాలానికి విస్తృత ప్రచారం తీసుకొచ్చేందుకు గుమ్మా చేస్తున్న కృషి అభినందనీయమన్నారు. పుస్తకం తొలి ప్రతిని స్వీకరించిన ఆలీఘర్ ముస్లిం యూనిర్శిటీ చైర్మన్ షేక్ మస్తాన్ మాట్లాడుతూ తెలుగు సాహిత్యంలో కొత్తదనాన్ని తీసుకొచ్చిన శ్రీశ్రీ ప్రతి వ్యక్తిలోనూ ఉన్నాడని అన్నారు. పుస్తక పరిచయకర్త డాక్టర్ ద్వానా శాస్త్రి మాట్లాడుతూ శతకాలు ఎన్ని వచ్చినా సామాజిక స్పృహతో రాసినవే చరిత్రలో నిలుస్తాయన్నారు. సభలో శ్రీశ్రీ సాహిత్యనిధి కన్వీనర్ సింగంపల్లి అశోక్‌కుమార్, ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ కళాపీఠం వ్యవస్థాపక అధ్యక్షులు కోకా విమలకుమారి, తెలుగు రచయితల సంఘం కృష్ణాజిల్లా ప్రధాన



కార్యదర్శి డాక్టర్ జి.వి. పూర్ణచంద్, లయోలా కళాశాల హిందీ విభాగం అధిపతి డాక్టర్ వెన్నా వల్లభరావు, చినుకు మాస పత్రిక సంపాదకులు నండూరి రాజగోపాల్ ప్రసంగించారు. పుస్తక రచయిత డాక్టర్ గుమ్మా మాట్లాడుతూ శతకం రాయటం ఎంత కష్టమైనా పూర్తయిన తరువాత కలిగే ఆనందం వర్ణనాతీతమన్నారు. సభలో సాహితీ స్రవంతి నగర ఉపాధ్యక్షులు కె.సత్యరంజన్, కోశాధికారి జి.నారాయణ, సహాయ కార్యదర్శి బూరుగుపల్లి ప్రభావతి పాల్గొన్నారు.

# 'నిమజ్జనం' ఆవిష్కరణ

డాక్టర్ జి.వి కృష్ణయ్య రచించిన "నిమజ్జనం" కథా సంపుటి ఆవిష్కరణ సభ ఒంగోలు, సి.వి.యన్ రీడింగ్ రూం ఆవరణలో ఏప్రిల్ 3న జరిగింది. ప్రముఖ ప్రజా వైద్యులు డాక్టర్ బత్తుల శివరామిరెడ్డి పుస్తకాన్ని ఆవిష్కరించారు. సామాజిక సంఘటనలకు స్పందించిన కృష్ణయ్య రచయితగా ఎదుగుతున్న క్రమాన్ని ఈ కథలు తెలియజేస్తా యన్నారు. జన సాహితీ నాయకులు డా॥ శాంతికుమార్ ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. అనేక సాంఘిక రుగ్మతలను ఈ కథలు ఎత్తి చూపాయన్నారు. ఎస్.వి యూనివర్సిటీ అసోసియేట్ ప్రొఫెసర్ మేడిపల్లి రవికుమార్ పుస్తక పరిచయం చేశారు. కథల్లోకి రచయిత పరకాయ ప్రవేశం చేయకుండా పాత్రల ద్వారా కథలు నడిపించిన తీరును ప్రశంసించారు. కొన్ని కథల్లో అనేక సంఘటనలు కాక ఒక్కో సంఘటనకే పరిమితం చేసి వుంటే గాఢత పెరిగేదన్నారు. కవి, సాహితీ విశ్లేషకులు డా॥ బీరం సుందరరావు కథల్లోని ఆర్ద్రత హృదయాన్ని కదిలిస్తుందన్నారు. రచయిత ఎక్కడున్నా పరిసరాలను పరిశీలించి స్పందిస్తాడని దానికి ఈ సంపుటిలోని కొన్ని కథల్ని అరుణోదయ నాయకులు పంగులూరి గోవిందయ్య ఉదహరించారు.



జనసాహితి ప్రధాన కార్యదర్శి దివికుమార్ కథల్లో వస్తు వైవిధ్యం గుర్తించ తగిందన్నారు. శ్రీరామ కవచం సాగర్, మంచికంటి, పొన్నూరి, పిన్ని రచయితలు, కళాకారులతోపాటు 300 మంది పైగా ప్రేక్షకులు పాల్గొన్నారు. సభానంతరం జనసాహితీ రూపొందించిన "జన విజయం" సాహిత్య కళా రూపకం రసవత్తరంగా సాగింది. ఆద్యంతం ప్రేక్షకులను విశేషంగా ఆకట్టుకుంది. ఇందులో వివిధ సాహిత్య ధోరణులకు ప్రతినిధులుగా కనికరెడ్డి, దివికుమార్, డా. జి.వి కృష్ణయ్య, టి. అరుణ, అజయ్‌ఘోష్, శ్రీపతి శ్రీను, గోవిందరావు ప్రయోక్తగా డి.వి, కార్మికుడి ప్రేరణగా సుల్తాన్ భాష తమదైన శైలిలో అద్భుతంగా అలరించారు.

# సామాజిక స్పృహ కలిగిన కళాకారుడు హష్మి

ప్రజా కళాకారుడు సఫ్దర్ హష్మి పేరు చెబితే వీధి నాటిక ప్రాణం పోసుకుని కళ్లముందు కదలాడుతుందని సాహితీ స్రవంతి కార్యదర్శి ఎస్. వెంకట్రావు అన్నారు. సాహితీ స్రవంతి, ప్రజానాట్యమండలి జిల్లా, నగర కమిటీలో సంయుక్త ఆధ్వర్యంలో ప్రెస్‌క్లబ్‌లో ఏప్రిల్ 12న సభ జరిగింది. తెలకపల్లి రవి రచించిన 'ప్రజా కళాకారుడు సఫ్దర్ హష్మి' ప్రచార రంగంలో వర్గపోరాటం అనే పుస్తకాలు సీపీఎం జిల్లా కార్యదర్శి వి. ఉమామహేశ్వరరావు ఆవిష్కరించారు. పుస్తకం మొదటి ప్రతిని శ్రీశ్రీ ప్రింటర్స్ అధినేత విశ్వేశ్వరరావుకు అందజేశారు. సభకు అధ్యక్షత వహించిన వెంకట్రావు మాట్లాడుతూ హష్మి పేరు వింటేనే ప్రతి కళాకారుడికి నూతనోత్తేజం అవహిస్తుందన్నారు. 1989 జనవరి ఒకటిన ఆయన హత్య జరిగినప్పుడు భారతదేశంలో సామాజిక స్పృహగల ప్రతి కళాకారుడు, ప్రతి మేధావి కదిలిపోయారన్నారు. ఒక కళాకారుడి హత్య ఇంతగా దేశాన్ని కదిలించిన ఘటన ఆధునిక భారత చరిత్రలో అరుదైన ఘటనగా ఆయన అభివర్ణించారు. పీడిత ప్రజలదైనందిన సమస్యలు ఇతివృత్తంగా వీధినాటకాన్ని ప్రదర్శించడం ద్వారా కళాకారులకు నూతన ఉత్సాహాన్ని నింపిన ఘనత హష్మికే దక్కిందన్నారు. ఉమామహేశ్వరరావు మాట్లాడుతూ హష్మి బలిదానం ప్రజా కళలకు కొత్త ఊపిరిపోసిందన్నారు. ఆయన స్ఫూర్తి వీధి నాటికకు వినూత్న జవసత్వాల నిచ్చిందన్నారు. దేశం నలుమూలల ఆయన గురించి తెలుసుకోవాలనే ఆసక్తి పెరిగిందన్నారు. దోపిడీ వర్గం బండారాన్ని బట్టబయలు చేసే ఆయుధాలుగా వీధి నాటికలు రూపొందించిన ఘనత హష్మికి దక్కిందన్నారు. అంకురం సినిమా దర్శకుడు సి. ఉమామహేశ్వరరావు మాట్లాడుతూ సామాజిక మార్పుకు పోరాడిన ప్రతి వ్యక్తిని అంతమొందించేందుకు పెట్టుబడిదారీ వర్గాలు ప్రయత్నిస్తూనే ఉన్నాయన్నారు. ఇప్టా పేరుతో ఏర్పడిన హష్మి బృందం అనేక ప్రదర్శనల ద్వారా సామాన్య జనాన్ని కదిలించిదన్నారు. ఈ కార్యక్రమంలో ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ ప్రధాన కార్యదర్శి గోళ్ళ నారాయణరావు, ప్రజానాట్యమండలి జిల్లా కార్యదర్శి రాజేష్, వీధినాటక విశ్లేషకుడు గుండు నారాయణ తదితరులు పాల్గొన్నారు.



ఏప్రిల్ 3న సఫ్దర్ హష్మి 'ప్రచార రంగంలో వర్గ పోరాటం'ను ఆవిష్కరిస్తున్న వి. ఉమామహేశ్వరరావు. వరుసగా రావెళ్ళ, రాజేష్, విశ్వేశ్వరరావు, ఎస్. వెంకట్రావు, సి. ఉమామహేశ్వరరావు, గోళ్ళ నారాయణరావు

# తొలి తెలుగు వ్యంగ్య చిత్రాల పుస్తకావిష్కరణ



కళాకారులకు ఉన్న స్వేచ్ఛ కార్టూనిస్టులకు ఉండదని ఆంధ్ర ఆర్ట్స్ అకాడమీ ప్రధాన కార్యదర్శి గోళ్ల నారాయణరావు అన్నారు. సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో గోళ్ళ నారాయణరావు అధ్యక్షతన తెలుగు కార్టూనిస్టు తలిశెట్టి రామారావు తొలి తెలుగు వ్యంగ్య చిత్రాల పుస్తకాన్ని ఏప్రిల్ 3న స్థానిక ఇండియన్ మెడికల్ అసోసియేషన్ హాలులో ఆవిష్కరించారు. ఈ సందర్భంగా నారాయణరావు మాట్లాడుతూ తెలుగు కార్టూన్‌ను గుర్తు చేసుకునే ప్రతి సందర్భంలోనూ రామారావు గుర్తుకు రావడం సహజమన్నారు. భుక్తి కోసం న్యాయవాద వృత్తిని చేసినా వారి ధ్యాసంతా వ్యంగ్య చిత్రాల మీదనే ఉండేదని తెలిపారు. ప్రఖ్యాత మాసపత్రిక భారతిలో ఆయన కార్టూన్లు చాలా ప్రచురితమయ్యాయన్నారు. ఎవరినీ నొప్పించకుండా, అందరినీ ఆకట్టుకునే విధంగా వ్యంగ్య చిత్రాలను రూపొందించే వారన్నారు. ఆయన చిత్రాలు అందర్నీ కదిలించే విధంగా ఉండేవన్నారు. ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు కె.సత్యరంజన్, ప్రముఖ కార్టూనిస్టులు బాబు, మోహన్, సురేంద్ర, శంకర్, శేఖర్, బ్నిం, కళాసాగర్ పాల్గొన్నారు.



తలిశెట్టి



ఏప్రిల్ 2న సాహితీ స్రవంతి ప్రజాశక్తి బుక్‌హౌస్ తిరుపతి ఆధ్వర్యంలో జరిగిన కవి సమ్మేళనం




ఏప్రిల్ 10న తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురంలో
డా॥ చెలికాని రామారావు భవనంలో 'కొడవటిగంటి కుటుంబరావు
సాహిత్యము - సామాజిక విలువలు' అంశంపై
ఆచార్య రాచపాళెం చంద్రశేఖరరెడ్డి ప్రసంగ దృశ్యం



తేజ ఆర్ట్స్ క్రియేషన్స్ ఆధ్వర్యంలో డా॥ జి. రవి కుమార్ రచించిన 'గోపి కవిత - మానవత' పిహెచ్‌డి సిద్ధాంత గ్రంథాన్ని హైదరాబాద్ తెలుగు విశ్వవిద్యాలయం ఆడిటోరియంలో ఆవిష్కరిస్తున్న డా॥ సి. నారాయణరెడ్డి. చిత్రంలో తేజ ఆర్ట్స్ అధ్యక్షుదు డా॥ పోరెడ్డి రంగయ్య, సోమ సీతారాములు, శ్రీమతి అన్నపూర్ణ, డా॥ బి. జయరాములు, ప్రొఫెసర్ బన్న అయిలయ్య, డా॥ ఎన్. గోపి, శ్రీమతి ఎన్. అరుణ, డా॥ ఎస్. రఘు, తిరునగరి శ్రీనివాస్



విజయనగరం జిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో
మార్చి 19న గురజాడ కళాభారతి వేదికపై జరిగిన 'దేశం తూలుతోంది'
పుస్తకావిష్కరణ సభ, రచయిత సత్కారం. చిత్రంలో (ఎడమ నుండి కుడికి)
కిలపర్తి దాలినాయుడు, కాళీపట్నం రామారావు మాష్టారు, కె.కె. రఘునందన్,
డాక్టర్ బి.ఎస్.ఎన్. మూర్తి (రచయిత), వి.వి.బి. రామారావు



ఏప్రిల్ 5న అనుపమ కళాస్రవంతి నిర్వహించిన కార్యక్రమంలో ఉగాది కవితల సంకలనం 'కవితా స్రవంతి'ని ఆవిష్కరిస్తున్న డా॥ కె.వి. రమణాచారి. చిత్రంలో కళావని సంస్థ అధ్యక్షులు వై.వి.వి. రత్నం, డా॥ మంగళగిరి ప్రమీలాదేవి, జి.వి.ఆర్. ఆరాధన అధ్యక్షులు గుదిబండి వెంకటరెడ్డి, సభాధ్యక్షులు డా॥ జె. బాపురెడ్డి, పొత్తూరి సుబ్బారావు



**మార్చి 25న జి.వి.ఆర్. ఆరాధన కల్చరల్ ఫౌండేషన్ ఆధ్వర్యంలో ఖరనామ సంవత్సర ఉగాదిని పురస్కరించుకొని శ్రీ త్యాగరాయ గానసభ కళాసుబ్బారావు కళావేదిక హైదరాబాద్‌లో ఏర్పాటు చేసిన 'అష్టావధానం' కార్యక్రమంలో అవధాని జి.ఎం. రామశర్మను సత్కరిస్తున్న ద్వానా. శాస్త్రి, డా॥ ఒ.ఎస్.రెడ్డి, చిత్రంలో పొత్తూరి సుబ్బారావు, ఎం. దత్తాత్రేయ శర్మ, గుదిబండి వెంకటరెడ్డి, కళా వేంకట దీక్షితులు**




ఏప్రిల్ 3న జరిగిన ఇందూరు భారతి నిజామాబాద్ వారి
43వ వార్షికోత్సవం, ఉగాది కవి సమ్మేళనంలో ఇందూరు భారతి
ఆవిర్భావ రిపోర్టు యిస్తున్న కందాళై రాఘవాచార్య, డా॥ త్రివేణి, శైలజామిత్ర,
ఏ. సూర్యప్రకాశ్, మౌనశ్రీ మల్లిక్, గుమ్మనగారి శ్రీరామమూర్తి



సంజీవని ఆర్ట్స్ & కల్చరల్ అసోసియేషన్ సాహితీ సాంస్కృతిక సంస్థను హైదరాబాద్ శ్రీ త్యాగరాయ గానసభలో ప్రారంభిస్తున్న డా॥ సి. నారాయణరెడ్డి. చిత్రంలో ఎం. రమణాచారి, డా॥ పాలకుర్తి మధుసూదన్‌రావు, డా॥ ఎన్. గోపి, మధుర గాయని శ్రీమతి బి. జానకి, వ్యవస్థాపక అధ్యక్షుడు బి. సంజీవరావు



మార్చి 31న ఎన్.టి.ఆర్. కళామందిరం పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం, హైదరాబాద్‌లో 'తెలుగుధనం' ఉత్తమ గ్రంథానికి సాంస్కృతిక శాఖ, ముఖ్య కార్యదర్శి డా॥ ఎస్. చెల్లప్ప నుండి సాహితీ పురస్కారం స్వీకరిస్తున్న డా॥ తుర్లపాటి రాజేశ్వరి. చిత్రంలో విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడు ఆచార్య అనుమాండ్ల భూమయ్య, రిజిస్ట్రార్ భట్టు రమేష్



మార్చి 13న మార్క్సాపురం నెల నెలా వెన్నెల సాహితీ వేదిక కోడిరామమూర్తి సంఘం, త్రివిక్రమ కళాసంఘం, లోకసత్తా ఆధ్వర్యంలో హైదరాబాద్ ట్యాంక్‌బండ్ విగ్రహాల విధ్వంసానికి నిరసనగా బాల కళాకారుల ర్యాలీ. (ఎడమ నుంచి) పి. శివకుమార్, కాళంగి శ్రీనివాసులు, కె.వి. రమణారెడ్డి, కె. మధుసూదనశాస్త్రి, ఎం. సుధాకర్, పిన్నిక నాగేశ్వరరావు యాదవ్, ఎం.వి. రామిరెడ్డి, మంత్రి కృష్ణమోహన్, చిత్తారి రంగనాయకులు, టి.పి. ఆంజనేయులు, ఏడుకొండలు తదితర కవులు పాల్గొన్నారు



నెల్లూరుజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో ఏప్రిల్ 3వ తేదీన ఉగాది పురస్కారం అందుకుంటున్న ప్రముఖ కవి, విమర్శకుడు కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి. సన్మానిస్తున్న కాకాణి గోవర్ధన్‌రెడ్డి, జిల్లా పరిషత్ ఛైర్మన్ శ్రీమతి పాతూరి అన్నపూర్ణ, నె.ర.సం. కార్యదర్శి జయప్రకాష్, నె.ర.సం. అధ్యక్షులు





మార్చి 21న నేటి నిజం కార్యాలయంలో ఉగాది సందర్భంగా 'సాహిత్య చర్చాగోష్ఠి'లో పాల్గొన్న శ్రీమతి విజయ, శ్రీమతి వీణ, శ్రీమతి ఎన్. అరుణ, శ్రీమతి స్వప్న, నీతు, స్వతంత్ర, ఆచార్య ఎన్. గోపి, బైస దేవదాస్, ప్రముఖ సినీ నటుడు, రచయిత రంగనాథ్, రవీందర్ గౌడ్

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# సురవరం ప్రతాపరెడ్డి

(28.05.1896 - 25.08.1954)



తెలంగాణా వైతాళికులలో ఒకరుగా ఖ్యాతిగాంచారు. కవిగా, విమర్శకుడిగా, సంపాదకుడిగా, రచయితగా, సంస్కర్తగా బహుముఖ సేవలందించారు. ఆంధ్రమహాసభ ఉద్యమంలో పనిచేయడమే గాక ఆంధ్రుల సాంఘిక చరిత్ర వీరి ప్రసిద్ధ రచన. గోలకొండ వారపత్రిక (1925-1947) సంపాదకులు.

|  | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |
| --- | --- |

| | |
| --- | --- |
| పుస్తకం సంఖ్య | PRSVM02A127 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |